# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



జూలై 1969



సంపుటము : 46 : సంచిక : 7 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1969

# పండితరాయల
# ప్రాణాభరణము

## శ్రీ దివాకర్ల వేంకటావధాని

[ఇది శ్రీ పండితరాజ బిరుదాంకితుఁడైన జగన్నాథకవి కామరూపేశ్వరుఁడైన ప్రాణనారాయణుని వినుతించుచు విరచించిన శ్లోకములకుఁ దెనుఁగు. లక్షణ గ్రంథముల నుదాహరింపఁబడిన యలంకారములకు లక్ష్యములుగా నీ శ్లోకములు విరచింపఁబడినవి. కవియే స్వయముగా నే శ్లోకమున నే యలంకారమున్నదో లఘువ్యాఖ్యనుగూడ విరచించెను. గ్రంథ విస్తర భీతిచేఁ దెనుఁగు పద్యముల క్రింద నా యలంకారముల పేరు మాత్ర ముదాహరించడమైనది.]

### 1

పరవాగ్వైభవమెన్నుపట్ల విబుధుల్ వాచంయముల్ భూమిపుల్
దురితైశ్వర్యసురాప్రసక్తమదమత్తుల్ గనఁ గామాలసా
మర భామాఽధరమాధురిన్ గెలుచు నస్మద్వాణి యిప్పట్ల నే
చరితార్థుండగువానినాల్కపయి లాస్యం బాడఁగా నేర్చునో?

(వ్యతిరేకము)

### 2

పాలిపోయెన్, గుణమెంచుశక్తి బలిసెంబో మాత్సరంబుల్ జగ
త్తుల లావణ్యము బొట్టఁ బెట్టుకొనఁగాఁ దోఁతెంచె దుర్మార్గపున్
గలికాలంబని మిన్నకుండెదవ నాకైతా? విజృంభింపుమా
విలసిల్లన్‌వలెఁ గామరూపవిభుఁడుర్విన్ జాలకాలమ్ముగా

(పేయము—అతిశయోక్తి)

### 3

ధరణీగహ్వర సుప్తసింహములు నిద్రాభంగమై యల్గి చె
చ్చెర నేతెంచి కనుల్జ్వలింప వినఁగాఁ జెల్వొందుఁ గాలాంబుద
స్థిర నిర్ఘోషము మించి ధృష్టమగుచున్ క్షీరాబ్ధి తీరమ్ములోఁ
దరచై దిక్కుల గ్రమ్మె నీ విజయయాత్రాదుందుభిధ్వానముల్

(రసాలంకారము)

## 4

'తరమే తెల్పఁగ నీ ప్రతాపము భుజాదండంబుల న్నీవు క్రీ
డల బొమ్మల్మడివడ్డ కెంపుకనులన్ లక్షింపుచో రత్నని
ర్మలకాంతిస్ఫురితంబులౌ నగల బర్వంజేయు వింధ్యాటవీ
కలితోదారగుహాగృహావనిజ పంక్తుంబందు నుల్లాసమున్
(అప్రస్తుతప్రశంస—పర్యాయోక్తి)

## 5

అహహా! నేనె గభీరతా గృహము మాహాత్మ్యంపుఁజెన్నేరయున్
బహు రత్నాలకుఁ బుట్టినిల్లు జగతిన్ భావింప నస్మాదృశుల్
నహి నా గర్వము వద్దు పల్కడలి! యెన్నన్ ప్రాణ నారాయణుం
డిహమందే విజయంబుసేయుఁగద నీ కెప్పట్లఁ దుల్యుండుగా
(ప్రతీపము)

## 6

జనియించెన్ శశిమౌళిదేహసుష్మాసక్తుండవౌ నీకు నా
య్యన క్షీరాబ్ధి తరంగ డోలికల సయ్యాటల్ నివాసంబు నా
క నదీ సైకతభూమి వాదము మృగాంక స్నిగ్ధ హస్తాలతో
జననాథా! యెటులుండకుండు యశ ముచ్చైర్భాసమానమ్ముగా
(సారాలంకారము)

## 7

జననాథా! అలకా నిబంధము రసాస్థన్ జోళకర్ణమ్ము పె
ల్చన లంకా (కాయా) వశతన్ బొనర్చి ధృతిమై జంఘాలలాటక్షతిన్
గనఁగాఁ జేయుచు నంగమర్దనమునన్ గారుణ్య హీనమ్ముగా
మను నీ చిత్త మహో ప్రగల్భుఁడవు వామారం ప్రచారమ్ములన్
(అర్థశ్లేష)

శత్రుపక్ష పక్షమున లంకాయనియు, వామాపక్షమున కాయాయనియు జదువుకొనవలెను.

## 8

కరవాళన్ నిను సన్నుతింతురు కవుల్ కానిమ్ము నీ శౌర్యమున్
దరుణుం డుర్విప! ధారుణిన్ నిలుపు నుత్సంగంబునం దాశలన్

మురిపించున్ బరిరంభణంబిడి నభంబున్ బల్మిఁ జుంబించు డ
గ్గఱు నాకేశు పురంబు దుర్గమ మనంగా నీవు స్తవ్యుండవే!

(వ్యాజస్తుతి—సమాసోక్తి)

## 9

జనకష్టమ్ముల రూపుమాపు విపులైశ్వర్యంబులన్ గూర్తు వం
చని మూర్ఖుల్వదరంగ గర్వపడకయ్యా! చిన్న బ్రహ్మాండమం
దున నీ వల్లభయైన కీర్తి తనయుత్తుంగాంగమున్ ఖండితం
బునుగావించి చరించుచున్నదయయో! భూపాల! కష్టమ్ముతో

(అధికము—సమాసోక్తి)

## 10

రస మాస్వాదము చేత దానఁ గవికార్యం బందుచే వాణి దా
న సమస్తాంతఃకరణానురాగరసికుండౌ సభ్యుఁ డవ్వానిచే
త సభాస్థానము దాన నీవును జగద్దారిద్ర్య దావాగ్నినా
శసుధాసేచకమేఘ! నీ వలన బెల్పన్ వెల్గు లోకావళుల్

(ఏకావళి)

## 11

ధరణీపాలన మేనొర్చునెడఁ జెంత్రనావు దుఃఖంబులె
వ్వరికేనంచుఁ బ్రగల్భయుక్తి వచియింపన్ నమ్మ బెట్లయ్యా? భూ
వర! ప్రత్యక్షము నీ విపతులు దివిన్ బైనింపఁగా సాగి భా
స్కరునిన్ నీ కుల మూలపూరుషుని జక్కన్ జీల్చుచున్ బోవరే!

(వ్యాజస్తుతి)

## 12

త్వరగా నుల్లసితాస్యకైరవములన్ బ్రాపించి దీనత్వము
ద్దూరమై దిక్కులఁ గ్రమ్మికొన్న తమమెందున్ దగ్గిపోసాగె బా
హిర మయ్యెన్ సుఃఖంబు సాధు నళినం బేపారగా సాగె భూ
వర! నీ శౌర్యము పేరి మార్వ్యేఁడుదయింపన్ జొచ్చెనంచెంచెదన్

(అనుమానము)

## 13

రయమొప్పన్ వనసీమలన్ దిరుగు నీ ప్రత్యర్థి కాంతావళుల్
బయికెత్తన్ గబరీభరంబు కదలింప బార్శ్వముల్ నెట్టఁ బా
దయుగంబుల్ రుష దవ్వగా విసరుచోఁ దార్ఘ్యాన్న చేలాంచలం
బు యథేచ్ఛ గ్రహియింపఁ గంటకచితంబుల్కాని చెట్లుండునే

(సమాసోక్తి)

## 14

నయనం బొప్పెడి మంగళోర్వీగబుధాంతర్వర్తి యాస్థాన మెం
తయుఁ గావ్యాశ్రయభూత మాస్య మరుణాధారంబు కైవ్యోమ్ని చం
ద్రయుతం బౌ మది క్రోధమం దశని నీ ప్రజ్ఞన్ గురుండుండు భూ
ప! యథార్థంబు గ్రహంబు లన్నింటికి నావాసంబు నీవేకదా?

(ఉత్ప్రేక్ష)

## 15

మను పుట్టించెను బ్రహ్మ నిన్ను భువనంబుల్ ప్రోవఁ జండాతపా!
జనతాపంబు ఘటించు నీ కిరణముల్ జ్వాలాకరాళమ్ము లై
చనుదేనుండె రణాంగణంబునకుఁ బెల్చన్ గ్రుద్ధుఁడై కామరూ
పనరేంద్రుండని మేమెఱుంగుదుము తెల్పన్లేదె? నీ కెవ్వరున్

(అప్రస్తుతము)

## 16

జలజాతాసనునిలు వీడి జగతీసందర్శనార్థంబు వి
చ్చలు గీర్వాణాలయందుఁ గొన్ని దినముల్సాగించి వాగ్దేవి భూ
వలయంబందున గ్రుమ్మరిల్లి సయి భూపా! సత్యధామంబునన్
జెలఁగున్ నీ ముఖమందు సత్కవివరుల్సేవింప సౌఖ్యమ్ముగా

(పర్యాయము)

(సశేషం)

# చివరి రాత్రి

## ఊర్వశి

వరదలై పొంగుతూవస్తుంది వాగులోకి కొత్తనీరు; ఇసుకలో నామమాత్రంగాఉండి జీవవాహినై ప్రవహించే పాతనీటిని తనలో కలుపుకోటానికి. అయితే ఉధృతమై వడిగా ప్రవహించే వాగుతోచేరి ప్రవహించలేని, క్రొత్తనీటిఅడుగునపడి ఉక్కిరిబిక్కిరై కొట్టుకునే పాతనీటి గతేమిటి? ఇష్టంలేకపోయినా వాగులో కొట్టుకొనిపోవటమా? లేక ఉధతంగా ప్రవహించే క్రొత్తనీటికి ఎదురునిలిచి పోరాడటమా? అయితే దాని కది సాధ్యమా?

శాస్త్రి పాతనీరులాటివాడు. పాతనీటిలాంటి శాస్త్రి కది చివరి రాత్రి. చవుకరకం కల్లీలాల్చీ; అంతే చవుకరకంలో పంచెనుకట్టి, విశాలమైన ఫాలభాగంపై ఉదయించే సూర్యుడిలాంటి ఎఱ్ఱనిబొట్టు పెట్టుకుని, ఇరవై సంవత్సరాలు నిండినప్పటికీ, అరవై సంవత్సరాలు నిండినవానివలె, ప్రక్కచూపులు ఎరుగక తన దారిని తానుపోయే శాస్త్రి కది చివరి రాత్రి. అంటే శాస్త్రి జీవితానికి చివరి రాత్రని కాదు. శాస్త్రి ఆ ఊరిలో ఉండటానికి చివరి రాత్రి. ఆ మాటలు ఇంకా వినడానికి చివరిరాత్రి. కరణంగారి ఇంటి అరుగుమీద పాటలు పాడుకోడానికి; తనకై ఆరాటపడే చంద్రిని చూడటానికి, రామమందిరం అరుగుమీద జంతికల భద్రయ్యచేసే తత్వబోధ వినడానికి, హైస్కూలు ఆవరణలోనున్న పొన్నపూలవాసనల వాఘ్రాణించటానికి అది చివరి రాత్రి. శాస్త్రి ఇకముందా ఊరు రాడు. వచ్చే అవసరం లేదతనికి. పది గంటలు గడిచిపోతే ఆ ఊరిలో శాస్త్రి పచ్చిమంచినీళ్ళు త్రాగక్కరలేదు. ఆ గాలిని పీల్చనక్కరలేదు. ఆ మాటలు విననక్కరలేదు. అతడు అక్కడ నిలిచిన కొద్దికాలం ఒక చరిత్రగా నిలిచిపోతుంది. అయితే అది అతనికి ఇష్టంలేదు. అది అతనికి బాధాకరము. అయినా తప్పదు.

అయితే అసలు కథ ఇదీ:

శాస్త్రిది శ్రీకాకుళంజిల్లాలోని పాలకొండ గ్రామందగ్గరున్న ఒక పల్లెటూరు. అవకాశం ఉన్నంతవరకూ చదువుకొని పొట్టగడుపుకోటానికి తండ్రిలేని శాస్త్రి తల్లిని పోషించి ప్రయోజకుడవటానికి ఎవరో చెపితే 'సిరిరామపురం'లోవున్న వెంకునాయుడిదగ్గర చేరాడు: ఉద్యోగంలేక బాధపడుతున్న శాస్త్రిని ఆదరించి ఎనభైరూపాయలకు తన దగ్గర గుమాస్తాగా వేసికున్నాడు; ఆ ఊరి కల్లా ధనవంతుడైన వెంకునాయుడు. నాయుడిగారి నిమ్మతోటను, అఱటితోటను, మామిడితోటను జాగ్రత్తగా అజామాయిషీచేసి ఎగుమతులు సక్రమంగా చేసి, ఒక్కనయాపైసాఅయినా వారా రాకుండాచూచి, డబ్బుమ యజమానికి వప్పజెప్పే ఉద్యోగందగ్గరినుండి నౌకర్లుచేసే పనులలాంటివన్నీ ఏవైనా తారసపడినవన్నీ శాస్త్రివే. ఏపనివైనాసరే భవిష్యత్తుమీద ఆశ కొద్దీ, వెంకునాయుడు తన జీవితానికి సరియైన బాట వేస్తాడనే నమ్మకంకొద్దీ చేస్తూంటాడు శాస్త్రి.

సిరిరామపురం పెద్దఊరేంకాదు. వెయ్యిగడపదాటని, చదరపు ఫర్లాంగు వైశాల్యంగల ఆ ఊరిలో, ఊరికిమధ్యగా రామాలయం, దానికి కొద్ది దూరంలో శివాలయం, ఊరి చివర దుర్గమ్మతల్లి

కోవెల, ఊరికి ఒకమూల ఒక హైస్కూలు, ఊరి చుట్టూ పొలాలు, వెంకునాయుడి తోటలు, చంద్రి నాయుడి చెఱకుతోటలు ఉన్నాయి నాలుగు కాఫీ దుకాణాలు, ఆరు కిళ్లీబడ్డీలు ఉన్నాయి ఊర్లో. బస్సుపోయే ట్రంకురోడ్డుకి ఆరుమైళ్లదూరంలో ఉన్న ఆ ఊరికి, సినిమాల నాగరికత వ్యాపించి ఒళ్లు కనిపించే టెర్లీను, నైలానురూపాలలో, పవుడరు, స్నోల డబ్బాలలో మగపిల్లలు ధరించే బిగుతు దుస్తుల్లో, ఆడపిల్లల కన్నుల కాటుకలలో నిలిచిందంటే శాస్త్రిలాంటి వారికితప్ప మరెవరికీ ఆశ్చర్యం కలుగజేయదు. పల్లెటూరు కావడంచేత శాస్త్రికి ఖర్చు తక్కువే. అందుచేత నలభై రూపాయలు ఖర్చు పెట్టుకుని ఇంటికి మిగతాదిపంపే ఏర్పాటుచేసికున్నాడు శాస్త్రి. బేటా డబ్బులు, పండ్లు దుకాణదారులు యిచ్చే కమీషను కాఫీ ఖర్చుకి, ఇంటద్దెకు సరిపోయేది. అయిదు రూపాయలుమాత్రం పోస్టుమాష్టరు విధిగా ప్రతినెల కట్టించడంచేత జీతంలో ప్రత్యేకంగా మిగిలేదేదీ ఉండేదికాదు. పూట కూళ్లమ్మ ఇంట్లో భోజనం, కోమటి సత్తెయ్య అద్దెకిచ్చిన మట్టియింటిలో మకాము. ఉదయం ఎనిమిది గంటలనుండి రాత్రి ఎనిమిది గంటలవరకూ యింటిలో ఉండని శాస్త్రికి ఇంటిని సర్దుకునే సావకాశం ఉండేదికాదు.

మసిబారిన బుడ్డి దీపాన్ని జాగ్రత్తగా తుడిచి. గదికీ పీఠికీ కనపడేటట్టు దీపాన్నుంచి భోజనం చేసిన తరువాత కరణంగారు రుపయోగించు కోమని యిచ్చిన వాలు కుర్చీలో మేనువాల్చి భవిష్యత్తు గురించి ఆలోచించేవాడు కమాను (కేంపు)లేని రాత్రుళ్లు. ఏదో దివ్యమైన జీవితం ముందుందనే ఆశతో, మంచిరోజులు రాకపోతాయా అనే ధీమాతో బ్రతికే శాస్త్రిని అన్నివిధాల కలవరపెట్టిన దెవరంటే చంద్రి. రెండు సంవత్సరాలు జాగ్రత్తగా పనిచేస్తే పట్నంలోవున్న తన బట్టలకొట్టులో మూడుఏభై రూపాయలమీద ఉద్యోగాన్నిస్తానని నాయుడిచ్చిన హామీ శాస్త్రిలో, భవిష్యత్తుమీద ఆశ ఏర్పడటానికి అవకాశాన్నిచ్చింది. అయితే అలాంటిశాస్త్రినే కదిలించాలని చూచింది చంద్రి.

ఇంతకీ చంద్రి ఎవరనేగా? ఎ వి శరీర చ్ఛాయతో, తీవ్రైన రూపంతో, ఆకర్షించే కళ్లతో తనపనిలో తానుండాలనికోరే శ్రద్ధైన ఏళ్లశాస్త్రిని ఆకర్షించాలని ప్రయత్నించిన స్త్రీయే చంద్రి. పాతికేళ్ల వయసులోఉండే చంద్రికి పదేళ్లప్పుడే పెళ్లయిందట. అయితే భర్తతోమాత్రం ఉండదు చంద్రి ఆమె భర్త ఆమెను విడిచిపెట్టాడో, చంద్రే అతన్ని విడిచిపెట్టిందో ఎవరికీ తెలియదు. కాని పదిమందిలో తన భర్తను తానే వదలిపెట్టేసిందని గర్వంగా చెప్పకుంటుంది చంద్రి. కోతల రోజుల్లో, ఉనుపుల రోజుల్లో కూలీకి వెళ్లటం, మామూలు రోజుల్లో ఆ ఊళ్లోఉన్న ఉద్యోగస్థుల ఇండ్లలో పాచిపనిచేయటం, నీళ్లు మోయటం చంద్రి వ్యాపకాలు.

నిజానికి చంద్రిది అందమైన, సౌష్టవమైన శరీరం. తెల్లనైన చంద్రి శరీరచ్ఛాయ; శరీరంలోని అందమైన ఒంపులు; కొద్దిగ పైకెత్తిట్టుండే చిన్నముక్కు; క్రింది పెదవి ఎడమ భాగాన్నిఉన్న పచ్చబొట్టు; యినుక తిన్నెలులాంటి పిరుదులు, వాటినితాకే పొడవై నల్లనైన కృష్ణవేణమ్మలాంటి జడ; శిల్పి, శిల్పంమీద జాగ్రత్తగా మెరుగు పెట్టిన ట్లనిపించే మన్నగాఉండే ఎత్తయిన వక్షోజాలు; వాటిక్రిందుగా సన్నగా మిలమిల మెరిసే నడుము సులభంగా ఎట్టిమానవుడినైనా యిట్టే పిచ్చివాడిని చేస్తాయి. అలా పిచ్చివాళ్లయిన వాళ్లు లేకపోలేదు అంత అందంగా ఉంటే చంద్రిని పొందాలని ఉరకవేసిన సూరినాయుడుకొడుకు సీతాపతి; బలవంతం చేయబోయి మీదికొస్తే సీతాపతి చేతిని కొడవలితో నరికి, యింకా ఏమైనా చేయాలనుకుంటే చంపుతానని బెదరించి ప్రాణరక్షణ చేసుకున్న సాహసవంతురాలు చంద్రి. చంద్రిని సాధించుకోవాలని చూచిన వారందరికీ పరాభవమే అయింది. చంద్రికి ఎవరిపొందూ అక్కరలేదు

చంద్రిని అన్నివిధాలా కనిపెట్టి ఉండేది ఒకడే ఒకడు. అతడే వెంకునాయుడు. అతడు రాజకీయంగా, ఆర్థికంగా బలం కలిగినవాడు కాబట్టి అతన్ని ఆశ్రయించింది చంద్రి. వెంకునాయుడినిస్తైతం కట్టిపడేసిన రోజులు చంద్రి జీవితంలో లేకపోలేదు. వెంకునాయుడితో చంద్రికి రహస్యంగా సంబంధం ఉందని బహిరంగంగా చెప్పుకోవటం ఒక రహస్యాన్ని విన్నట్టు విన్నాడు శాస్త్రి.

శాస్త్రి యింటికి ఎదురుగా ఉన్న గన్నేరు చెట్టుప్రక్కనే చంద్రి యిల్లు. చంద్రి యింటిని ఆనుకొని యిరవై గజాలదూరంలో చింతతోపు; ఇంటికొక్కపక్క పాడుపడిన పాకలు ఉంటాయి. అందులో చంద్రియింటి వెనుకవున్న జంతికల భద్రయ్యగారి పశువులుంటాయి. చంద్రియింటికి రాజా, రాణీ చంద్రే. ముక్కుతూ మూలుగుతూ ఎప్పుడూ మంచంలో పడుక్కునే తల్లితప్ప వేరే పెద్దదిక్కుగాని, బాధ్యతగాని లేవు చంద్రికి. శాస్త్రి ఎదురింటిలోనే ఉంటుంది కాబట్టి రోజుకు చాలా సార్లు చూస్తుంది చంద్రి శాస్త్రిని. పగటి వేళకన్నా రాత్రిళ్లే చూడగలుగుతుం దామెకి. రాత్రి శాస్త్రి భోజనంచేసి వచ్చేంతవరకూ వీధిలో గన్నేరుచెట్టుక్రింద మంచం వాల్చుకుని విశ్రాంతి తీసికున్నమాదిరి మేను వాలుస్తుంది చంద్రి. అతడు రాగానే మంచాన్నెత్తి యింటిలోకి వెళ్లిపోతుంది. వీధిలో శాస్త్రి కుర్చీలో కూర్చునేవేళ సన్నగా కూని రాగాలుతీస్తూ కంచెవతల నిలబడి నీళ్లు పోసి కుంటుంది. శాస్త్రి యింటిదీపపు వెలుగులో కొంత భాగం కంచెఅవతల చంద్రిమీదపడి ప్రతిఫలిస్తుంది. ఆ వెలుగులో కనిపించే చంద్రిని చూడాలని ఏనాడూ అనుకోలేదు శాస్త్రి. అలా శాస్త్రి తాపత్రయ పడకపోయినా అతని కళ్లను చేరే ఆమె విగ్రహం శాస్త్రికి సిగ్గును, దిగ్భ్రమను కలిగించిన సమయాలు చాల ఉన్నాయి. 'నేనున్నట్టే ఈమెకు తెలీదా? తెలిసే ఈ నటనా? కనీసం ఒక పల్చనిబట్టనైనా ఆచ్ఛాదన చేసికోవచ్చుకదా!' అని వితర్కించుకుని ఆమె స్నానం చేసేంతవరకూ గదిలోకిపోయి కూర్చున్న సమయాలు చాల ఉన్నాయి. భోజనంచేసి కంచెవతల మంచం వాల్చుకుని, ఏదో సినిమాపాటకో పల్లె పదాన్నో మెల్లిగా పాడటం నిద్ర వచ్చేంతవరకూ శాస్త్రికి గుర్తే.

ఉదయంవేళ చెంబుపుకు వెళ్లొచ్చి పెరటిలో ముఖప్రక్షాళనచేసే సమయానికి బిందెతో, తాటాకు రేకతో వచ్చిపడుతుంది చంద్రి శాస్త్రి ఇంటివెనుక నున్న బావిదగ్గరికి. ప్రక్కనున్నవారితో ఎగసక్కాలు, మాట విసుర్లు, నవ్వులాటలు, శాస్త్రివైపు విసిరే చిలిపిచూపులు, శాస్త్రికి వినిపిస్తూంటాయి, కని పిస్తూంటాయి. కట్టిన కలనేతచీర కుచ్చిళ్లలో కుడి భాగాన్ని బొడ్లోదోపి, తెల్లగా మెరిసే శరీరాన్ని కాంతి బయటికి వెదజల్లేందుకు జాబోలు వదలి, నడుముచుట్టూకి చీరకొంగునుతెచ్చుకొని, ఏమాత్రం జారినా రెండు వక్షోజాలను తప్పించుకొని వాటి రెండిటిమధ్య పడేటట్టు పయ్యెదను సరిచేసికొని కొంగు చివర్ని బొడ్లోదోపి, బిందెను నడుము కెత్తు కుని, బావి ముందునుండి కదిలేటప్పుడు నామ మాత్రంగా ఒక్కసారి పయ్యెదను సర్దుకుని, ఒక్క సారి ఒక మందహాసాన్ని, చిలిపి చూపును శాస్త్రివైపు విసిరి కాలిఅందియలధ్వనిచేసికుంటూ మోచేతి వరకూ ఉన్న గాజులనుండి సంగీతాన్ని సృజించు కుంటూ తలలోనున్న పువ్వులవాసనలతో శాస్త్రికి ఏవో వలపుసందేశాలపంపే చంద్రిభావం శాస్త్రికి ఏనాడో అర్థమైంది. చంద్రి మనోగతాన్నెరిగిన శాస్త్రి చలించకపోవటానికి కారణాలు మూడేమూడు. ఒకటి —మేనమామకూతురు విజయ రూపం కళ్ల ముందు మెదలటం; రెండు—గడించుకున్న మంచి తనాన్ని మంటగలుపుకొని భవిష్యత్తును పాడుచేసి కోవటం; యిష్టంలేకపోవటం; చిన్ననాటను తండ్రి చదివించిన ప్రవరాఖ్య చరితము, రామాయణముల మూలములు అతనిలో గాఢంగా నాటుకొనిపోయి అతనిలో పదేపదే ధ్వనించటమూ కారణాలు. హరిశ్చంద్రుడు ఒక్క అబద్ధమాడితే అన్నికష్టాలుపడే

వాడా? అనేవారి వాదనను అంగీకరించడు శాస్త్రి. ధర్మరాజుకు చివరికి మిగిలిందేమిటి శ్మశానంకాక అనే వారిని సమర్థించడు. కర్ణుని దానశీలతను తెగడే వారిని దరిచేరనివ్వడు రామాయణం అభూతకల్పన అనేవారితో మాటాడడు. ఉదయాన్నే స్నానంచేసి సంధ్యావందనం చేస్తేనేగాని పచ్చిమంచినీళ్లు నోట్లో పోసికోడు. గాయత్రీమంత్రాన్ని చెప్పుకుంటేనేగాని విస్తర్ని ముట్టడు; పూటకూళ్ళమ్మ యింట్లో జరిగే మడిగురించి, శాస్త్రి ఆచారంగురించి అంతా చూచి నవ్వుకుంటూంటే చూచిచూడనట్టు ఊరుకుంటాడు శాస్త్రి. సిరిరామపురంలో జరిగిన మోసాలు, కుట్రలు, దోపిడీలు, హత్యలుగురించి విన్నాడు శాస్త్రి. కాని వినసట్టే ఉండిపోయాడు. అక్కడున్న రాజకీయపార్టీలన్నీ తెలుసు. కాని తెలియనట్టే ఉండి పోయాడు. మంచిని సంపాదించుకోవాలనే ప్రయత్నమేతప్ప ఇంకోటేదీ అతడి దృష్టిలోలేదు ఎవరో తప్ప ఊరంతా ప్రత్యేకంగా మంచివాడుగా ఏనాడూ చెప్పుకోలేదు. శాస్త్రి చివరికి తన గురించి అంతా మంచిగా చెప్పుకోవాలనే కోరికనుకూడ వదిలిపెట్టుకో లేకపోయాడు. చెడ్డగా చెప్పుకోకుండాఉంటే చాలు అన్నదే అతని కోరిక ఎన్నికష్టాలైనాపడి యజమాని మనసును మెప్పించి, టవునులోనున్న బట్టలషాపులో ఉద్యోగాన్ని సంపాదించుకొని, ఉద్యోగం దొరికినవెంటనే గర్వంగా మేనమామ యింటికివెళ్ళి అతనిముందునిలబడి అంతకన్నా గర్వంగా విజయను పెళ్లిచేసికొని టవునులో కాపురం పెట్టుకొని జీవితాన్ని స్వర్గమయం చేసికోవాలనుకునే శాస్త్రి ఏనాడూ చంద్రివైపు చూడదలచుకోలేదు.

నిజానికి చంద్రి గురించి ఆలోచించేందుకు సమయంకూడా చిక్కేదికాదు శాస్త్రికి. ఒకవేళ ఎప్పుడైన తీరిక దొరికితే కరణంగారింటి అరుగు మీదకు చేరేవాడు. ఆయనకు సంగీత సాహిత్యాల మీద ఆసక్తి జాస్తి. ఏవేవో రాగాల ఆలాపనచేసే వాడాయన ఆ వేడిలోనే శాస్త్రికూడ గొంతెత్తి పాడేవాడు శ్రావ్యంగా జయదేవుని అష్టపదులను. శాస్త్రిగొంతు కరణంగారికేకాక పలువురికి విశేషంగా ఆకర్షించేది. వీలుచిక్కినప్పుడల్లా పాడించుకొని కాఫీ యిచ్చిపంపే వాడాయన. ఒక్కొక్కప్పుడు ఆ వూరి హైస్కూల్లో పనిచేస్తున్న సైన్సు మాష్టరు యింటికి కాలు సాగించేవాడు. ఆయనకు చిత్రలేఖనం మీద ఆసక్తి ఎక్కువ. ఒంటిగా గదిలో కూర్చుని పగ లనక, రాత్రనక భోజనంకూడా మానేసి, బొమ్మల్ని గీసేవాడు. శాస్త్రి కనిపించినప్పుడల్లా పిలిచి తాను గీసిన బొమ్మలు చూపేవాడు. ఒక్కొక్క రోజు రాత్రిళ్లు రామాలయం అరుగుమీద భద్రయ్య తాత చేసే తత్త్వబోధ వినడానికి వెళ్లేవాడు. ఎవరూ దొరకనినాడు స్కూలుగ్రౌండులోనున్న పొన్నచెట్లు క్రింద ఏకాంతంగా కూర్చునేవాడు విజయ గురించి ఆలోచిస్తూ. ఆ విధంగా ప్రశాంతంగా జీవితాన్ని గడుపుతున్న శాస్త్రిని చలింప చేయలేకపోయింది చంద్రి.

శాస్త్రి చూపిన విముఖత చంద్రిలో ఎంత మదనతాపాన్ని కలుగజేసిందో అనుభవించిన ఆమెకే తెలియాలి. చంద్రికి దూరంగా ఉండటానికి మరే యింటికైనా పోదామనుకున్నాడు. కాని అంత తక్కువ అద్దె (నెలకు $2\frac{1}{2}$ రూ॥)లో అన్ని సౌకర్యాలుగల యిల్లు దొరకటం అసాధ్యమని తెలిసి ప్రయత్నాన్ని విరమించుకున్నాడు శాస్త్రి.

శాస్త్రి, దీపావళిపండుగనాటికి ఆ ఊరుచేరి ఏడాదైంది. దీపావళివెళ్లిన నాలుగురోజుల తరువాత ఒకనాడు రాత్రి ఎనిమిది తొమ్మిది గంటలప్పుడు భోంచేసి పడక కుర్చీలో కూర్చుని దీపపు బుడ్డి వెలుగులో తెలుగు మాష్టారింటినుండి తెచ్చుకున్న ప్రత్యేక సంచిక నొకదాన్ని తిరగవేస్తూన్నాడు. అంతలో చంద్రిపాకవైపునుండి 'అమ్మో! అమ్మో!' అన్న కేకలు విని ఒక్క ఉదుటునలేచి పుస్తకాన్ని గిరవాటువేసి ముందుకు పరుగెత్తాడు తులిసి కోటముందు స్నానం చేసి పొడి చీరకట్టుకొని నిలబడిన చంద్రి చీర తుల సమ్మ ముందున్న దీపానికి అంటుకొని మండటం, చంద్రి నిస్సహాయంతో కేకలు వేయటం చూచాడు

శాస్త్రి. కంచెదాటి పరుగెత్తి మండుతున్న చీరను ఆర్పప్రయత్నించి విఫలుడై సాహసించి ఆమె కటి ప్రదేశంనుండి లాగిపడేశాడు వ్యవధిలేక గత్యంతరం లేక. అతిసులభంగావే ఊడొచ్చేసింది చీర. అంటుకున్న చీర తులసమ్మ ముందు మండుతూంటే చంద్రి రూపం పూర్తిగా వెలుగులో కన్పించుతూంటే, శరీరాన్ని పూర్తిగా దాచుకోవాలనో, భయంచేతనో, మరి ఏ కారణంచేతనో శాస్త్రిని గట్టిగా వాటేసి కుని అతని భుజం మీద తలవాల్చి ఉండిపోయింది చంద్రి కళ్లుమూసికొని. చంద్రి స్పృహతప్పటాన్ని గమనించి నెమ్మదిగా పాకలోకి తీసికెళ్లి నులక మంచంమీద పరుండజెట్టి దండెంమీద వ్రేలాడు తున్న చీర నొకదాన్ని ఆచ్ఛాదనగాకప్పి, ముఖంమీద నీళ్లు చిలకరించాడు నెమ్మదిగా. చంద్రి కనులెత్తి చూచి భయంతో, శాస్త్రిని వాటేసికుని ఉండి పోయింది. శాస్త్రికి సిగ్గు, భయం రెండూ కలి గాయి. నెమ్మదిగా ఆమెపట్టును వదిలించుకొని, ఆమె శరీరంమీద చీరను సరిగాసర్ది భయపడవద్దనిచెప్పి దాహం వేస్తున్నదంటే గొంతులో మంచినీళ్లుపోసి ఇవతలపడ్డాడు ఏదో పాపంచేసిన వాడిలా. అంత వరకూ చంద్రితల్లి యింట్లోలేదని, ప్రక్కఊరు చెల్లెలిదగ్గరకు వెళ్లిందని తెలీదు శాస్త్రికి.

అదెలా జరిగిందోగాని మర్నాటి ఉదయం ఊరం తటికీ తెలిసింది, చంద్రి చీర అంటుకున్నట్టు, శాస్త్రి ఆర్పినట్టు. అంతేకాకుండ ఆ రాత్రంతా శాస్త్రి చంద్రితోనే ఉన్నాడన్నవార్త ఎలావచ్చిందో అర్థం కాలేదు శాస్త్రికి. అంతక్రితం రాత్రి ఏమీ జరగ నట్టే కిలకిల నవ్వుతూ, చిలిపి చూపులను విసిరే చంద్రిని చూచిన తరువాత శాస్త్రి మనసు శంకతో మూలిగింది.

ఊరిలో ఏ కొద్దిమందోతప్ప మిగతావారంతా శాస్త్రిని అదోరకంగా చూస్తూంటే ఒంటిమీద కిరసనాయిలుపోసి మండిస్తున్నట్టనిపించింది శాస్త్రికి. వారి గుసగుసలు, కాలుతున్న తన శరీరాన్ని బాకుల తోనూ, ఈటెలతోనూ పొడిచి హింసిస్తున్నట్టని పించింది.

ఆ రోజు రాత్రి మౌనంగా వీధిలో కూర్చున్న శాస్త్రి నుద్దేశించి అతడు చేసిన సహాయాన్ని పొగుడు తూంటే చంద్రిమాటలు వింటూ మనసులో అను మానాన్ని బహిర్గతం చేయక ఉండిపోయాడు శాస్త్రి.

'మీరే లేకపోతే నేనేమైపోదును బాబూ!' అని చంద్రి కళ్లలోకి నీళ్లు తెచ్చుకుని అంటూంటే—

'నే చేసిందేముందిలే, ఆపదలోవున్న వారికి ఎవరైనా చేస్తారామాత్రం. పాపం రాత్రయినట్టుంది' అన్నాడు శాస్త్రి.

'ఎల్తాను బాబూ!' అంటూ వెళ్లిపోయింది చంద్రి.

ఆ నాటినుండి చంద్రి ఏదో విధంగా శాస్త్రిని మాటాడించ ప్రయత్నించటం, అతను తప్పుకోవటం జరుగుతునే ఉంది.

కార్తీకమాసం వచ్చేసింది.

ఆ రోజు మొదటి సోమవారం. శాస్త్రికి ఉపవాసం ఉండే రోజు. ఉదయాన్ని తలస్నానం చేసి కొని శివాలయానికివెళ్లి దైవదర్శనం చేసికొనివచ్చాడు. ఉదయాన్నే చంద్రి తలస్నానంచేసి ముఖాన్న అంటీ అంటనట్టు పసుపురాసుకొని, నయాపైసా అంత బొట్టుపెట్టుకొని అంతక్రితం రోజు మడిగా ఆరేసు కున్న చీరను, గోచి పోసికొని కట్టుకొని, తలలో మెడమీదకు జీరాడేటట్టు కనకాంబరాలు, చామంతి పూలు కలిపిన దండను పెట్టుకొని పూలు పండ్లు పట్టుకొని శివాలయానికి వెళ్లొచ్చింది ఉదయాన్నే. సాయంత్రం తోటనుండివచ్చి తలస్నానంచేసి పొడి బట్టలు కట్టుకొని శివాలయానికి బయలుదేరనున్న శాస్త్రికి, కంచెదగ్గర నిలబడి ఆకాశంలోకిచూచే చంద్రి కనిపించింది. ఆమె ముఖంలో అలసటను చూచి, ఆ రోజు ఆమె ఉపవాసమున్నదని గ్రహించాడు శాస్త్రి.

భోజనంచేసి వాలు కుర్చీలో కూర్చున్న శాస్త్రి ముందు చాలసేపు తారాడింది చంద్రి కూనిరాగాలు తీస్తూ. తొమ్మిది గంటలు కాకముందే ఎవరిగూళ్ళలో

వారు పడుకున్నారు. చలిగాలి వీస్తున్నది. లెఖలేవో చూచుకోవాలని నాయుడు గారింటికివెళ్ళి ఒక గంట ఉండి వచ్చాడు శాస్త్రి. ఆ వేళకి వెన్నెల పుచ్చ పువ్వులా కాస్తోంది. మేఘాలు మచ్చుకైనా లేవు ఆకాశంలో. ఇంటిని సమీపించి, యథాలాపంగా తాళం తీస్తున్న శాస్త్రి, వీధిలో తడకప్రక్క ఎవరో నిల బడటంచూచి, దృష్టిని సారించి 'ఎవరదీ?' అన్నాడు.

ఆ ఆకారం మాటాడలేదు. తీసిన తలుపుల లోనికి నెట్టుతూ రెట్టించాడు ప్రశ్నను.

ఆకారం అతని దగ్గరగావచ్చి గుమ్మానికి దగ్గరగావచ్చి 'నేనే! సెంద్రిని' అంది.

'ఎందుకొచ్చావ్?' అన్నాడు కఠినంగా.

'తలకాయ నెప్పి మందు కోసరం' అంది చంద్రి, శాస్త్రిని ఓరకంట మూసి కణతలు నొక్కు కుంటూ.

'అయ్యో! పాపం! కారణం తెలిసికోకుండ ఎందు కంత కఠినంగా మాటాడాను!' అని అనుకుంటూ 'ఉండయితే ఏ మూల ఉందో సూస్తాను' అంటూ అగ్గిపెట్టెను వెతికి బుడ్డి దీపాన్ని వెలిగించాడు. వెతికి వెతికి అమృతాంజనమును తీసివెనుతిరిగాడు. వెనుదిరిగిన శాస్త్రికి, ఒక కాలు మంచంమీదనుండి నేలపైపుంచి కాలూపుతూ, రెండు చేతులను తల క్రిందనుంచుకొని మంచంమీద చిలిపిగా నవ్వుతూ వెల్లకితల పడుకున్న చంద్రి కనిపించింది. అర్థ మైంది శాస్త్రికి, చంద్రి కే తలనొప్పిలేదని, అంతా నటన అని.

'అయితే తలనొప్పి లేదన్నమాట' అన్నాడు పళ్ళు నొక్కిపట్టి.

'ఊహూ!' అంది చంద్రి ధోరణినేమాత్రం మార్చకుండ

'అయితే ఎందుకొచ్చావు?' కఠినంగా అడిగాడు.

'తెలియలేదా?' అంది చంద్రి కాలూపటం ఆపి.

'అది తరువాత చెప్తాను. పద అవతలికి'

'ఏ ఏ!' అంది చంద్రి పోనన్నట్టు. ఆమె గుండెమీద ఆచ్ఛాదం పూర్తిగా జారిపోయింది. చంద్రి తానున్న పరిస్థితికి ఏమీ విచారపడటంలేదని గ్రహించి 'ముందు మంచంమీదనుండి లేస్తావా? లేవవా?' అన్నాడు శాస్త్రి.

లేవనన్నట్టు తలూపింది నిర్లక్ష్యంగా చంద్రి.

'మెడపట్టి గెంటితేనేగాని లేవవన్నమాట' అన్నాడు.

'ఏ. ఏ. . సేసేదేటో సేసి సూపించు' అంది ధీమాగా కాలుపుతూ.

'అదే చూపిస్తాను' అంటూ ఆమె రెండు చేతులను పట్టుకొని గట్టిగా గుంజాడు. ప్రయాస నివ్వకుండానే మంచంమీదనుండి లేచి తూలిపోయే శాస్త్రిని గట్టిగా పట్టుకుంది. ఒదుల్చుకోలేనంత గట్టిగా ఉందాపట్టు. 'ఛీ! రాక్షసీ! వదులు' అంటూ బాదసాగాడు. బాధబదులు ఆమె ముఖంలో ఆనందం కని పించింది. అర్థమైంది శాస్త్రికి. తాను బాధ పెట్టా లనిచేసే ప్రతిపని ఆమెను ఆనందపరుస్తుందని. గత్యంతరం కనిపించలేదు శాస్త్రికి.

చేతులెత్తి దండం పెట్టి 'తల్లీ! నన్నొదులు' అన్నాడు.

నిశ్చేష్టురాలై వదిలేసింది చంద్రి శాస్త్రిని.

'నా జోలికి రాకు తల్లీ! పరువుగా మర్యాదగా బ్రతుకుదామని, బ్రతుకుతున్నానని యింతవరకు అనుకుంటున్నాను నన్ను అపవిత్రుణ్ణి చేయకు. నా పరువు కాపాడు నా బతుక్కి ఒక బాటపడితే ఈ ఊళ్లో ఒక క్షణం ఉండను అంతవరకూ......' అని ఆగిపోయాడు. మోడ్చిన చేతులు అలానే ఉన్నాయి.

శాస్త్రి కళ్ళలో దీనత్వం చూసింది చంద్రి.

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'శా! నాకు దణ్ణ మెట్టకండి బాబూ! మీ రిలాంటోరనుకోనేదు' అంటూ చేతుల్ని విడ దీసింది చంద్రి.

తలపట్టుకొని మంచంలో కూలబడ్డాడు.

'ఎలాగను బాబూ!' అంటూ గుమ్మంవైపు కదిలి అంతలోనే వెనుదిరిగి చంద్రి అంది. 'బాబూ! ఏటనుకో పోతే నాదో పెప్పె. వాకేటి అర్థం కానేదు సెప్పవిూ. ఎంకునాయుడేటి? సూరినాయుడేటి, మల్లి పూజారయ్య, కాపీ కొట్టు సెలపతి, సుబద్ర రమ్మ కొడుకు సెందిరినాయుడు; మరిశానమంది, మనూరికి ఈ సుట్టుపక్కలకి పెద్దోరే కదాబాబూ! మరి అలాటి పనులెన్ని సెయ్యలేదు? పూజారయ్య తండ్రి సూడని పడుచు పిల్ల ఉండదా యింత వరకూ! అయినా ఆరు గొప్పోరు. పెద్దోరే కదా బాబూ! మరి మరియాద విూకేన పోతది? విూ బతుకేనా సెడుద్ది?'

చంద్రి ప్రశ్నతో ఆలోచనలోపడ్డాడు శాస్త్రి. శాస్త్రి ఆలోచనలో పడడంచూచి తన ప్రసంగాన్ని కొనసాగించింది చంద్రి: 'నలుగురనుకుంటారనేగా విూ బయం? మరి ఈ ఊరంతా అలాటోరుకారా? ఎవరోతప్ప. ఊరినున్న మగాళ్ళని గ్ సెప్పమనండి గుండెవిూద సెయ్యేసుకొని ఏనాడూ ఏ ఆడదాన్ని ముట్టలేదని. ఆరికిపోని మరియాద విూకేనాపోద్ది? బుడ్డీతాగి, తందనాలాడి, ఇలాంటిపనులు సేస్తేనే వస్తాది పరువు, మరియాద. విూనాగ ఉంటేరాదు పంతులూ, మరియాద?' అంది చంద్రి.

చంద్రి మాటల్లో ఏదో సత్యం గోచరం కాసాగింది శాస్త్రికి. కాని పూర్తిగా విశ్వసించ టానికి మనసు రాలేదు. స్త్రీని పవిత్రంగా చూచే మహానుభావుల చరిత్రలు మనసులో మెదులుతూంటే, చంద్రిమాటలు చెవులో రింగుమంటూంటే సమాధానం దొరక్క ఉండిపోయాడు కొద్దిసేపు ఏదో మాటాడదామని ప్రక్కకు తిరిగిన శాస్త్రికి చంద్రి కనిపించలేదు. కంచె అవతల చలిలో మంచంవిూద బోర్లాపడుక్కున్న చంద్రి కనిపించింది శాస్త్రికి.

మర్నాడు రాత్రి తొమ్మిది గంటలవుతూండగా భోజనంచేసి కొద్దిసేపు కరణంగారి అరుగువిూద కూర్చుని, మరి కూర్చోలేక ఇంటికి వచ్చేసాడు శాస్త్రి. కంచె దగ్గర చంద్రి నిలబడి ఉంది చంద్రిని గమనిస్తూ తలుపుతీసి దీపం వెలిగించాడు. తలుపు వైపు తిరగ్గానే గుమ్మదగ్గర నిలబడ్డ చంద్రి కనిపించింది.

'చంద్రీ' అన్నాడు శాస్త్రి.

శాస్త్రి గొంతుకలో కొంతమార్పును గమనించి ఆశగా 'బాబూ!' అంది చంద్రి.

'నిన్న తలనొప్పిమందునుగాని నీకు యిచ్చానా?'

'లేదు బాబూ! ఏం?' అంది కొంత ఆదుర్దాతో.

'తలభారంగా ఉంది. నిన్నా సందట్లో ఎక్కడో పడేశాను' అంటూ వెతకసాగాడు శాస్త్రి.

కొద్దిసేపటికి దొరికింది అమృతాంజనం. 'దొరికిందిలే చంద్రీ! నీ దగ్గరుందేమో అనుకున్నాను' అంటూ మందును తలకు పట్టించుకున్నాడు. శాస్త్రి మంచంవిూద పడుక్కొని మెడవరకూ దుప్పటి లాక్కోవడంచూచి 'సరిగా ఉందా బాబూ! ఊష్టంగాని.........'

'లేదు చంద్రీ! చలేస్తోందంతే! వెళ్ళేటప్పుడు తలుపు దగ్గరేసి వెళ్ళు' అన్నాడు కళ్ళుమూసికుంటూ.

'అట్టాగే బాబూ!' అంటూ తలుపు దగ్గరకేసి వెళ్ళిపోయింది చంద్రి.

ప్రతిదినం ఆరుగంటలకన్నా ముందే లేచే శాస్త్రి ఆ రోజు ఉదయం ఏడుగంటలైనా లేవక పోవడం గమనించి నెమ్మదిగా తలుపు తోసిచూసింది చంద్రి. మంచంవిూద మూలుగుతూ పడుక్కున్న శాస్త్రి కనిపించాడు. ఆదుర్దాతో అతని చెంపలను, నుదిటిని తాకిచూసింది. ఒళ్ళు కాలిపోతోంది. వేడిగా కాళ్ళను ముడుచుకుని పడుక్కున్న శాస్త్రి చలికి వణికిపోతున్నాడు. రెండు మూడుసార్లు పిలిచింది చంద్రి శాస్త్రిని. నెమ్మదిగా కళ్ళెత్తిచూచి కళ్ళు మూసికున్నాడు శాస్త్రి. చంద్రికేం తోచలేదు. గబగబా

పూజారయ్య దగ్గరికి పరుగెత్తింది చంద్రి. కొద్ది సేపటిలో పూజారయ్యను వెంటపెట్టుకొని వచ్చింది చంద్రి. అతను చూసి కడుపులోకి మందిచ్చి 'జాగ్రత్తగా చూడవే! మరి నిన్నరాత్రే ఎందుకు చెప్పేవుకదూ, మందిద్దును. మరేంకాదు. మలేరియా జ్వరం. కార్తీకమాసం స్నానాలూ, ధ్యానాలూ చేయించావా ఏమిటి? జాగ్రత్తగా చూచుకో. తగ్గి పోతుందిలే కంగారు పడకు' అంటూ ముట్టుకునేంత దగ్గరగావచ్చి కళ్ళజోడు సవరించుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు. అతని మాటల్లో అర్థాన్ని గ్రహించిన చంద్రి 'ఛీ! ఏం మడిసి!' అనుకుంది మెటికలు విరుస్తూ.

వెంటనే కాఫీపొడి, పంచదార బజారునుండి కొనితెచ్చి కాఫీ కాచి, మందుపట్టి కాఫీ త్రాగించింది. కాఫీ త్రాగి తెరపినపడిన శాస్త్రి కాళ్ళుచేతులు గింజా కోవటం చూచి, నుదిటికి అమృతాంజనం పట్టించి, కాళ్ళను చేతులను ఒత్తసాగింది కొంతసేపటికి నిద్ర పోయాడు. అలా నిద్రపోయిన అతన్ని చూస్తుంటే చంద్రి కళ్ళు జాలిగా చమర్చాయి ఆరోజు పనిలోకి వెళ్ళలేదు. చంద్రిని పనిలోకి పిలవాలని ఎవరొచ్చినా 'సాస్తుర్లు బాబుకు జొరం. రెండుదినాలు పనిలోకి రాను' అని చెప్పి పంపేసింది. ఆ రోజంతా జ్వరంగానే ఉంది శాస్త్రికి. రెండుమూడుసార్లు కాఫీ తాగించింది అతనిచేత. సాయంత్రం పూజారయ్య రాలేదు. రాత్రి జ్వరం ఎక్కువైంది శాస్త్రికి చలిగూడా ఎక్కువైంది. కప్పుకున్న పల్చటి దుప్పటి చలికాగలేదు. ఒణికిపోయే శాస్త్రిని రెండుచేతుల్లోకి తీసికొని వాటేసుకుంది చంద్రి. మరిగిన నీటిని ఒంటిమీద పోసికున్నట్టని పించింది చంద్రికి. కాని శాస్త్రిచలి తగ్గలేదు. కడుపులోంచివచ్చే చలి నెలా ఆపాలో తెలీలేదు చంద్రికి గబగబా కాఫీచేసి వేడివేడి కాఫీ పెట్టింది చంద్రి. ఆత్రుతగా త్రాగాడు శాస్త్రి. కాళ్ళుచేతులు పడుతూంటే నిద్రపోయాడు. ఆరోజు అన్నం ముఖం చూడలేదు చంద్రి. అలసిపోయిన చంద్రి నీరసంతో అతనితోపాటే అతనిమీద ఒరిగి నిద్రపోయినసంగతి మరునాటి ఉదయం మేలుకునేంతవరకూ చంద్రికి తెలియదు మరునాడు పూజారయ్య మందు మార్చాడు. ఆరోజు కూడా శాస్త్రిని కనిపెట్టేఉంది చంద్రి. ఆరాత్రి పదిగంటలకు జ్వరం తగ్గింది. చమట పట్టిన బట్టలు తీసివేసి పెట్టెలోవున్న చాకలి నుండొచ్చిన బట్టలు తొడిగింది చంద్రి. మర్నాడు పూజారయ్య రొట్టె తినిపించాడు శాస్త్రిచేత. కడుపులోకాస్త పడ్డతరువాతగాని తెలియలేదు, సెలవు పుచ్చుకోకుండ తా నుండిపోయాడని. మర్నాడు శక్తితెచ్చుకొని వెంకునాయుడి తోటవైపు వెళ్ళాలని ప్రయత్నించాడు. కాని చంద్రే ఆతని ప్రయత్నాన్ని ఆపింది. శాస్త్రి భోజనంచేసే పూటకూళ్ళమ్మ యింటినుండి అన్నం మెత్తగా వండించి చారు పోయించి తెచ్చి శాస్త్రిచేత తినిపించింది. తనకోసం అంత శ్రమపడుతున్న చంద్రిని చూచి జాలిపడ్డాడు శాస్త్రి. ఆదివారంనాడు కూడా యిల్లు కదలనీయ లేదు చంద్రి.

సోమవారంనాడు చాల ఉత్సాహంగా బయలు దేరాడు శాస్త్రి యింటినుండి. అతడు యింటినుండి ఆరోగ్యంగా బయలుదేరుతూంటే ఏదో విజయాన్ని సాధించినదానిలా అతన్ని చూస్తూఉండిపోయింది. శాస్త్రి వీధిలోకి బయలుదేరి అందరూ తనవైపే ప్రత్యేకంగా చూడటంతో కొంత తికమకపడి పోయాడు. కాఫీహోటల్లో చలపతి ఎవరికో కాఫీ యిస్తూ శాస్త్రిని గమనించి, గమనించనట్టు శెట్టితో 'ఇంతకీ చెంద్రి పంతుల్నుంచుకుందో, పంతులే చెంద్రి నుంచుకున్నాడో తెల్దుగాని పంతులుమాత్రం అదృష్ట మంతుడే. పైకలాఉన్నా గట్టోడు' అన్న మాటలు విని కుతకుతలాడిపోయాడు శాస్త్రి. రచ్చబండదగ్గర, రామమందిరం సావిడిలో, తోటలో, ఎక్కడచూచినా చంద్రి శాస్త్రిని ఉంచుకున్నాదనుకునేవారే కనుపించారు. కరణంగారు రహస్యంగా పిలిచి 'నిజమేనా? నమ్మదగ్గదేనా?' అడిగేసరికి మరింత బాధపడి పోయాడు. నిజంచెప్ప చేతకాలేదు. నిజాన్ని ఉన్న దున్నట్టు చెప్పడానికి కూడా నేర్పరితనం కావాలి

మరి. గుండెను మంటల్లో పెట్టి కాల్చినట్లయింది శాస్త్రికి. మధ్యాహ్నం భోజనం చేయక తోటలోనే ఉండిపోయాడు. నిమ్మకాయల లెక్క, అరటి గెలల లెక్కతేల్చి సాయంత్రం యింటికి బయలుదేరే వేళ పట్నంలో రెండు రోజులుండి తిరిగొచ్చిన వెంకునాయుడు తోటలోకివస్తూ కనిపించాడు. అతడు వస్తూనే,

'పంతులూ! నీ వెంతో మంచివాడివని అనుకున్నాను ఊరంతటికి చెడ్డపేరు తెస్తావనుకోలేదు. నీవు నా దగ్గర ఉండడం నాకే నామోషి. ఈ రోజు వరకూ నీ జీతం ఇదిగో. ఉదయాన్నే తిన్నగా మీ ఊరెళ్లిపో. ఇక్కడ ఉండమాక. గొడవలొస్తాయి' అంటూ డబ్బు అందించాడు.

వెంకునాయుడి మాటలు వింటూ నిరుత్తరుడై పోయాడు శాస్త్రి. అతను కట్టుకున్న మేడలన్నీ కూలినట్లనిపించింది. యాంత్రికంగా వెంకునాయుడిచ్చింది పుచ్చుకుని యింటివైపు బయలుదేరాడు ఇంటి తలుపు తీసికొని దీపం వెలిగించుకోకుండా మంచంమీద కూలబడ్డాడు వెంకునాయుడి మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తుంటే తలపట్టుకుని 'చివరిరాత్రి' అని గొణుగుకుంటూ ఉండిపోయాడు. రాత్రయిపోయింది. శాస్త్రి గదిలో దీపంలేక పోవటం చూచి చంద్రి దీపం వెలిగించి తలపట్టుకుని కూర్చున్న శాస్త్రిని చూసి ఆదుర్దాతో 'మళ్లా ఉష్ణంగాని... వచ్చిందా?' అని అడిగింది

'ఊహూ!' అన్నాడు తలవూంచి చేతులు తీసివేసి.

'మరి?'

'ఉద్యోగం పోయింది'

'ఎలా?'

కారణాన్ని చెప్పాడు. చంద్రి కొంచెంసేపు మాటలేకుండ ఉండిపోయింది. అవతల ఏదో అలికిడి అయింది.

నా మూలకాన్నే కదా ఉద్యోగం పోయింది మీకు?' అంది చంద్రి.

'ఛా! అలా అనకు చంద్రీ! నీవు దేవతవు. నీవేగాని ఆ రోజు డాక్టర్నితెచ్చి, నా గొంతులో కాఫీ నీళ్లుపోయక, మందిప్పించక నన్నలా వదిలేస్తే నేనేమయ్యేవాడిని? ఈనాడు నన్ను నన్ను అంటున్న వారెవరైనా తోటి మానవులుగా నీవు చేసినపాటి చేసారా? నీ వలన నా ప్రాణాలు నిలిచాయి. నీవు దేవతవి ఈ ఉద్యోగం పోయిందన్న విచారం నాకేకోశాన్నలేదు. అనవసరంగా ఒక నిందను నెత్తిమీదను వేసికొని పోతున్నాను. అందుకే బాధగా ఉంది' అన్నాడు నిట్టూర్పుతూ.

'సత్తెం. సత్తె పెమాణంగా మీలాటోరు నూటికి ఒకరో ఇద్దరో. మీలాంటోరిమీద నింద వెయ్యటానికి మనసెలా ఒప్పినది? సత్తెం, దరమం అక్కరంలేదా?'

'అంతే చంద్రీ! వారికి సత్యాసత్యాలతో పనిలేదు. కళ్లకు కనిపించేదంతా సత్యమే. నిజానికి నీకు నాకు ఏలాంటి సంబంధం లేదు. అది నీకు తెలుసు. నాకు తెలుసు. కాని లోకానికది ఎలా తెలుస్తుంది? తెలియదు. తెలిసే అవకాశం లేదు. అందుకే నాకు బాధగా ఉంది. నీవు నిజాన్ని చెప్పినా ఎవరూ నమ్మరు. ఈ నిందను మోసికుంటూ పోవలసిందే. అంతకన్న గత్యంతరం లేదు. అందుచేత అలానే వెళ్తాను ఒకనాడు నీవు నాకు హితబోధ చేసావు. తాగితందనాలాడితే, మరింకేవో అసభ్యకరమైన పనులుచేస్తే పరువు మర్యాదలు వస్తాయని, అలా ఉండమని. అదెంతవరకూ నిజమో నాకు తెలీదు. నాకలా ఉండబుద్ధి కాదు ఎవరేది చేసినా ఒకరికోసం కాదు. తనకోసమే. పవిత్రంగా ఉండడం పదిమంది కోసం కాదు. వారు హర్షిస్తారనికాదు. నాకు తెలుసు అలా ఉంటే హర్షించరని. అది నా కోసం నాలో రక్తం యింకే భావాన్ని ప్రవహింపచేయదు. ఒక వేళ నీవు అడగవచ్చు 'పడిననింద ఎలానూ పడింది గదా, అలా ఉంటేనేం? పద్ధతి మార్చుకోకూడదా?' అని – ఇదికూడా పదిమందికోసం కాదు. నాకోసం. నా తృప్తికోసం. పైనున్న భగవంతుడికోసం. పది

నుండిమాటే నిజం చేస్తామా? ఎప్పటికీకాదు. నాకు తెలుసు, నేను ఎండిన వాగులో జలశేషాన్ని. ఉరక లెత్తుతున్న క్రొత్తవాగు నన్ను వెంబడించి నన్ను సజీవసమాధి చేస్తుందని నాకు తెలుసు. భగవంతు డున్నాడు నన్ను ఏ పల్లాపు గుంటలోకో ఈ వాగు బారినుండీ తప్పించి చేర్చుతాడు. అలా కాకపోయినా నాకు సంతోషమే. నేను చెడలేదు. ఆ తృప్తి చాలు. నీవు నన్నుకన్న తల్లిలాంటి దానివి. నాకు ప్రాణాన్నిచ్చిన దేవతవు. ఉదయాన్నే ఊర్ని విడిచిపెట్టాలని లజ్జ. అందుచేత త్వరగా సామాను సర్దుకోవాలి నీవు ఉన్నా నాకభ్యంతరంలేదు. చివరిసారిగా ఒక్కమాట నా భావ నీ కర్థమవుతుందో లేదో; అయినా చెప్తున్నా విను. పురుషుడన్నైనా, స్త్రీనైనా ఎప్పుడైనా మిగతా లోకాన్ని చూచి అంచనా వెయ్యకు ఎవరి విలువలు వారికున్నాయి. ఉంటాయి పురుషుడంటే తాగితందనాలాడి మరో విధంగా జీవితాన్ని గడిపేవాడని, స్త్రీ అంటే మగవాడిచేతిలో కీలుబొమ్మని, శీలము లేనిదని మాత్రం ఏనాడూ అనుకోవద్దు. ఇద్దరూ పూజ నీయులే. వాగు పరుగెత్తుకుంటూ వస్తోంది. నేను పల్లంలోకి త్వరగా సురక్షితంగా చేరాలి' అంటూ లేచాడు శాస్త్రి.

చంద్రి కళ్లలో కన్నీళ్లు నిండి ఆమె చెక్కిళ్లపై జారాయి.

పంతులు నుంచుకున్నాదన్న చంద్రి, పంతులితో పాటు, ఆ రాత్రే ఎక్కడికి పారిపోతుందోనని ఆత్రు తతో చంద్రిని పారిపోకుండ ఆపటానికి స్వయంగా వచ్చిన వెంకునాయుడు, వారి మాటలు విని చమరిన కళ్లను తుడుచుకున్నాడు; తృప్తితో ఒక మంచిపనిని చేయాలని ముందుకు వెడుతూ.

---



# వ్యాకరణశాస్త్ర కావ్యములు

## శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు

ప్రాచ్య పౌరస్త్య సారస్వతములందే యితర వాఙ్మయములందెందును లేనివియు, సహృదయ హృదయావర్జకములు అగు చమత్కారములు సంస్కృత కావ్యోద్యానమున కొల్లలుగా లభించును. కటువులై, స్వగ్రాహ్యములుకాని శాస్త్రమర్యాదలను, చమత్కారములను కవితామృతమునందు రంగరించి సంస్కృతకవిశేఖరు లెందఱో వానిని సుబోధములును ఆస్వాద్యతరములుగాను జేసిరి. సంస్కృత ప్రాకృత వ్యాకరణ విశేషములను న్యాయచ్ఛందశ్చమత్కారములను జ్యోతిశ్శాస్త్రసంప్రదాయములను కవిత్వమధువులో పొదిగి కవిప్రకాండులు పాఠకమండలికి మహోపకార మొనర్చిరి చేదుమందును పంచదారలో పొదిగి (sugar-coated pill) వైద్యవేత్తలు రోగులచే సులువుగా మింగింతురుకదా!

వ్యాకరణ పరిభాషా పదములను, వ్యాకరణ సూత్రాంశములను కవితామృతమున మేళవించి చమత్కరింపబడిన కొన్ని శ్లోకము లుదాహరింపబడును.

1 పాణిని సూత్రముపై చమత్కరింపబడిన పద్యము:

శ్వన్, యువన్, మఘవన్ అనుపదముల రూపసిదిని కూర్చి పాణిని యొక సూత్రమును నిర్మించగా ఒకానొక కవి ఈ క్రింది శ్లోకమును రచించెను.

> 'కాచం మణిం కాంచన మేకసూత్రే
> గ్రథ్నాతి భిల్లీ న హి తత్ర చిత్రమ్,
> అశేషవిత్ పాణిని రేకసూత్రే
> శ్వానం యువానం మఘవాన మాహ'

లోకజ్ఞానములేక వస్తువులమూల్యమునందలి తారతమ్యజ్ఞానములేని బోయెత (భిల్లస్త్రీ) అమూల్యములగు మణికాంచనములను, నిర్మూల్యమగు గాజుపెంకును ఒక సూత్రము(దారము)నవే కట్టి, మెడయందు ధరించుటలో ఆశ్చర్యములేదు. ఏమనగా సర్వజ్ఞచూడామణియగు పాణినిమహర్షి యంతటివాడు ఒక్కసూత్రము (వ్యాకరణ సూత్రము) నందే ఇంద్రునంతవానిని, యువజనుని, కుక్కను ఒక్కగుక్కలోనే చెప్పలేదా?

2. బహువ్రీహి — తత్పురుష సమాసములను వ్యాకరణసంజ్ఞ లీ క్రిందిశ్లోకమున మనోహరముగా ప్రయోగింపబడినవి:

> 'అహం చ త్వం చ రాజేంద్ర!
> లోకనాథా వుభా వపి,
> బహువ్రీహి రహం రాజన్,
> షష్ఠీ తత్పురుషో భవాన్.'1

(మహారాజ! నీవు లోకనాథుడ వయినచో నేనును లోకనాథుడనే కాని మన కిరువురకు ఇంచుక భేదము కలదు: నీవు షష్ఠీతత్పురుషలోకనాథుడవు. (లోకస్య నాథః=లోకమునకు నాథుడవు; నేను బహువ్రీహి లోకనాథుడను. (లోకః నాథః యస్యసః— లోక మెవరికి నాథుడో వాడను. అనగా సమస్తలోకమునకు భృత్యుడను).

3. శృంగరసప్లుతమగు నీ క్రింది శ్లోక మే గ్రంథమునందలిదో, ఏ కవిదో గుర్తులేదు. విద్య

---

1. పై శ్లోకముతో నించుక భావసామ్యము గల పద్యము వేదాంతదేశికుల (1268–1369) దయాశతకమునుండి యిట నుదాహరింపబడును.

> శ్లో. 'అహ మ స్మ్యపరాధ చక్రవర్తీ,
> కరుణే త్వం చ గుణేషు సార్వభౌమీ?

— ద. శ. III దశక; 30 పద్య. 12 పు. (బాపట్ల హనుమంతరావుగారి ఆంధ్రీకృతితో (Rama Press, Bapatla)-1963.

త్సాంకమండలి దీని యాకరమును ప్రకటింతురుగాక.

శ్లో. 'రతాంత ఆసేచనకం నిపీయ
కాంతాధరం, కాంత ఉవాచ కాంతామ్,
కృతేఽఙ్గకార్యే పునరఙ్గకార్యం
న దృశ్యతే సుందరి పాణినీయే'

(సురతావసానమున ప్రియురాలి అధరోష్ఠ బింబమును ఆసేచనకముగా (అపర్యాప్తముగా, ఉద్వేగములేక కుతూహలంబుగా ఆస్వాదించి, వ్యాకరణవేత్త యగు ప్రియుడు తన శబ్దశాస్త్ర వైదుష్యము నెమరునకు రాగా, కొన్ని మాటలకు పునరుక్తి దోషము లేనట్లే కొన్ని శారీరక చేష్టలకు పునరాచరణ దోషము (ఆమ్రేడితదోషము) చుంబనాలింగ నాదులందుకలె (అంగకార్యే కృతే పునర్నాంగకార్యమ్' అను పాణిని సూత్రమునుబట్టి) లేదనుచు తన చేష్టను సమర్థించుకొనెనట )

4. శబ్దశాస్త్రమునుబట్టి వచ్చిన లింగ చమత్కారము శృంగారఘట్టమున అన్వయించుట ఈ క్రింది పద్యమున కనదగును.

'నపుంసక మితి జ్ఞాత్వా,
ప్రియాయై ప్రేషితం మనః,
తత్తు తత్రైవ రమతే
హతాః పాణినినా వయమ్.'

(ప్రామాణికుడైన పాణిని మనఃశబ్దము నపుంసకమని చెప్పెను. దానినిబట్టి నా మనస్సు నొకసారి ప్రియురాలియొద్దకు వార్తాహారకుడుగా పంపితిని. కాని తిరిగి అటనుండి సందేశము రాక పోవుటయేకాదు మనస్సయినను మరలి రానేరాక అచ్చటనే విహరించుచున్నది బహుశః దానికి లింగ వ్యత్యయము కల్గి పుంలింగమైనదో యేమో ! పాణిని మాటవల్ల మా కొంప మునిగినది.)

పై ప్రియుడు పాణినిని నమ్మి మోసపోయి నాడు కాని అంతకంటె ప్రామాణికమైన వేదమును పరిశీలించియుండినచో మనశ్శబ్దము పుంలింగమని తెలిసియుండెడిదే. పాణినిమాటను నమ్మియే కావచ్చును చేతోదూత, హృదయదూత, మనోదూత అను పేళ్లతో తొమ్మండుగురు కవులు సందేశకావ్యము లను నిర్మించిరి![2]

భాషా సంప్రదాయమునుబట్టి ఆంధ్రాంగ్లాది జీవద్భాషలయందు పురుషవాచకము పుంలింగము. స్త్రీ వాచకము స్త్రీ లింగము ఈ రెండును కానిది నపుంసకము. దీని నాంగ్ల భాషలో 'Rational gender' '(హేతువాదముతోడిలింగము) అని వ్యవహరింతురు.

సంస్కృతభాషయందు మాత్రము లింగములు శబ్దములకే కాని అవి సూచించు వస్తువులకుగాదు. భేరీ-దుందుభి శబ్దములు పర్యాయపదములైనను భేరీ స్త్రీలింగము దుందుభి పులింగము. ( భేరీ స్త్రీ దుందుభిః పుమాన్' అని అమరుడు )

ధర్మపత్ని (wife) అను నర్థమున సంస్కృత మున 3 లింగములందును పర్యాయ పదములు కలవు:

పుంలింగము : దార (నిత్య బహువచనాంత ముగా వాడుక)

స్త్రీ లింగము : పత్నీ, భార్యా, జాయా.

నపుంసకము : కళత్రమ్. (శబ్దమునుబట్టి లింగము 'Grammatical gender')

5. ఒకానొక కవిశ్వరుడు తన పాణినీయ పాండిత్యగరిమచే బ్రహ్మరక్షస్సుయొక్క మెప్పును కూడ పడసిన చమత్కారకథ బల్లాలకవి రచించిన భోజప్రబంధమున కలదు.

'సర్వస్య ద్వే; ఏకో గోత్రే; వృద్ధోయూనాః స్త్రీ పుంవచ్చ' అను పాణినీయసూత్రములు చమత్కారముగా నీ క్రింది పద్యమున ఇముడ్పబడినవి :

'సర్వస్య ద్వే'-సుమతికుమతీ, సంపదాపత్తి హేతూ'- ఇత్యాదిశ్లోకమును పై గ్రంథమున చూడ దగును.

6. సంస్కృత కవులలో శబ్దశాస్త్ర వైదుష్యము విశేషముగాగల కవులలో ఆఱుగురు ముఖ్యులు:

---

2. ఈ వ్యాసకర్త రచించిన 'సంస్కృత దూత కావ్యోత్పత్తి వికాసములు (=సంస్కృతదూత కావ్యచరిత్ర) 1930 చూడదగును.

1. కాళిదాసకవి 2 భారవి 3. భవభూతి 4. మాఘుడు 5 మురారి. 6. శ్రీహర్షుడు.

1 కాళిదాసుని కుమారసంభవము, రఘు వంశములయందు వ్యాకరణశాస్త్రచమత్కారము లనే కములు కలవు.

భారవి కిరాతార్జునీయమున శబ్దశాస్త్ర సంప్రదాయములను ప్రదర్శించెను.

3. భవభూతి తాను శబ్దబ్రహ్మవేత్తనని వక్కాణించియున్నాడు.

4–5. మాఘకవి, మురారికవియు అగస్త్యుని వలె (శబ్దశాస్త్ర) సాగరము నాపోశనముపట్టిన మహా మహులు.

నిఘంటువులు జిహ్వాంచలమున గలవారు, శబ్ద శాస్త్రసుధను కుత్తుకబంటిగా పానము చేసినవారు మాత్రమే మురారి నిర్మించిన 'అనర్ఘరాఘవనాటకము'ను పఠించుట కధికారులని యొక వ్యాఖ్యాత యీ క్రింది శ్లోకమున చెప్పెను:

'యే శబ్దశాస్త్ర నిష్ణాతాః, యే శ్రితనిఘంటవః,
తేషా మే వాధికారోఽస్తి, మురారి కృతనాటకే.'

అనాఘ్రాత శబ్దశాస్త్ర పరిమళు లగువిబుధులు ప్రౌఢ కవి శేఖరుల గంభీర రచనలయందు గుణదోష విచారము చేయదగ దనుచు మురారియే నాటకాంత మున నీ క్రింది విధమున పలికియున్నాడు.

'న శబ్దబ్రహ్మోత్థం పరిమళమనాఘ్రాయసుధియః
కవీనాం గంభీరే వచసి గుణదోషాన్ రచయతు'—
(అనర్ఘరాఘవ—7 అం.)

వ్యాకరణశాస్త్రమున జితశ్రముడు కానివానికి అనర్ఘరాఘవమున నిక్షిప్తములైన శబ్దశాస్త్రచమ త్కారములు, తచ్ఛాస్త్రసంప్రదాయముల పొగసును బోధపడవని మురారి అట్లు కంఠోక్తముగా పల్కి యున్నాడు. ఈ యంశమున మాఘునకు మురారికిని సామ్యము కలదు. అందువల్లనే మురారి కవితా తరంగిణియందు విహరింప కోర్కి కలవారు మొదట మాఘుని కవితాస్రవంతిలో అవగాహనము చేయవలయు నవి శ్లేషగర్భితమగు నీ క్రిందిసూక్తి బయలుదేరినది.

'మురారి పదచింతా చేత్
తదా మాఘే మతిం కురు,
మురారి పదచింతా చేత్
తదా మాఘే మతిం కురు'

మురారి పదచింతా–1. మురారి కవితా రసా స్వాదము.

2. శ్రీ మహావిష్ణుపాదధ్యానము

మాఘే మతిం కురు=1. మాఘకవి కావ్య మును పఠించుము.

2. (అఘే మతిం మా కురు) పాపకృత్యము నందు బుద్ధి పోనీయకుము.

అనర్ఘరాఘవమునందు గల శబ్దశాస్త్ర చమ త్కారములు ప్రకృత రచయిత ఎన్నడో మూడు దశాబ్దములకు పూర్వము రచించి ప్రకటించిన 'అనర్ఘరాఘవ సమీక్ష'యందు వివరింపబడెను;[3] కుతూహలముగల పాఠకులు చూడదగును.

7, భట్టిప్రయోగము.

'జహిహి జహీహి జహాహి రామభార్యామ్.'

పై శ్లోకపాదము భట్టిరచిత మని విద్వ ల్లోకమున జనశ్రుతి; కాని ఉపలబ్ధములైన ప్రతులం దెచ్చటను కనబడలేదు. దీని ఆకరము వెతి గిన విబుధులు దానిని ప్రకటింతురు గాక.

విభీషణు డగ్రజుడగు రావణునకు హితోప దేశము చేయు ఘట్ట మిది.

'హా' ధాతువునకు ప్రార్థనార్థకమున మధ్యమ పురుషైక వచనరూపములు మూడని విద్యార్థులకు చెప్పి, వల్లించుడని నిస్సార (Dull and prosaic method) విధానమున నుడువుటకంటె ఆ రూప

3. E. V. V. Raghavacharya: 'A Critique on Murari and the Anargha-Raghava'–Cocanada. (1937.)

త్రయమును సార్థకమనోహరముగా శ్లోకపాదమున నిముడ్చుట యెంత రసవంతముగా మున్నది! మన సంస్కృతిలోకూడ త్రికమున కెంతో ప్రాముఖ్యము కలదు. తెనుగువారు 'ముత్యం మూడు సార్లు' అందురు 'వేలాము పాట'లో మూడుసారులు అని తుదకు కొమవానిని విశ్వసింతురు. ఇంగ్లీషులో The 'thrice blessed Christ' ఇత్యాది వ్యవహారము కలదు.

8. శ్రీహర్షుడు: సమస్త శాస్త్రములను, దర్శనములను ఆపోశనము పట్టిన ప్రచండ ప్రతిభా భాసురుడు. ఆయన నైషధము పాండిత్యమునకు పరమావధి; కావుననే విద్వాంసులు కూడ ఔషధప్రాయముగ గ్రంచించుక సేవింపదగినది. దీనియందు నిక్షిప్తములగు వ్యాకరణచమత్కారము లీ క్రింది 'నైషధ సమీక్ష'యందు వివరింపబడినవి.[4] కుతూహలముగల పాఠకులా గ్రంథమును పరిశీలింతురు గాక.

## ఉత్తరభాగము

తర్కవ్యాకరణాది శాస్త్రములందలి యంశము లను మేళవించిన ఇతివృత్తముతో కూర్చబడినకావ్యము శాస్త్రకావ్యము. సంస్కృత సాహిత్యమున ఇదం ప్రథమముగా రచింపబడిన యట్టి అనుత్తమ కావ్యము భట్టికావ్యము. రామకథాశ్రయమగు నీ మహాకావ్యమున 22 సర్గలలో మహాశాబ్దికుడగు భట్టికవి రామాయణకథ నుపదంశప్రాయముగా రచించుచు, సంస్కృత వ్యాకరణమున ప్రధానాంశము లెన్నియో విశదీకరించెను. ఈ కావ్యమునకు రావణవధ అని కవి పెట్టినపేరు. కవినామమునుబట్టి భట్టికావ్యమని (భారవి=కిరాతార్జునీయము; మాఘము=శిశుపాలవధ— అన్నట్లు) దీనికి ప్రసిద్ధి. ఈ కావ్యపఠన మిహపర సాధకము తీర్థము స్వార్థమును కలసివచ్చినట్లు కవి యీ కావ్యమున ప్రధానముగా వ్యాకరణమును బోధించుచు, కటుకౌషధమును రామకథామృతము అను అనుపానముచే ఆస్వాద్యతరముగా నొనర్చెను. ఈ కావ్యమును పఠించుచుండ మనకు తెలియకుండగనే శబ్దశాస్త్ర మర్మము లెన్నియో మన కవగతము లగును. 'ఏకా క్రియా ద్వ్యర్థకరీ బభూవ'— అన్నట్లయినది. భట్టికావ్యము దక్షిణభారతవర్షమున పాఠ్యగ్రంథముగా లేదు కాని ఉత్తరహిందూస్థానమున ముఖ్యముగా బెంగాల్దేశమున నీ కావ్యము పాఠ్యప్రవచనములచే విశేషవ్యాప్తి నందినది దీని వ్యాప్తికి గుర్తు దీనికిగల 26 వ్యాఖ్యలు (సమగ్రములు అసమగ్రములును)

సంస్కృత ప్రాకృత వ్యాకరణములు, ఛందశ్శాస్త్రము, తర్కశాస్త్రము లందలి చమత్కారములపై నాధారపడిన సంస్కృత ప్రాకృత కావ్యములు కేరళదేశమునందలి సంస్కృతవాఙ్మయమున ననేకములు బయలుదేరినవి. భారతవర్షమునకు కిరీటప్రాయమగు కాశ్మీరదేశమునందలి విద్యావైభవమును కవితామహత్వమును భువనాద్భుతజనకము లనియు అచ్చటి నారీరత్నములయందును విదుషీమణు లెందరో కలరనియు, వీరు జన్మభాషలయందు వలెనే సంస్కృత ప్రాకృతములందును ధారాళముగా మాటలాడగల దిట్ట లనియు క్రీ. 11 వ శతాబ్దమున నిర్మింపబడిన విక్రమాంకదేవచరితమను మహాకావ్యమున (18 వ సర్గ) విద్యాధికారియు కవిశిరోమణియు అగు బిల్హణ కవి వ్రాసియున్నాడు కాశ్మీరమును పోలిన కేరళదేశమున కూడ ఆధునిక కాలమున సంస్కృతభాషలో ధారావాహికముగా మాటలారు నేర్పుకల విదుషీ శిరోరత్నము లెందరో కలరని స్వర్గీయ శ్రీ మానవల్లి రామకృష్ణ కవిశేఖరులు ప్రసంగవశమున స్వానుభవమును వెల్లడించిరి. అట్టి కేరళదేశమున నిట్టి శాస్త్రకావ్యములు కొన్ని బయలుదేరినవి:

1. నారాయణకవి — సుభద్రాహరణము (20 సర్గములు).

---

4. 'A Critical Study of Sri Harsais Naisadhiva-caritam'. By Dr. A. N. Jani, Kavyatirtha, M. A, Ph. D. (pp. 161–62) Baroda - 1957.

క్రీ. శ. 15 వ శతాబ్దమున కేరళదేశమున కాలికట్టు (Calicut) నగరము రాజధానిగా రాజ్య పాలన మొనర్చిన జమోరిన్ (Zamorin) భూపతి దర్బారున పదునెనమండ్రున్నరకవులు (Eighteen and half Sanskrit poets, అష్టాదశార్ధ సంస్కృత కవులు) అను సంస్కృత కవిమండలికి చెందిన కవి శేఖరుడు పై నారాయణ :వి. ఈయన వాసస్థానము తిరునేగవ్వరము. వ్యాకరణౌషధమును కవితామృతమున మేళవించి ఈ కవి 'సుభద్రాహరణ'మను మహాకావ్య మును నిర్మించి అందరి మొదటి 16 సర్గలకు పద చంద్రికయను స్వోపజ్ఞవ్యాఖ్యను కూడ రచించెను.

2. వాసుదేవకవి — 'వాసుదేవ విజయము' (7 సర్గలు)

కేరళదేశము నందలి పెరుమానగ్రామవాసి యగు నీ కవి కటుకౌషధమువంటి వ్యాకరణమును కవితాసుధయందు రంగరించుచు 'వాసుదేవ విజయ' మను మనోహరకావ్యమును నిర్మించి దానికి స్వోపజ్ఞ వ్యాఖ్యను కూడ రచించెను. పై కావ్యమునకు పరి శిష్టమే, పిమ్మట పేర్కొనబోవు 'ధాతుకావ్యము.'

ఈయన నిర్మించిన శాస్త్రకావ్యము వాసుదేవ విజయమున 7 సర్గలు కలవు. దీనికి 'పదచంద్రిక' అను స్వోపజ్ఞవ్యాఖ్య కలదు.

యుధిష్ఠిరవిజయమును రచించిన వాసుదేవ కవియు, సంక్షేపరామాయణమును సరళసంస్కృత కావ్యమును రచించిన వాసుదేవకవియు ఇరువురు నామ సామ్యము కలవారు కేరళ దేశీయ సంస్కృత రచయితలందు ప్రశంసితులు కలరు. కాని వీ రిరువుర కంటెను వాసుదేవవిజయకర్త భిన్నుడని భావింప బడుచున్నాడు.

3 పై వాసుదేవ విజయమునకు పరిశిష్ట రచనయే మేల్పుత్తూరు నారాయణభట్టు (క్రీ. 16 వ శతకము) నిర్మించిన 'ధాతుకావ్యము'. 'మాధవీయ ధాతువృత్తి' ననుసరించి, సోదాహరణముగా నిందు ధాతువులు విశదీకరింపబడెను. మూడు సర్గల యీ కావ్యమునందలి యితివృత్తము కంసవధ. నిర్ణయ సాగర్ ప్రెస్ వారి కావ్యమాలాగుచ్ఛకములం దిది ఎన్నడో ప్రకటింపబడెను.

4. కవిపేరుకాని, కాలముకాని, పరిమితికాని తెలియని మఱొక కేరళీయ సంస్కృతకావ్యము 'పాణి నీయ సూత్రోదాహరణకావ్యము.'

5 'రామవర్మ మహారాజచరితము'; కర్త— పరమేశ్వరశివద్విజుడు (Vaikom Pacchu Muthatu.). తిరువాన్కూరుమహారాజగు ఆయిలం— తిరునాళ్ భూపాలుని (Ayilam-Tirunal) చరిత్ర వైభవ మీ కావ్యమున (క్రీ. 19 శతకము) చిత్రింప బడెను. ఈ కృతియందు పాణిని సూత్రముల కుదా హరణము లొసగబడుటయేకాక పాణిని సూత్రము లనేకము లిందలి శ్లోకములయందు గర్భితములై యున్నవి.

6. సరూప రాఘవము—(19 వ శతాబ్ది) కర్త కలత్తూరు రామస్వామిశాస్త్రి. రామకథాసుధ నుజ్జీవించి రచితమగు పై కావ్యమున ఆయా శీర్షి కల క్రింద వ్యాకరణ సూత్రములు ఒకానొక పద్ధ తిపై వ్యవస్థీకరింపఁ బడెను.

7. సుగమార్థమాల-(పండితరాజ నారాయణ నంబూద్రి—)

ఆచార్యు లంతేవాసికి చేయు నీ యుపదేశమున వ్యాకరణమునందలి దశలకారములును సోదాహరణముగా నిరూపింపబడెను.

## ప్రాకృత వ్యాకరణ కావ్యములు :

శ్రీచిహ్నకావ్యము (క్రీ. 14 వ శతకము)— శ్రీ కృష్ణలీలాశుక కవికోకిల: పై ప్రాకృత కావ్యము నకు 'గోవిందాభిషేక'మని నామాంతరము. 8 సర్గలు కల యీ కావ్యమున ఇతివృత్తము శ్రీ కృష్ణలీలాభి వర్ణనము. అసమగ్రమగు నీ కృతియందు వరరుచి కృత—'ప్రాకృత ప్రకాశమునకు' లక్ష్యము లెన్నియో యొసగబడెను. అసంపూర్ణమగు నీ గ్రంథమును లీలా శుకుని శిష్యశిరోమణియగు దుర్గాప్రసాదయతి

4 సర్గలు రచించి పూర్తి చేసెను. ఈ పరిశిష్ట గ్రంథమున త్రివిక్రమ పండితుని ప్రాకృత వ్యాకరణ మున కుదాహరణము లొసగబడెను.

ఇట్లు గురుశిష్యులు గ్రంథ నిర్మాణమున భాగస్వాములైన వృత్తాంతములు సంస్కృత సార స్వత చరిత్రమున ఇంకను మూడు లభించుచున్నవి.

1. జినసేనుడను జైన సంస్కృత కవి (క్రీ. 783-814) 'ఆదిపురాణము'ను 42 సర్గములవఱకు రచించి కాలగతినందగా అయన యంతేవాసి గుణభద్రుడు 'ఉత్తరపురాణ'మను 5 సర్గముల శిష్టభాగమును నిర్మించి గ్రంథమునకు సమగ్రతను చేకూర్చెను

2. కవిరాజు అరిసింహుడు, అతని సబ్రహ్మచారి, శిష్యుడు నవ్యాసియు అగు అమరచంద్ర సూరియు కలిసి ప్రశస్తకవిశిక్షాగ్రంథమగు 'కవి కల్పలత'ను రచించిరి. (క్రీ 13 వ శతాబ్ది.)

3 మహోపాధ్యాయ—భానుచంద్రగణి, తచ్ఛిష్య మహోపాధ్యాయ—సిద్ధచంద్రగణి: పై యిరువురును అక్బర్—చక్రవర్తి (పాలన: క్రీ. 1556-1605) దర్బారు నలంకరించిన ఆస్థానవిద్వత్కవిభూషణులు, ఆయనవల్లనే మహోపాధ్యాయ బిరుదభూషితులు. భానుచంద్రుడు కాదంబరీ పూర్వభాగమునకు వ్యాఖ్య రచింపగా, తదంతేవాసి సిద్ధ(ద్ధి)చంద్రు డుత్తర భాగమునకు వ్యాఖ్య నిర్మించెను. చక్రవర్తికి సూర్య సహస్రనామోపదేష్టయై, సంస్కృతమున అష్టోత్తర శతావధానముచేసి ఆయనవలన బిరుదముల నందిన విద్వత్కుంజరు డీయన.

మధురకవియు, భక్తశిరోమణియునగు లీలాశుకుడు కేరళ దేశీయుడు ఆయన జనని నీలీదేవి; జనకుడు దామోదరుడు; గురు ఈశానదేవుడు. లీలాశుకుడు కవితారంగముననేకాక వ్యాకరణ—వేదాంతముల యందును ప్రజ్ఞానిధి. సన్యసించిన ఈయన బిల్వమంగళుడని వ్యవహరింపబడుచుండెను. మధాసదృశమగు కవితామాధురికల 'శ్రీకృష్ణకర్ణామృతము' (3 శతకములు), త్రిభువనసుభగము, పురుష కారము, బృందావనస్తుతి మొదలగు నెన్నో రచనలనుర్ లీలాశుకుడు నిర్మించెను. వీనిలో కృష్ణకర్ణామృతము విద్వల్లోక విఖ్యాతమై, భక్తకల్పద్రుమమైన స్తోత్రరాజము.

దుర్గాప్రసాదయతి గురుప్రసాదితమగు గోవిందాభిషేకమును పూరించుటయేకాక మొత్తము 12 సర్గముల గ్రంథమునకు వ్యాఖ్యనుకూడ రచించెను.[6]

గోవిందాభిషేకమునకు[7] నామాంతరము శ్రీచిహ్నకావ్యమని ఇతఃపూర్వమే సూచింపబడినది. మహాకావ్యలక్షణములలో కావ్యాంకములు (=కావ్యచిహ్నములు) ఎక్కడనోకాని సాహిత్యాలంకారగ్రంథములలో పేర్కొనబడలేదు. కాని కావ్య వాఙ్మయమున ఈ యంకము

---

5. Dr. M. Krishnamachariar: History of Classical Sanskrit Literature—paras 4 and 292 (1937)-2 nd enlarged ed.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి: 'సంస్కృత వాఙ్మయచరిత్ర'–2 సంపుట: లౌకికవాఙ్మయము—పుటలు—344 46 (2 వ ముద్రణము, హైదరాబాద్)–1961.

6. దుర్గాప్రసాదయతి వ్యాఖ్యానమునందలి యీ క్రింది శ్లోకమును చూడదగును.

'శ్రీ కృష్ణలీలాశుక బద్ధ కావ్యం
వివృత్య, లోకస్య హితాయ పూర్వమ్,
తచ్ఛేషపూర్తిం చ పునర్విధాయ
వివృణ్మహే ఉత్తరభాగ మేతమ్?

7. మల్లాది సూర్యనారాయణశాస్త్రివర్యులు: 'సంస్కృత కవిజీవితము' (1950) న లీలాశుకుని వృత్తాంతమును (పుటలు 462—67) కనదగును. ముట్నూరి సంగమేశంగారు 'కృష్ణకర్ణామృతము' (3) అను వ్యాసమున (T. T. D, Journal for Mar. 69) లీలాశుకుని రచనలు 16 అని పేర్కొనిరి.

అనేక స్థలములందు కనబడుచున్నవి. ఈ కావ్యాంకములకు శ్రీకారము చుట్టిన కవిశేఖరుడు (క్రీ 570) భారవియే. ఈ కవి కిరాతార్జునీయమును శ్రీకారముతో (శ్రియః కురూణాం) ఆరంభించి, ప్రతిసర్గాంతమున 'లక్ష్మీ' పదమును తుది శ్లోకమున జేర్చుచువచ్చెను. ఈ కారణమున ఈ కావ్యమునకు 'లక్ష్మీపద లాంఛనము' అను నామాంతరమును కల్గెను.

భారవిని పెక్కురీతుల ననుసరించి, అనుకరించిన మాఘకవిశేఖరుడును 'శిశుపాలవధ'ను శ్రీ శబ్దముతోనే ('శ్రియః పతి') ఉపక్రమించి, ప్రతి సర్గాంతపద్యమునను శ్రీశబ్దమునను బంధించెను. గ్రంథపుష్పికలలో ప్రతిసర్గాంతమునను కవియే 'శ్ర్యఙ్కము' అని తన కృతిని ఈ క్రిందిరీతిని పేర్కొనెను:

'ఇతి శ్రీ మాఘకృతౌ శిశుపాలవధే
మహాకావ్యే శ్ర్యఙ్కే
నారదసంభాషణం నామ
ప్రథమః సర్గః.' (పుట 28)

—(నిర్ణయసాగర ప్రతి — సంస్కరణ 7; బొంబాయి; 1917)

కావ్యాంకములను గూర్చి మొట్టమొదట సూచించి, వర్గీకరించి, ఉదాహరించిన సాహిత్య మహారథుడు, సజీవవిజ్ఞానకోశము ఆచార్య హేమచంద్రుడు (క్రీ. 1088—1174). ఈ మహామహుని 'కావ్యానుశాసనము'న 8 వ ప్రకరణము (పు. 335) విలోకింపదగును. (Prof. R. C. Parikh's ed. 1938—Bombay)

'శ్రీ' శబ్దమును కావ్యాంకముగ ప్రయోగించుటయందలి సార్థక్యమును వ్యాఖ్యాతృసార్వభౌముడు, మ. మ. మల్లినాథసూరి ఈ క్రింది రీతిని విశదీకరించెను:

'చమత్కారకారితయా, మంగళాచరణరూపతయా చ సర్గాన్త్యశ్లోకే లక్ష్మీశబ్ద ప్రయోగః. యథాహ భగవాన్ భాష్యకారః—'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణి, ఆయుష్మత్పురుషాణి చ భవన్తి, అధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి.' "

---

8. M. R. Kale's ed. of Bharavi's 'Kiratarjuniya'—Contos I to III. 2nd ed. revised. P. 31 (1925)—Bombay.

## పరిశిష్టము—1.

### కావ్యాంకములు

ప్రస్తుతవ్యాసకర్త కావ్యసారస్వతమున గవేషణ మొనర్చి పడసిన 40 కావ్యాంకములు విద్వద్వినోదమునకై పట్టికారూపమున నీ క్రింద ప్రదర్శింపబడుచున్నవి.

| | కావ్యాంకము | కావ్యము | కవి | విశేషములు | |
|---|---|---|---|---|---|
| 1. | అనురాగ | సేతుబంధము (ప్రాకృతము)=(రావణవహో) | ప్రవరసేనుడు. | కలకత్తా (ముద్రిత | 1962 |
| 2. | అభ్యుదయ | కృష్ణచరిత | — | | |
| 3. | అలంకార | — | — | | |
| 4. | 1. ఆనంద | అవంతిసుందరీకథాసార | అజ్ఞాతకర్తృక | 8 సర్గలు. ముద్రిత | 1957 |
| | 2. ఆనంద | శూద్రకకథా | పంచశిఖ | | |
| | 3. ఆనంద | నైషధీయ చరిత | శ్రీహర్ష | 22 స. నిర్ణయసాగర్ ప్రెస్ ముద్రిత | 1942 |
| | 4. ఆనంద | పార్వతీ రుక్మిణీయ | విద్యామాధవ | ద్వ్యర్థి; అముద్రిత | |
| | 5. ఆనంద | మధ్వవిజయ | నారాయణ పండితాచార్య | 16 స ముద్రిత | |
| 5. | ఉత్సాహ | హరివిజయ | సర్వసేన | | |
| 6. | ఉదయ | చంద్రప్రభచరిత | వీరనంది | (18 స.) కావ్యమాల, 30 సం. | 1892 |
| 7. | (కర్ణికార) | శ్రీకంఠచరిత | 'కర్ణికార'కవిరాజరాజానక మంఖకుడు | (25 స.) కా. మా. 3. | 1900 |
| 8. | కామదేవ.... | రాఘవ పాండవీయ | కవిరాజసూరి | (13 స.)కావ్యమాల 62 | 1897 |
| 9. | జయ...... | ఉషాహరణ | | | |
| 10. | జిన......... | నిర్వాణలీలావతి (ప్రాకృత) | జినరత్నసూరి | | |
| 11. | ధనంజయ.... | ద్విసంధాన (=రాఘవ పాండవీయ) | ధనంజయ | (18 స.) కా.మాల 49. | 1895 |
| 12. | ధర్మ | రుక్మాంగదీయ చరిత (=వైష్ణవోత్సవ | వ్యాస—పద్మనాభ | అముద్రిత—(పూనా) | |
| 13. | ధైర్య | ఉదాత్తరాఘవ నాటక | మాయురాజ | | |
| 14. | రత్న | హరవిజయ | వాగీశ్వర విద్యాధిపతి— రత్నాకర | (50 స.) కా. మా. 22 | 1890 |
| 15. | రవి | — | రవిసేన (ప్రాకృతకవి) | | |
| 16. | రాజశేఖర | హరవిలాస (ఉత్పన్న) | బాలకవి-కవిరాజ రాజశేఖర | (స్వనామాంక) | |
| 17. | రామ | — | డిండిమకవి సార్వభౌమ— అరుణగిరినాథ | | |
| 18. | 1. లక్ష్మి | నలకీర్తి కౌముది | అగస్త్య— విద్యానాథ | 2స.మాత్రమే లభించినవి | |
| | 2. లక్ష్మి | ధర్మాభ్యుదయ (=సంఘపతి చరిత) | ఉదయప్రభసూరి | 'లక్ష్మ్యంక'మని పుష్పికలలో (Ed. 1949) | Ed. 1949 |
| 19. | 1. విజయ | — | విజ్జిక (=విజయాంకా) | | |
| | 2. విజయ | శంభురాజ చరిత (అముద్రిత) | హరికవి | | |
| | 3. విజయ | హైహయేంద్రకావ్య (అముద్రిత) | హరికవి | | |
| 20. | విమల | — | విమల (=విమలాంక)— ప్రాకృతకవి | | |
| 21. | విరహ....... | — | హరిభద్ర (విరహాంక) | | |

## వ్యాకరణశాస్త్ర కావ్యములు

| | కావ్యాంకము | కావ్యము | కవి | విశేషములు | |
|---|---|---|---|---|---|
| 22. | 1. వీర......... | బాలభారత | అమరచంద్రసూరి | (18 పర్వములు)- (కా. మాల. 45.) | 1894 |
| | 2. వీర........... | పద్మానంద మహాకావ్య (19 స) | అమరచంద్రసూరి | గైక్వాడ్ ఓరియంటల్ సీరీస్. 58) | 1932 |
| 23. | శ్రీ........... | జయంతవిజయ (21స.) | అభయదేవ..... | Kavyamala 75-NSP | 1902 |
| 24. | శ్రీశబ్దాది–లక్ష్మీశబ్దాంత | కిరాతార్జునీయ | భారవి | 6th ed. Nirnaya-sagar Press, Bombay. | 1942 |
| 25. | శ్రీ శబ్దాది–శ్రీ శబ్దాంత | శిశుపాలవధ | మాఘ | 12 th. NS. P. ed | 1957 |
| 26. | శ్రీ శబ్దాది- సంపదానంద | పార్వతీ రుక్మిణీయ | విద్యామాధవ | | |
| 27. | శ్రీ (చిహ్న | శ్లేషాంకకావ్య | కృష్ణ- కొంకవి | ముద్రిత. లాహోర్. | |
| | శ్రీ........... | శ్రీ చిహ్నకావ్య (ప్రాకృత) | లీలాశుక + దుర్గా ప్రసాదయతి | (8+4 స.) | |
| 28. | సారస్వతశ్రీ | ఉదయసుందరీకథా చంపూ) | సోడ్ఢలకవి | (8 ఉచ్ఛ్వాస)(గై.ఓ. సీరీస్) బరోడా. | 1920 |
| 29. | సుఖాంక | సత్యబోధవిజయ | కృష్ణాచార్య కవి | 10 స. అముద్రిత. | |
| 30. | సుధాధారా | ప్రతినైషధ | నందనందనకవి | అముద్రిత. | |
| 31. | స్వనామాంక | హరవిలాస | రాజశేఖర | ఉత్పన్న | |
| 32. | హరిచరణసరోజ | నలచంపూ (దమయంతీ కథా) | త్రివిక్రమ | (కా. మా. లా.) | 1922 |

## పరిశిష్టము—2.

### వ్యాకరణ కావ్యమాలికా—సౌరభము

| | కావ్య నామము | కవి | | క్రీ. శ. |
|---|---|---|---|---|
| 1. | అలివిలాస సంలాపము | మహామహోపాధ్యాయ మానవల్లి గంగాధర | పరస్సహస్ర శ్లోకమితము | |
| 2. | కవి రహస్య | హలాయుధ (క్రీ900 952 [శాస్త్రి | Gothigen ed. | 1894 |
| | | | Helier's ed. | 1900 |
| 3. | కుమారపాలచరిత (=ద్వ్యాశ్రయకావ్య) | కలికాల సర్వజ్ఞ అచార్య–హేమచంద్ర | Editor S. P Pandit. (Bombay Sanskrit and Prakrit Series ) Vol I (Canstos : 1-20) SKT. Grammar. | 1885 |
| | | | II (C. 21–28 Prakrit ,, | 1900 |
| 4. | దశాననవధకావ్య | యోగీంద్రనాథ - తర్కచూడామణి | | |
| 5. | ధాతుకావ్య | మేల్పుత్తూర్–నారాయణభట్టు (Sequel to Vasudeva Vijaya No. 13. Below) | 16th Century. Kuvyamala Part X. pp. 121–132. 3 cantos (Bombay) | 1915 |
| 6. | పాణిని సూత్రోదాహరణ | అజ్ఞాతకర్తృక | | |
| 7. | భట్టికావ్య (=రావణవధ) | భట్టికవి | Editor K P. Trivedi, with Mallinatha's Com 22 Cantos: (Bombay S. P. Series ) | |

| | కావ్యనామము | కవి | | క్రీ శ. |
|---|---|---|---|---|
| 8. | యదువంశకావ్య | కాశీనాథ | | |
| 9. | రామవర్మ మహారాజచరిత | పరమేశ్వర | | |
| 10. | రావణార్జునీయ | భట్టభీమ..... | కావ్యమాల–68 | 1900 |
| 11. | లక్షణాదర్శ | మ. మ. దివాకర | | |
| 12. | వాక్యావళి | | Dr. P. L. Vaidya's 2 rd edition. | 1936 |
| 13. | వాసుదేవ విజయ | వాసుదేవ (Vide Dhatukavya No. 5 for sequel) | (పదచంద్రికా (స్వోపజ్ఞవ్యాఖ్య) 7 స. | |
| 14. | శ్రీ చిహ్నకావ్య (=గోవిందాభిషేక) | కృష్ణ లీలాశుక తచ్ఛిష్య దుర్గాప్రసాదయతి | 8 సర్గములు 4. స. పరిపూరణ గ్రంథము శిష్యుని సమగ్ర వ్యాఖ్యారచన : | |
| 15. | శ్రీ చిహ్నకావ్య | కృష్ణ-కాక్-కవి. | క్రీ. 1801. లాహోరులో ముద్రితము. | |
| 16 | సరూపరాఘవ | ఇలత్తూర్ రామస్వామిశాస్త్రి | క్రీ. 19 శతాబ్ది. | |
| 17. | సుగమార్ధమాల | పండితరాజ–నారాయణ – నంబూద్రి | | |
| 18. | సుభద్రాహరణ | నారాయణ | 20 సర్గములు. | |
| 19. | హరినామామృత (=వైష్ణవ వ్యాకరణ) | జీవగోస్వామి (హరేకృష్ణాచార్యకృత 'బాలతోషణీ' వ్యాఖ్యతో) 939 పు. | రామనారాయణ విద్యారత్నకృత-వంగానువాదముతో (Berhampore) | 1883-84 |

## పరిశిష్టము-3.

## ఉపజీవ్య గ్రంథమాలిక

# (Bibliography)

| | Title of the work | Author | Details about the edition | |
|---|---|---|---|---|
| 1. | Amaravani | N. Ch. S. Venkatachari | Eluru | 1968 |
| 2. | Anargha.Raghava | Murari | 'Kavvamala'–5th ed. Nirnayasagar Press, Bombay......... | 1937 |
| 3. | Bhojaprabandha | Ballala | 10 th ed Nirnayasagar Press, Bombay. | 1932 |
| 4. | Contribution of Kerala to Sanskrit Literature | Dr. K. Kunjunni Raja Ph D. | Published by the University of Madras. | 1958 |
| 5. | A Critical Study of Sri Harsha's Naishadhiya—Carita | Dr. A. N. Jani, Ph.D., D. Litt. | 'Research Series of the M.S. University of Baroda' | 1957 |
| 6. | History of Classical Sanskrit Literature. | Dr. M. Krishnamchariar, M. A., M. L., Ph. D. | Tirupati | 1937 |

| | Title of the work | Author | Details about the edition | |
|---|---|---|---|---|
| 7. | History of Sanskrit Literature-Vol II. | Pt. M. Suryanarayana Sastri | 2nd. ed. (in Telugu) Hyderabad. | 1961 |
| 8. | Kiratarjuniya | Bharavi | i M R. Kale's II ed. (Cantos 1–3, Bombay. | 1925 |
| | | | ii Nirnayasagar Press–Vi ed. ,, | 1942 |
| 9. | Krishnakarnamrita (Articles in Telugu on Lilasuka & Krishna karnamrita) | M. Sangamesam | Journal T.T. Devasthnams Tirupati | |
| | | | (A) Vol. XX No. 1. (pp. 51–54) Jan. | 1969 |
| | | | (B) ,, No. 2. (69–72) Fed | 1969 |
| | | | (C) ,, No. 3 (62 68) Mar. | 1969 |
| 10. | Lives of Sanskrit Poets (=Samskrita-Kavi jirita | Pt. M. Suryanarayana Satsri | (In Telugu)-Vol. I. (pp 62–67) Eluru. | 1950 |
| 11. | The Sastra-Kavyas of Kerala | Dr. S. V. Subramania Iyer, M. A., Ph. D. | (P. P. 58–59)–Summaries of papers'-of the 24 th session-A: I. Oriental Conference–Varanasi. | Oct 1968 |
| 12. | Ugadi–Sanchika (Anual No. of the Andhra Patrika) Paper on Lilasuka, | M. Ramakrishna Kavi, M. A., | (For Dundubhi) Madras. | 1922 |



నాటిక:

# తప్పెవరిది?

శ్రీ డి. ప్రభాకర్

★

## ఇందులో వచ్చు పాత్రలు

★

* రేణుక......
* రంగారావు......
* వేణు......
* వామనమూర్తి......

(గత సంచిక తరువాయి)

(వేణు ప్రవేశం)

వేణు : (ఏమని పిలువాలో అర్థంగాక) రేణుక గారూ...!...అత్తా...ఛీ ఛీ...అక్కా...నాన్సెన్స్ ఆవిడె అక్కగారెలా అవుతుంది...? మరెలా పిలువాలి...ఆ...అయిడియా...ఏమండోయ్... ఏమండీ...!

రేణుక: (రేణుక వస్తుంది) ఓహ్! మీరా! ఎవరా... ఈ ఏమండీ! అని హడావిడి పడిపోయాను... అదిసరేగానీ మీరు వెళ్ళినపని ఏమైంది?

వేణు : నేను వెళ్ళిన పనా సక్సెస్...గ్రాండ్ సక్సెస్...

రేణుక:(ఆనందంగా) అయితే కంగ్రాచ్యులేషన్స్... ఉండండి...ఇపుడేవస్తా ... (లోపలివెళ్లి ఓ ప్లేటులో 'లడ్డు' పట్టుకొచ్చి వేణుకిచ్చి) తినండీ!...

వేణు :ఇదేమిటి...భూగోళాన్ని పట్టుకొచ్చారు?

రేణుక: అందులో నా హృదయ సామ్రాజ్యముంది...

వేణు : ఏమండోయ్...! మీరు చెప్పేదేదో సూటిగా చెప్పండి—కవిత్వం మన బుర్రకెక్కదు...

రేణుక:చెప్పాల్సొచ్చినప్పుడు సూటిగా చెప్తాగాని ముందు మీరు తిందురూ...!

వేణు : ఎందుకో చెబుదురూ...

రేణుక:ఎందుకేమిటి...మీకు ఉద్యోగం వచ్చింది కనుక మీ నోరు తీపి చేస్తున్నాను...

వేణు : నాకు ఉద్యోగం వచ్చింది కనుక మీరు నా నోటిని తీపిచేస్తున్నారు...మీరు ఉద్యోగం ఇప్పించారు కనుక మీ నోరు నే తీపి చేస్తాను కమాన్. లెటజ్...హావ్...ఫిఫ్టీ ఫిఫ్టీ...

రేణుక: (నవ్వుతూ) అర్ధాంగికిగానీ అర్ధభాగమివ్వ కూడదంటారు...?

వేణు: (అంటూ) అంటే అన్నారు .... మీరు కానివ్వండి...

రేణుక: (తిని చేయి తుడుచుకుంటూ) ఇక మొదలు పెట్టండి...మీ ఉద్యోగ విజయాలు...

(వేణు తటాల్న లేచి ఓ చెయ్యి చెవిదగ్గ రుంచి పద్యంచెప్పే పోజులో నిలబడతాడు)

రేణుక: అదేమిటి పద్యాలు చదవబోతున్నారా...?

వేణు: మరి...మీరేగదండీ ఉద్యోగవిజయాలు చెప్ప మన్నారు...?

రేణుక: భలే గమ్మత్తుగా మాట్లాడతారే......

వేణు: తాగుబోతువాడ్ని...

రేణుక: దయచేసి మళ్ళీ ఆ మాట అనకండి... మీరు ఏ పరిస్థితుల్లో తాగుడును అలవాటు చేసుకున్నారో నా కర్థమైంది...మళ్ళీ ఆ మహామారి జోలికిపోతే నామీద ఒట్టే...!

వేణు: రేణూ...(ఆవేశంలో ఏకవచన ప్రయోగం చేసినందుకు నొచ్చుకుంటూ) క్షమించాలి... రేణుకాదేవిగారూ...

రేణుక: నాకు గార్లూవద్దూ...చార్లూవద్దు...... ఇపుడు పిలిచినట్లు 'రేణూ' అనండి...... చాలు......కనీసం ఆ పిలుపు విన్నపుడైనా బ్రతుకుమీద ఆశ కలుగుతుంది...

వేణు: రేణూ! ఏమిటా మాటలు......(ఆవేశంగా రేణుక చేతులు పట్టుకుంటాడు. ఆ ఆవేశంలో ఒక గాజు పగిలి క్రిందపడుతుంది. రంగారావు ప్రవేశించటంతో యిద్దరూ గాభరాగా సర్దుకుంటారు. రేణుక లోపలికి వెళ్తుంది)

వేణు: నువ్వా మామయ్యా...!

రంగా: నేనే మామయ్యా...!

వేణు: నువ్వా యిప్పుడే వచ్చావా మామయ్య...!

రంగా: నేనూ యిప్పుడే వచ్చా మామయ్యా...!

వేణు: అత్తయ్యగారికి...

రంగా: లేట్...! అక్కయ్యగారికి...

వేణు: ఆ...వారికే మామయ్య...నీ గురించి చెప్తున్న మామయ్యా...

రంగా: ఏమని...?

వేణు: అదే మామయ్య......అపోల్లో8 ని శాటర్న్ రాకెట్ పైకి నెట్టినట్లు—మా మామయ్య నన్ను నిరుద్యోగపర్వంనుండి ఉద్యోగపర్వంలోకి నెట్టాడని...

రంగా: ఆ! నాదేముందిరా! నీకు అన్నీ అర్హత లున్నాయి—ఉద్యోగం యిచ్చారు.

వేణు: అలా అనకు మామయ్యా! అన్ని అర్హత లుండటమే ఈ దేశంలో ఒక పెద్ద అనర్హత—

(రంగారావు నవ్వుతాడు, క్రింద దేన్నోచూచి నవ్వాపుతాడు—ఆపి...వంగి గాజు ముక్కను తీసి చూస్తుంటాడు. వేణు గాభరాపడుతుంటాడు).

వేణు: ఏమిటి మామయ్యా, గాజుముక్కను పట్టుకుని అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్...

రంగా: ఆ! ఏమీలేదురా...దీనికి నోరు ఉంటే ఎంత బాగుండేదా! అని—

వేణు: ఔనౌను...నోరుంటే కోరుక్కున్నన్ని కథలు చెప్పేది—

రంగా: నోరులేనిది-అదేం చెప్తుందిగానీ,—నోళ్ళున్న మనం కాసేపు మాట్లాడుకుందాం—

వేణు: అలాగే...

రంగా: వేణూ! నేను రెండో పెళ్ళి ఎందుకు చేసుకున్నాననుకున్నావ్...?

వేణు: నీవు స్త్రీ జనోద్ధరణ సంఘానికి అధ్యక్షుడివి గదూ మామయ్యా ... అందుకని అయి వుంటుంది...

రంగా: అదికాదురా. (పెద్దనిట్టూర్పు విడిచి) నేను మొదటినుండీ నష్ట జాతకుడినేరా! పుట్టగానే నా పెళ్ళాం అనుకున్న దాన్ని...పెరిగే వయస్సుతో నా మీద ప్రేమను పెంచుకున్న మీ అక్క శాంతను పొందలేకపోయాను...

వేణు : ఆమెకు పదహారోయేటనే నూటపదహార్లూ నిండినై...వెళ్ళిపోయింది...

రంగా : అందుకేరా మీ అమ్మ నాన్న...నాకు తులసి నిచ్చి పెళ్ళిచేసారు...నన్ను కంటికి రెప్పలా కాపాడుకునే మనిషిరా...తులసి...కండ పెరిగి గుండెలాగి నన్నొంటరివాణ్ణి చేసిపోయిందిరా... వంటరివాణ్ణి చేసిపోయి ది...తులసి జ్ఞాప కాల్లో నలిగి నలిగి చివరకు నాకు...ఓ తోడు కావాల్సిందేనన్న నిశ్చయానికొచ్చాను... అలా నిశ్చయించుకున్న తర్వాతనే...రేణుక నాన్న గారింటికి వ్యాపారరీత్యా వెళ్లటం, రేణుక నా కథ విని కన్నీళ్లు కార్చటం జరిగింది— తర్వాత రేణుక ఓ రోజు నా దగ్గరకొచ్చి 'తులసక్కయ్య మీ హృదయంలో సంపాదించు కున్నచోటు చూస్తుంటే నిజంగా నాకు ఈర్ష్య కలుగుతుంది!' ఆ మహాతల్లి పూజిం చిన దేవుణ్ని పూజించి నా చేతనైనంతవరకు సుఖపెట్టాలని ఉన్నది—దయచేసి నాకా అవ కాశం ఇప్పించండి మీపాదలచెంత చోటివ్వండి......అని వేడుకొంది...

వేణు : నువ్ సరేనన్నావ్...?

రంగా : అనక ఛస్తానా! అప్పటికీ చిలక్కి చెప్పి నట్లు చెప్పాను అమ్మాయ్ నీది పొంగుతున్న వయసు—నాది పొంగి చల్లారుతున్న వయసూ అని...అయినా వింటేనా...

వేణు : నువ్వు యింకాస్త గట్టిగా నచ్చ చెప్పాల్సింది...

రంగా : నేనెంత నచ్చచెప్పినా వినకుండా ఏమందో తెలుసా? కుర్రకారు......అనుభవంకొరకు ఆరాటపడతారు, అనుభవించగానే వాళ్ల అభి రుచులు మార్చుకుంటారు — అక్కడినుండి కట్టుకున్నదాన్ని కాలదన్ని - దానిదారికోసం పరుగులు తీస్తారు- కానీ—మీకు వయసు యిచ్చినఅనుభవముంది-నిశ్చలమైన ప్రేమా వుంది—అలాంటి మీరు - నాకు అన్యాయం చెయ్యరన్న నమ్మకం నాకుంది — అందుకే మీరంటే ఇష్టం ఏర్పడింది-నన్ను దయ తలచండి—అని ముప్పొటలా ప్రార్థించింది.

వేణు : నీకు ఆ మాటల్లో నమ్మకం కుదిరిందా...?

రంగా : ఏ మాటల్లో...?

వేణు : అదేవయసులో వున్నవాళ్ళు కొద్దిరోజులలోనే పెండ్లాడినవాళ్లను మరచి - క్రొత్తఅందాల కొరకు పరిగిడుతారన్న మాటల్లో—

రంగా : నమ్మకం ఎందుకులేదు...చాలావుంది...ఆవిడ చెప్పినవేమైనా అబద్ధాలైతేగా...?

వేణు : ఆ నమ్మకం ఉన్నవాడివి రేణుకగారి నెందుకు పెండ్లాడేవు మామయ్యా?

రంగా : ఏమిటా ప్రశ్న...?

వేణు : అవును మామయ్యా...! రేణుక వయసువాడిన ప్రౌఢకాదు-వయసులోఉన్న ముగ్ధ—అనుభవం పండిన ఆడదీకాదు—...అనుభవం కోరుకునే కన్య- అందుకే—తన కోర్కెలు తీర్చుకునే తొందరలో—నీ ఆకారాన్ని—నీ వయస్సును లెక్క చెయ్యలేదు — కోర్కె తీర్చుకున్నాక — ఆమె అన్నట్టుగానే— ఆమె అభిరుచి మారవచ్చుగా— ఎందుకంటే – ఆవిడ వయస్సులో వున్నది కనుక...

రంగా : వేణూ...!

వేణు : కోపగించుకోకు మామయ్యా.........వియ్యాని కైనా...కయ్యానికైనా — సమఉజ్జీ ఉండా లంటారు...

రంగా : ఏమిటి —నువ్వనేది...? రేణుక 'బీదపిల్ల' అనా?

వేణు : కాదు 'చిన్నపిల్ల' అని—సమఉజ్జీ ఆస్తి పాస్తుల విషయంలోకాదు మామయ్యా కావల సింది...అందం, ఆకారంలో — వయసూ... వలపులో...

రంగా : అంటే...మా యిద్దరి వయస్సుల మధ్య భరింపరాని తేడా వుందంటావ్...!

వేణు : నే ననేదేమిటి మామయ్యా...చూచిన ప్రతి వాడూ అంటాడు......అమ్మాయికి కులుకు ప్రాయం..ఆయనికి వాలుకుప్రాయం...అని...

రంగా : వేణూ (కోపంతో ఊగిపోతాడు.)

వేణు : నిజం చెప్తున్నా మామయ్యా...విస్మరించకు......! కొంత కాటుక దిద్దుకొనే వయసులో కట్టుకున్నవాడు కాటికివెళ్లే వయసులోఉంటే—వాళ్ల సంసారం సాగరం అవుతుంది— సాగరం అల్లకల్లోలం మవుతుంది— సుఖం పండవలసినచోట దుఃఖం, స్వర్గం నిలవవలసినచోట నరకం...... వెలుస్తాయి...

రంగా : వేణూ ! మంచిసలహా చెప్పావురా...

వేణు : కోప్పడకు మామయ్యా...! రేణుక మాట విని ఈ పెళ్లి చేసుకున్నానని నువ్ చెపుతుంటే...పెండ్లాడేముందు ఈ విషయాలు ఆలోచిస్తే బాగుండేది ... అంటున్నాను... అంతేకానీ మీరిద్దరూ కోరికోరి దగ్గరైనారు— చేసుకుంటున్న సంసారాన్ని వదలి దూరంగా పొమ్మని చెప్పటంలేదు. అయినా అలా చెప్పేందుకు హక్కు నా కెక్కడుంది...?

రంగా : అవును...లేదురా......ఆ హక్కు నీకే కాదు. మరెవ్వరికీలేదు—కానీ...కానీ...కొన్నిగ్రహాలు... లేని ఆ హక్కును వినియోగించుకొని— రేణుక చుట్టూచేరి—నీ మొగుడు ముసలివాడు, నిన్ను సుఖపెట్టలేనివాడుఅని చెప్పిందేచెప్పి... దాని మనసు మార్చేస్తున్నారు...

వేణు : ఎవరు మామయ్యా...వాళ్లు

రంగా : ఎవరైతేనేం......నువ్వు వాళ్లలో ఒకడివి కాకూడదు...!

వేణు : మామయ్యా...

రంగా : అవున్రా వేణూ ! నేను 'రేణు'ని ప్రపంచంలోని ఏ భర్తా తన భార్యని ప్రేమించనంతగా ప్రేమిస్తున్నానురా...దాని సమక్షంలో సర్వం మరిచిపోతున్నాన్రా......నానుండి నా 'రేణుని' వేరుచెయ్యకండి...నా బ్రతుకు చీకటిపాలు చేయకండి...యివి చేతులు కావు...

వేణు : మామయ్యా...! నన్నునుమానిస్తున్నావా?

రంగా : అనుమానించటంలేదురా......నిన్ను అభిమానిస్తున్నాను...రేణుక చెప్పుడుమాటలు బాగా వంటబట్టించుకుంది - నిన్ను నువ్వు మరిచిపోకుండా ఉండేందుకే ఈ జాగ్రత్తలు తీసుకుంటున్నాను...

వేణు : మీ మాటలు వింటుంటే నే నీ యింట్లో వుండటం మంచిదికాదనిపిస్తుంది...

రంగా : ఇక్కడ ఉండడమే మంచిది వేణూ...! నువ్ నా మేనల్లుడివని తెలిసేక రేణుక నీకు ఉద్యోగం ఇప్పించమని, ఈ ఇంట్లోనే వుండనివ్వమని...మంకుపట్టు పట్టింది ... అందుకే నీకు ఉద్యోగం వేయించాను—ఇంట్లో ఉండమన్నాను...ఈ పరిస్థితులలో నువ్వు బయటికివెళ్ళావంటే రేణుక నన్ను అవమానిస్తుంది— దాంతో తను బజార్నపడుతుంది... నా పరువు బజార్న పెడుతుంది.

వేణు : మరి నన్నేం చెయ్యమంటావ్ మామయ్యా?

రంగా: మాటివ్వు...!నాతోనే వుంటానని మాటివ్వు... రేణుక జోలికి పోనని మాటివ్వు...రేణుకను నీ జోలికి రానివ్వనని మాటివ్వు - నా సంసారం నిలబెడతానని మాటివ్వు...

వేణు : నా మాటమీద నీకు నమ్మక ముందా...?

రంగా: అసలు నా మాటమీదకంటే...నీ మాటమీదే నా కెక్కువ నమ్మకముంది.

వేణు : అయితే...నీ యిష్ట ప్రకారమే మాటిస్తాను మామయ్యా...

(వేణు లోపలికి వెళ్తాడు. రంగారావు అనుసరిస్తాడు—పదిరోజులు గడిచిందని సూచించడానికి టేబిల్ పైన డేట్ మార్చి ఉంటుంది— లైట్లు వెలుగుతాయి.)

(వేణుకూర్చుని ఏదో పుస్తకం చదువుతుంటాడు. రేణుక ప్రవేశం)

రేణుక : ఏదో చదువుతున్నారు...?

వేణు : ఆఁ...ఏదో నావెల్. (గభాల్నలేచి) వస్తాను...

రేణుక: అదేమిటి...నేను రాగానే మీరు బయలు దేరారు...

వేణు : కొత్త నీరొచ్చి పాతనీటిని కొట్టుకుపోవటం సహజం...

రేణుక: ఎంత కొత్తనీరైనా సముద్రం దగ్గరకెళ్ళి పాత నీటితో కలవాల్సిందే గదండీ...? ఆ కబుర్లు పేదో ఇక్కడినుండి కానివ్వండి... కూచోండి వెళుదురుగాని...

వేణు : (ఆవులిస్తాడు) కూచుందామనే వుంది...కానీ నిద్రొస్తుంది...(మళ్ళీ ఆవులిస్తాడు)

రేణుక:(కోప మొస్తుంది) ఓ...నేనొస్తు నిద్రాదేవిని వెంటబెట్టుకొచ్చి...మీ నెత్తికెక్కిచ్చినట్లున్నాను...ఆ నిద్రాదేవిని వెంటబెట్టుకొని నేనే...వెళ్తాలెండి...మీరు చదువుకోండి... పాపం...

వేణు : మీరు అనవసరంగా కోపగించుకుంటున్నారు...

రేణుక : లేకపోతే ఏమిటండీ—నేను రాగానే మీరు పరుగెత్తటం—అంటురోగిని చూచినవాడిలా...?

వేణు : నిజంగా నాకు నిద్రొస్తున్నది......అయినా నీకోసమే వచ్చినట్లుంది...కాసేపు కూచునే వెడతాను — అంతలోనే ఆగ్రహిస్తుంటురి మరి...

రేణుక : ఆగ్రహంకాదు — ఆవేదన — కోపంకాదు దుఃఖం...

వేణు : ఈమాత్రానికే...!

రేణుక: వేణూ...కానివాడు కర్రతోకొట్టినా కదలని మనసు కావలసినవాడు కసురుకుంటేనే కలవరపడుతుంది...

వేణు : మీరు మరీను...మన పరిచయమై పది రోజులు కాలేదు...నన్నప్పుడే మీకావలసిన వాళ్ళ జాబితాలో చేర్చేసుకున్నారు...?

రేణుక : క్షమించండి...నాక్కావల్సిన జాబితా అంటూ ఇప్పటివరకూ ఏదీలేదు. ఇక వుండబోదు...

వేణు : అంటే...!

రేణుక . అంటే.....నాక్కావల్సినవాళ్లు ఎందరో లేరు......ఒక్కరే ఉన్నారు......ఆ ఒక్కరూ మీరేనని...

వేణు :రేణుకాదేవి! బాధ్యతగల వ్యక్తులుమీరు... మీరు మాట్లాడవలసిన మాటలు కావు... యివి...

రేణుక: బాధ్యత...ఏమిటా బాధ్యత...!

వేణు : సంసార బాధ్యత...

రేణుక :సంసారబాధ్యతగల స్త్రీకు కావలసిన వారుండకూడదా?

వేణు : ఉండవచ్చు...కాని ... వాళ్లమధ్య సంబంధం సోదర సోదరీ అనుబంధమై ఉండాలి...

రేణుక: బుట్టలో పడ్డారు సారీ! మీరు...నాకు కావల్సిన వారన్ననేగాని మనిద్దరిమధ్య ఆలు మగలు సంబంధముండాలని అనలేదే! తమరు ఏదో ఊహించుకొని మీ భుజాలు తడుము కొని—నా భుజాలు తడుడుతున్నారు...(నవ్వుతుంది )

వేణు : హాస్యంగా కొట్టిపారెయ్యకండి రేణుకాదేవి...! మీ రేదో వాదనకొరకు అన్నప్పటికీ...మీరు నన్ను సోదరుడిగా చూడలేరని నాకు తెలుసు... మిమ్మల్ని...సోదరిగా...స్వీకరించటం సాధ్యమయ్యే పనికాదని నాకు తెలుసు—అటువంటప్పుడు...మనం దగ్గరయ్యేకొద్దీ...మనిద్దరి మధ్య తలెత్తేదీ సోదరప్రేమమాత్రం కాదు...

రేణుక: నాక్కావల్సింది కూడా అదే...

వేణు : ఈ విషయంలో మీ క్కావల్సింది కోరుకునే హక్కు మీకు...లేదు...

రేణుక : ఏం...? ఎందుకని లేదు...?

వేణు : మీరు వివాహితులు గనుక...

రేణుక : నేను వివాహితను కాదండీ......వివాహితను కాను......నేను ధనానికి అమ్ముడుపోయిన సరుకును...కుదవపెట్టబడిన నగను......ఇది మంగళసూత్రం కాదు...నా గొంతుకు బిగించిన ఉరిత్రాడు......మా ఆయన అనబడే

ఆయన...నన్ను చెరబట్టిన రాక్షసుడు... (ఏడుస్తుంది)

వేణు : ఏమిటి...మీరు మాట్లాడుతున్నది.?

రేణుక : నిజమే మాట్లాడుతున్నాను...ఈ నిజం మీకెందుకు...మీకు చేదుగా వుందికదూ...

వేణు : నిజం నిప్పులావున్నా భరించగల శక్తి నాకుంది — ఎటొచ్చీ.........మీరు నిజం చెప్తున్నారా ... లేదా......అనేదే సమస్య... అయితే ... మీ కిష్టంలేకపోయినా......మా మామయ్య మిమ్మల్ని పెండ్లాడేడంటారు...? (రేణుక అవునన్నట్లు తలూపుతుంది) మీ కిష్టంలేని పెళ్లి ఎందుకు చేసుకున్నారు...?

రేణుక : మా నాన్నకు యిష్టమైంది గనుక...!

వేణు : అదేమిటి...

రేణుక: మా నాన్నకు అశ్వమేధయాగప్పిచ్చి జాస్తి...

వేణు : అంటే గుర్రప్పందాల పిచ్చేగా...

రేణుక : అవును...ఆయన... ...గుర్రప్పందాలమీద లక్షలు ఖర్చుచేసి వందలు సంపాదించాడు... ఆ వందలు ఒకట్లస్థానంలోకి రావటంతో అడ్డొచ్చిన వాళ్లదగ్గర అప్పు అడగటం మొదలుపెట్టాడు...అలా అడ్డొచ్చి అప్పిచ్చిన వాళ్లలో శ్రీ రంగారావుగారు ముఖ్యులు...

వేణు : అంటే...మా మామయ్య...?

రేణుక : ఆ......మీ మామయ్యే ! ఆయనకీ మా నాన్నకు గుర్రప్పందాల స్నేహం. ఆ స్నేహం తోటి మా యింటి కొస్తుండేవారు...... మొదటిభార్య వున్నపుడే ఈయన నామీద ఓ కన్నువేయటం జరిగింది. ఆవిడ కాస్త పోగానే...రెండో కన్నుగూడావేసి — నా చేతులు పట్టుకొని...నన్ను పెళ్లిచేసుకోవూ—అని ఏడ్చేరు...నేను కాదు పొమ్మన్నాను...దాంతో ఆయనొక ప్లానువేసి మా నాన్నకు ఒక షరతుమీద అడిగినప్పుడు అడిగినంత డబ్బిచ్చేవారు...

వేణు : ఏమిటా షరతు...డబ్బు చెల్లించనిపక్షంలో మిమ్మల్ని తన కిచ్చి పెళ్లి చెయ్యాలనేనా...?

రేణుక : సరిగ్గా చెప్పారు...ఆ షరతు అడ్డం పెట్టుకొని గడువుతీరగానేవచ్చి నన్ను తన కిచ్చి పెళ్లిచెయ్యమని నాన్న నడిగేరు......నేను ససేమిరా ఒప్పుకోనన్నాను...అపుడు నాన్న... నన్ను కన్నతండ్రి ఏమడిగాడో తెలుసాండీ... (గాద్గదికంగా) రేణు...రంగారావు బంగారు పిచుక...అతడ్ని పెండ్లాడకపోతే పోయావు... అతడితో కలసి (చెప్పలేక ఏడుస్తుంది) ఆ తర్వాత బాగాఆలోచించాను...డబ్బును చూస్తే గుర్రాన్నితప్ప మరో విషయం బుర్రలోకి రానీయని మా నాన్న...యివాళ రంగారావు గారిని తీసుకొచ్చేడు...రేపు ఆయన డబ్బివ్వనంటే...డబ్బిచ్చే మరో సుబ్బారావు గారిని పట్టుకొస్తాడు—నన్ను బజార్నపెట్టి తనక్కావల్సినది రాబట్టుకుంటాడు...అలా జరగకుండా ఉండాలంటే...రెండే మార్గాలు కన్పించినై...ఒకటి మనసుని చంపుకొని రంగారావుగారికి రెండవ పెళ్ళాంగా వెళ్లటం; రెండవది...మనసుకోసం శరీరాన్ని చంపుకోవటం...నాకు రెండోపద్ధతేనచ్చి యిసి, గన్నేరు పప్పులు తిన్నాను.

వేణు : ఆత్మహత్యా...!

రేణుక: అయినా...చావనివ్వారుకాదు దుర్మార్గులు... తిన్నది కక్కించి ఆ మగత తెలీకముందే శ్రీ రంగారావుగారిచేత నా మెడలో ఉరి వేయించారు.

వేణు : నిజంగా దేవుడు వఠ్ఠిఫూల్! వాడు...నారుపోసి తర్వాత నీరు పోస్తాడుటగానీ—నారుకుపట్టిన తెగుళ్లకు మందేయటం చేతకాదు వెధవకి...

రేణుక: అవును...ఆ దేవుడే తనుపోసిన నారుకు పట్టిన తెగుళ్లకు మందు వేస్తుంటే... మా నాన్న...అంత అవినీతికి ఒడికట్టేవాడు కాదు. పెళ్లాం అవసరంలేని మీ మామయ్య మళ్లీ పెళ్లి చేసుకునేవాడు కాదు.

వేణు : మన్మథబాణం తగిలి మామయ్య మళ్ళీపెళ్ళి చేసుకుంటే అలా అంటారేమిటి? (నవ్వుతాడు.)

రేణుక: మన్మథబాణమా!... గురితప్పితే మానుకైనా తగుల్తుంది...కానీ...మీ మామయ్యకు తగలదు...

వేణు: అలా అయితే...ఆయన మిమ్మల్ని ఎందుకు పెండ్లాడినట్లు...?

రేణుక: ఎందుకా...ఆయన మొదటి భార్య ఒదిలి పోయిన పట్టుచీరెలు కట్టుకునేందుకు... నగలు పెట్టుకునేందుకు...ఇనస్పెక్టి తాఖాలూ బాడ్లో తగిలించుకుని...వచ్చే మినిష్టర్లకూ పోయే మినిష్టర్లకూ విందుల్లో వడ్డించేందుకు...ఈయనంటే పడిఛస్తున్నట్లు... పళ్ళికిలించుకుంటూ...ఈయన ప్రక్కనే తిరిగేందుకు...

వేణు: అంతే మరి...అందం విలువ గుడ్డివాడికేం తెలుస్తుంది...సంగీతం విలువ చెవిటివాడికేం అర్థమవుతుంది?

రేణుక : బాగా చెప్పారు...నిజంగా అందం విలువ, ఆనందం విలువ, మనిషి విలువ, మమత విలువ తెలుసుకోగలశక్తి మీకుంది...గనుకనే మీనుండి నేను...

వేణు : ఆ ఆ.......నా సానుభూతి మీ కెప్పుడూ వుంటుంది రేణుకాదేవీ...!

రేణుక: నా క్కావల్సింది సానుభూతికాదు...చోటు పవిత్రమైన చోటు......మీ హృదయంలో చోటు......మీ పాదాలచెంత చోటు (పాదా లంటుకుంటుంది )

వేణు : ఆవేశపడుతున్నారు...రేణుకాదేవీ ! తప్పటడుగు వేస్తున్నారు...

రేణుక : కాదు......ఇదికాదు తప్పటడుగు......మీ మామయ్య పెండ్లాడేపుడు వేసిందే తప్పటడుగు...అపుడు వేసింది...దాన్ని దిద్దుకుంటూవేసిన సరిఅయిన అడుగు...నా బాధ గుర్తించండి...నా ప్రార్థన మన్నించండి... నన్నర్థం చేసుకోండి –(వేణుమీదకు వొరిగి పోతుంది...వేణు దూరంగా జరుగుతాడు...)

వేణు : రేణుకాదేవీ !...ఈ అభ్యర్థనను మీరు కన గానో...లేక...

రేణుక: ఆగేరేం...కానివ్వండి...

వేణు : లేక విధవగానో చేసుంటే......నేను మహదానందంతో మన్నించివుండేవాడిని...కాని...... మీరు... ...వివాహితులు...రేణుకాదేవీ...... సాక్షాత్తూ భర్తలో కాపురం చేస్తున్న వారు...మీరు...

రేణుక : నేను చేస్తున్నది కాపురంకాదు...దాస్యం... నాకు ఆయన భర్తకాదు...యజమాని.. మా యిద్దరిమధ్య బాంధవ్యం...ఆలుమగల అనుబంధం కాదు — యజమాని సేవకుల సంబంధం...

వేణు : రేణుకాదేవీ ! మీకు యిష్టమున్నా లేక పోయినా...మీ పెళ్ళి అయిపోయింది. మీకు నచ్చినా...నచ్చకపోయినా...మీ మెళ్ళో తాళి కట్టినవాడే...మీ భర్త ... మంచో—చెడో... పెళ్ళంటూ చేసుకున్నాక.. దానికి కట్టుబడి ఉండటమే శ్రేయస్కరం...

రేణుక : మీరు చెప్పిందంతా విన్నాను......నేను చెప్పేదికూడా విని...సమాధానం చెప్తారా...?

వేణు : ఏమిటో చెప్పండి...

రేణుక : పొరపాటున నిప్పుమీద చెయ్యివేశాం అనుకోండి...?

వేణు: అది నిప్పు గనుక కాలుతుంది...

రేణుక : అవును...అది నిప్పుకనుక కాలుతుంది— నిప్పు కాలగానే అబ్బాఅని చెయ్యి వెనక్కి లాక్కుంటావవా...లేక...మన ఖర్మ అలా కాలిందని...నిప్పుమీదనే అణచి వుంచుతాము...

వేణు : .......................

రేణుక: మాట్లాడరేం...

వేణు : చేయితీసుకోవడం సహజం...

రేణుక: ఒప్పుకున్నారా...! అలాగే పొరపాటున...ఇదీ నా పొరపాటునకాదు...నా తండ్రిచేసిన పొరపాటువల్ల...నా యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా...నా తండ్రి వయసువచ్చినవాడికి కట్టబెట్టబడ్డాను... ఫలితం...నాకు... సుఖం శాంతి...సంతోషం.. అన్నీ కరువైనై. కనుక నాకు సుఖసంతోషాలిచ్చే మార్గానికి...నా జీవితాన్ని మళ్లించాలనుకుంటున్నాను...ఇందులో తప్పేంతమాత్రమూ లేదు...

వేణు : జీవితగమ్యాన్ని నీ యిష్టం వచ్చినట్లు మార్చుకోవడానికి అవతల సంఘముంది...

రేణుక: (నవ్వుతుంది) సంఘం...ఉత్త మొరిగే కుక్క. కొత్తపంథా త్రొక్కేవారినిచూసి, అరచి, అరచి నోరు మూసుకుంటుంది. సంఘానికి కరిచే శక్తివుంటే...చెడును తుడిచివేసే శక్తి వుంటే...దేశంలో ఇంతమంది లంచాలావులు చిద్విలాసంగా ఉండేవారుకాదు... రెక్కలమీద బ్రతుకుతున్న వాళ్ల డొక్కలు...అంత లోతుకిపోయేవికావు... మా నాన్న......మీ మామయ్యా...ఇలా బరితెగించేవారుకారు...

వేణు : రేణుకాదేవీ! ఆవేశంగా మాట్లాడినందువల్ల అజ్ఞానం వెల్లడవుతుందిగానీ...ప్రయోజనమేమీ వుండదు...మాట్లాడితే సంఘాన్ని దుయ్యబడతారు...ఆ సంఘమే లేకపోతే... మీ జీవితం...మీ జాతి...జీవితం కుక్కలు చింపిన విస్తరిలా తయారై ఉండేది...ఆ సంఘం ఏర్పరచిన వివాహవ్యవస్థే లేకపోతే... మీ ఆడజాతి రక్షణలేక...బజారు కుక్కల్లా పిల్లల్ని వెంటేసుకొని వీధులవెంట తిరగాల్సి వచ్చేది...ఆ సంఘమే...ఒక మొగుడు...ఒక పెళ్లాం అని నిశ్చయించకపోతే మీరు... మీకంటే బలమైన మగజాతి చేతుల్లో నలిగి నలిగి, పువ్వు పుట్టి వాడినంతసేపు కూడా జీవించి వుండేవారుకాదు...

రేణుక: అదికాదండీ...నేననేది...?

వేణు : ఇక నాకేం...చెప్పకండి...రేణుకాదేవీ...!మీరు కోరికలకు బానిసలై మూర్ఖంగా ప్రవర్తిస్తున్నారు...దయచేసి పిచ్చి పిచ్చి ఆలోచనలు... మీ మనసులో జొరనివ్వకండి...శాంతంగా ఆలోచించండి...తర్వాత మీకే తెలుస్తుంది... మీరు ఏలాంటి తప్పటడుగు వేయబోయారో... బాధపడకండి ... బాధపడకండి రేణుకాదేవీ!...ఇది నిజం...(పైకి వెళ్లిపోతాడు)

(రేణుక ఏడుస్తూ సోఫాలో కూలబడుతుంది. వామనమూర్తి ప్రవేశం...అడుగులో అడుగువేసుకుంటూవచ్చి అనుమానంగా...అటూ ... యిటూ చూస్తాడు...)

వామన: రావణాసురు డున్నాడా...?

రేణుక : ఎవరూ...ఓహ్... మీరా...రండి...(కళ్లు తుడుచుకుంటూ) అదేమిటి ... ... ఇంత రాత్రప్పుడు...

వామన: అమ్మమ్మా ! అలా అనకండి...మిమ్మల్ని ఉన్నఫళంగా చూడాలనిపించింది...వచ్చాను... అదేమిటి...మీరు కళ్లు తుడుచుకుంటున్నారు......అయ్యయ్యో ! మీ ముఖం చూడండి...ఎంతచిన్నబోయిందో...ఆ ఉబ్బిన కళ్లు...ఆ కాంతిలేని వదనం...ఎర్రబడ్డ ముక్కు...ఇవన్నీ చూస్తుంటే చంద్రమండలంలో మిట్టపల్లాలున్నాయన్నమాట నిజమే ననిపిస్తుంది...తమ దైన్యానికి... కారణం...?

రేణుక: ఏమీలేదుకానీ, మీ రొచ్చినపని...?

వామన: ఏమీలేకపోవట మేమిటండీ ! ఆ రంగారావు రావణాసురుడే అయ్యుంటాడు ! నాకు తెలుసండీ ! ఇది ఇల్లుకాదు ... అశోకవనమని మీరు రేణుకాదేవికాదు—సీతమ్మవారని ... నా అసలుపేరు... ...రామవామనమూర్తిలేండి —

అందరూ...వామనా...వామనా ... అని పిలుస్తుంటారు ... కానీ... మీరు ... రామా... రామా...అనండి...చాలు...

రేణుక : వామనమూర్తిగారూ !......ఏమిటా పిచ్చి వాగుడు...?

వామన : అమ్మమ్మా...అలా అనకండి ... నిజంగా పిచ్చే...మీ అందం చూస్తుంటే పిచ్చెక్కుతుంది......మీ బాధ చూస్తుంటే ఏడుపొస్తుంది...

రేణుక : ఏడవకండి...

వామన : మీరు ఏడవవద్దన్నా...నా హృదయం ఊరుకుంటుందండీ ! ఊరుకోదు......అది మీ కోసమే... ...తహతహలాడే రేసుగుర్రంలాగా పరుగెడుతుంది...

రేణుక : దయచేసి మీ రొచ్చిన పన్జెప్పండి...... వామనమూర్తిగారూ...

వామన : నేనొచ్చిన......పని...ఆ...అదే... ...నేనేమో మిమ్మల్ని పరామర్శించిపోదామని వస్తున్నానా...అద్భుచిలోకులు మేకుల్లాంటి మాట లంటున్నారండీ...!

రేణుక:ఏమంటున్నారు...?

వామన :(గొంతు సవరించుకొని) అదే...మీవారు... మీ వయసుకు తగినవారుకాదని...మిమ్మల్ని సుఖపెట్టలేక పోతున్నారనీ...నేను ఇక్కడికి వస్తూపోతూ...ఆయనివ్వలేని సుఖాన్నిస్తున్నాననీ...అసలీ అపవాదువేసింది...మీ రావణాసురుడే!...ఇది విన్నాక నాకో ఆలోచన వచ్చింది...వచ్చిన అపవాదుని ఎలాగూ తుడిచి వెయ్యలేనుకదా...పోనీ...వాళ్ళనుకునే సుఖాన్నైనా ఇద్దామనీ...(రేణుక చెయ్యిపట్టుకుంటాడు.)

రేణుక :(వామనమూర్తి చెంప చెళ్ళమనిపిస్తుంది.) (కోపంతో) లోకంకూసిందని నువ్ గాడిదలా ఓండ్రపెడుతున్నావా! ముసలివాడి పెళ్ళాన్నైనంతమాత్రాన...నాకు... నీతి... నిజాయితీ... మనసు నియమం లేవనుకున్నావా! ఏదో వెర్రివాడవని...దగ్గరకు చేరనిస్తే...వెధవ్వేషాలు వేస్తావా...

(వామనమూర్తి రేణుకని బలంగా దగ్గరకు లాక్కోబోతాడు...రేణుక కెవ్వున అరుస్తుంది— వదులు; వదులు అంటుంది — వామనమూర్తి చెయ్యి కొరుకుతుంది...వామనమూర్తి గగ్గోలు పెడ్తాడు ... వేణు గాభరాగాదిగి వస్తాడు)

వేణు :ఏమిటి రేణుకాదేవీ! ఏమైంది...

రేణుక : (పరుగునవెళ్ళి వేణు గుండెలమీద తల ఆన్చి ఏడుస్తుంది) చూ సా రా ... ఈ దుర్మార్గుడేం చేశాడో...చనువుగామాట్లాడేనని...చెయ్యి పట్టుకున్నాడు.

వేణు : (రేణుని వదలివెళ్ళి వామనమూర్తికాలర్ పట్టుకుంటాడు) ఏరా...ఫూల్! ఒంటరిగా ఆడది కన్పిస్తే తుంటరిపనులు చేస్తావా! చూడు నిన్నేం... చేస్తానో...! (చేతులు మడుస్తుంటాడు).

వామన : నేను ' చూ డ లే ను బా బో య్.. ! నన్నేం చెయ్యొద్దు ... పెళ్ళాం బిడ్డలు కలవాడ్ని బాబోయ్! నన్ను చంపొద్దు...

వేణు : పెళ్ళాం పిల్లలున్న రాస్కెల్‌వి...యిలాటి పనులు చేస్తావా...?

వామన :చెయ్యక ఛస్తానా...!

వేణు : ఏమిటా అర్థంలేని వాగుడు...?

వామన : అర్థమయ్యేలా చెప్తే తన్నకుండా వదుల్తారా?

వేణు : చెప్పు! (గద్దిస్తాడు).

వామన : చెప్తున్నా...నేనీమధ్య ఒక కథ చదివేను— అందులో జీతంచాలని గుమాస్తా గాడికి—

ఓ ముసలాఫీసరుంటాడు ... ఆయనకు... ఓ పడుచు పెళ్ళాం వుంటుంది ...ముసలి వయసు పడుచుతనాన్నిపరవశింప చేయలేక పోతుంది. అది కనిపెట్టిన ... హీరో... గుమాస్తా...ఆఫీసరు పడుచుపెళ్ళాన్ని మచ్చిక చేసుకుంటాడు...ఇక చూడండి......అతగాడికి ప్రమోషన్లు, ఇంక్రిమెంటులు రాకెట్లలో ప్రయాణంచేసి వస్తాయ్ ......నాకు... ఆ కథలో ముసలి ఆఫీసరుగా రంగారావుగారు, ఆయనదగ్గర సుఖాన్ని నోచుకోని... పడుచు పాత్రవంతో రేణుకాదేవిగారూ కన్పించారు... ఇక ఆ గుమస్తాను నేనే అయితే...డబ్బొస్తుందన్న ఉద్దేశ్యంతో...రేణుకాదేవిగారి దగ్గర ప్రేమ నటించాను...సుఖాన్ని అమ్ముకుందామనుకున్నాను...

వేణు : డబ్బుకోసం ప్రేమ నటిస్తావా!

వామన: మరేం చెయ్యమంటారు సార్! నా జీతం 150 రూపాయలు. ఆ నూటయాభైలో నేనూ, నా భార్య, ముగ్గురు పిల్లలు బ్రతకాలి—ముందు తిన్నా తినకపోయినా... తెల్లటిబట్టల్లో బయటకు రావాలి...... అప్పటికీ పైకి తెల్లచొక్కా వేసుకొని... అడుగున ఇదుగో...యిలా చిల్లులబనీన్లు వేసుకొని కొత్తవి కొనకుండా గడుపుతున్నాను...కానీ, చంటివానికి పాలడబ్బా కొనకుండా...ఎలా వుండగలను...? పిల్లవాడిని బడికి పంపక—పెళ్ళానికి మందు యిప్పించక ఎలా ఉండగలను...? చెప్పండి సార్...!

వేణు : మీ అయ్యగార్ని జీతం పెంచమని ఎందుకు అడగగూడదూ...?

వామన: అడిగిఅడిగి, నోరు పెద్దదైంది...ఆకలి అధికమైంది...మరోసారి గట్టిగా అడిగితే... వీడెవడో నక్సలైట్‌లా వున్నాడు...డిస్మిస్... అనేట్లున్నాడు......చదువుకున్నవాడ్ని సరిగా ఉపయోగించుకోలేని ఈ దేశంలో ఉద్యోగం పోయినవాడు ఉరిపోసుకు చావాల్సిందే! సార్!......ఆ ఖర్మ పట్టకుండావుండాలనే ఈ వల పన్నాను...

వేణు : నీ పెళ్ళాం పిల్లల సుఖసంతోషాలకోసం మరొకరి పెళ్ళానికి కష్టం కలిగిస్తావా! ఇది న్యాయమేనా! ఒకవేళ నీ యిష్టప్రకారమే ఆవిడ లొంగిపోయి... మీ యిద్దరి రహస్యం...రంగారావుగారికి తెలిసి ఆవిడ్ని బయటకునెడితే, నువ్వు ఆమెను స్వీకరించి పోషించగలననుకున్నావా? మీ రిద్దరూ ఘర్షణ పడుతుండగా నేను చూచినట్లు రంగారావుగారు కూడా చూచి, నిన్ను ఉద్యోగంలోనుండి తీసేస్తే నీ గతి ఏమైవుండేదో ఆలోచించావా? అసలు ఈ విషయం నేను రంగారావుగారికి చెప్తే నువ్వేం చెయ్యగలవ్...?

వామన : క్షమించండి సార్...క్షమించండి! నే నివ్వేమీ ఆలోచించలేదు—ఆలోచిస్తే ఈ దుర్మార్గానికి ఒడిగట్టేవాణ్నికాదుసార్ ... నా నోట మట్టి కొట్టకండి సార్...

రేణుక : పోన్లెండి—అంతగా ప్రాధేయపడుతున్నాడు... వదిలేయండి...చూడండి..... వామనమూర్తిగారూ! ఇక్కడ జరిగింది...ఇక్కడే మరచి పోండి. మీ జీతం పెరిగేలా నేను ప్రయత్నిస్తాను...

వామన : రేణుకాదేవిగారూ! మీకు నేను ఆజన్మాంతం ఋణపడివుంటాను...ప్రతినెలా... మీ పేరు తలచుకొని, మరీ జీతం తీసుకుంటాను... వస్తానండి! వస్తానండి!

(వామనమూర్తి వెళ్లబోతాడు)

వేణు : మరి యిలాంటి పన్లు...

వామన : వచ్చేజన్మలోకూడా చెయ్యను...

(వెళ్ళిపోతాడు)

వేణు : చివరికి ప్రేమకూడా అంగడి కెక్కింది...!

రేణుక : నన్నిప్పటికీ నమ్మటంలేదా మీరు ! నేను వ్యసనబానిసనుకాను — నాకు కావలసింది మీరనుకునే తుచ్ఛసౌఖ్యంకాదు ..అదే కావాలనుకుంటే కాళ్ళదగ్గరకువచ్చిన వామనమూర్తిని కళ్ళ కద్దుకుని వుండేదాన్ని — కానీ,— నేను ఆ కోర్కెలతో కొట్టిమిట్టాడటంలేదు—(అంటూ మెల్లగా డ్రాయర్ దగ్గరకు వెళుతుంది)......నేను ప్రేమించిన వ్యక్తి హృదయంలో చోటుకొరకు ప్రాకులాడుతున్నాను...నన్నర్థం చేసుకోండి...చేసుకోలేకపోతే...(డ్రాయర్ సొరుగు తీస్తుంది. అందులో నుండి చిన్నసీసా తీస్తుంది. దానిమీద Poison అని వుంటుంది) మిమ్మల్ని నమ్మించలేనప్పుడు యీ బ్రతుకెందుకు...? మీ పాదాలదగ్గరే నన్ను కన్ను మూయనివ్వండి (అంటూ సీసా మూతతీసి నోటి దగ్గర పెట్టికోబోతుంది)

వేణు : రేణుకాదేవీ ! రేణుకాదేవి ! ఏమిటది? (రేణుక చేతిలోని సీసా తీసుకొని చూస్తాడు, చూచి జేబులో వేసుకుంటాడు)...పిచ్చిరేణుక! చచ్చి ఏమి సాధిద్దామనుకున్నావ్! ఎవర్ని సాధిదామనుకున్నావ్...!

రేణుక : (ఏడుస్తూనే) నన్నర్థం చేసుకోండి... ప్లీజ్ ...నన్ననుగ్రహించండి...

వేణు : (రేణుకను దగ్గరకు తీసుకొని ఆవేశంగా) రేణూ ! నాలో ప్రేమంటూ కలిగి పెళ్లి ఆలోచనంటూ వచ్చిందంటే అది నిన్ను చూశాకనే...రేణూ !...కానీ, కాని...

రేణుక : ఇంక మాట్లాడకండి...నే నిపుడు మహదానందాన్ని పొందుతున్నాను— మాటల్లో చెప్పలేను— నా జన్మ ధన్యమైంది......వేణూ ! వేణూ !...

వేణు : రేణూ! రేణూ!...

రేణుక : వేణూ!...

వేణు : వూ...నేను వేణుని కాదు...నీ వాడిని...దేవీ...

రేణుక : వేణూ!...నేమా...నీదానినే...నువ్వు నావాడివి కదూ...!

వేణు : ఊఁ!!...

(అంటూ యిద్దరూ...మిడిల్‌డోర్‌లోకి వెళ్తారు)

(లైట్లు ఒకసారి...ఆరి వెలుగుతాయి)

(రంగారావొచ్చి మిడిల్‌డోర్‌లోకి వెళ్లి చూచి బాధపడి మేడమీదకి వెళతాడు)

(లైట్లు మళ్లీ...ఆరి వెలుగుతాయి)

(వేణు రెండుచేతులతో తలపట్టుకుని కూర్చొని వుంటాడు)

రేణుక : (పాలగ్లాస్‌తో ప్రవేశం) పాలు తీసుకోండి...

వేణు : (విసుగ్గా) పాలెందుకూ...? కాస్త విషం తెచ్చిపెట్టు...

రేణుక : అదేమిటి...? అంతలోనే అలా అయిపోయారు...?

వేణు : అవునూ అదోలా మారిపోయాను-- మారిపోక ఏం చేస్తాను...? వ్యక్తిత్వం లేనివాడ్ని... ఏపనైతే చేయకూడదను కున్నానో...ఆపనే చేసినవాడ్ని — అ దో లా మారిపోక ఏం చేస్తాను...?

రేణుక : బాధపడకండి...

వేణు : నేనుచేసింది హర్షించతగ్గపనా...? పదిమందీ మెచ్చే పనా? ఆదరించినవాడి యిల్లు కూలదోయటం బుద్ధిచెప్పి గడ్డితినటం...నలుగురికి నచ్చే పనా...!

రేణుక : ఏమిటి మీ చాదస్తం . మనసులుదగ్గరైనై.. మనుషులం దగ్గరైనా అందులో తప్పేముంది?...

వేణు : తప్పుంది...రేణుకాదేవి...! ఎంతో తప్పుంది... అసలు మగనాలివైన నిన్ను ప్రేమించటం మొదటితప్పు...నా ప్రేమను నాలో దాచుకోలేక

నీ ముందు బయటపెట్టటం నా రెండోతప్పు. అలా చేసింది చాలక...పూర్వాపరాలు మరచి... పశువాంఛ తీర్చుకోవటం నా మూడోతప్పు. ఈమూడు తప్పుల్ని...మించిన తప్పొకటుంది రేణూ! ఇది నాగుండెల్ని కొరుక్కుతింటుంది. నా మెదడ్ని పనిచెయ్యకుండా చేస్తుంది... చూడు...రేణూ! ... నా శరీరం దహించుకు పోతోంది ... నేనీబాధ చరించలేను...రేణూ! భరించలేను...

రేణుక : సంతోషంగా గడపవలసిన సమయంలో ఎందు కండీ బాధపడతారు...?

వేణు : అయిపోయింది రేణూ అంతా అయిపోయింది... నీతో అక్రమసంబంధం పెట్టుకోనని మామయ్యకిచ్చినమాట తప్పేను...నామాట మీద నేను నిలబడలేకపోయాను...ఈ పాపాని కిక నిష్కృతిలేదు...లేదు...లేదు...

రేణుక : మీరు అనవసరంగా బాధపడుతున్నారు... అసలు మీ మామయ్యకు అందరిదగ్గరా అలా మాట తీసుకోవటం అలవాటే ... అలవాటే వేణు...

వేణు : రేణూ ! నిజానికి మామయ్య తన భార్య తనదిగా వుండాలనుకోవటంలో తప్పులేదు... తననుండి నిన్ను వేరుచెయ్యవద్దని...నాబోటి దుర్మార్గుల్ని కోరటంలో తప్పులేదు...... ఎటొచ్చీ తప్పంతా మాట తప్పటంలోనే ఉంది...రేణూ ! మామయ్యకిచ్చినమాట తప్పి మళ్ళీ ఈ పాపిష్టిముఖం ఆయనకు చూపించలేను......వెళ్ళిపోతాను అందరికీ... దూరంగా...దూరంగా వెళ్ళిపోతాను...

(ఏడుస్తూ మేడమీదకు వెళ్ళబోతాడు— మొదటి మెట్టుమీద రంగారావు కోపోద్రేకడై వుంటాడు – వేణు రంగారావును చూచి—చూడ బుద్ధవక సైకి వెళ్ళిపోతాడు...)

(రేణుక అపుడు ఎంట్రన్స్‌వైపు ఫేస్‌చేసి వుంటుంది...)

రేణుక : ఏమండీ ! మీరు చేసింది అంతపెద్దతప్పే అయితే......ఆ తప్పులో నాకూ......భాగ ముందండీ...? నన్నూ మీ వెంట తీసుకు వెళ్ళండి...ఇక్కడ కాకపోతే మరోచోట... మనం సుఖంగా బ్రతుకుదాం...

(రంగారావు మెట్లు దిగుతూ)

రంగా : ఎక్కడికి రేణుకా వెళ్తున్నావ్...

రేణుక : (రేణుక గభాల్ని. మెట్లవైపు చూస్తూ ... ఆశ్చర్యంగా) మీరా !...నేను...నేను...

రంగా : నాకంతా తెలుసు నడు...లోపలికి...

రేణక : (కదల్దు)

రంగా : ఊ ! ! పద లోపలికి (గట్టిగా తోస్తాడు).

రేణుక : (సోఫాలో పడుతుంది) ఏమిటి......మీ దౌర్జన్యం...?

రంగా : హ్హాహ్హా......సూర్యుడు మిట్టమధ్యాహ్నంవేళ వేడిగానే వుంటాడు రేణుకా...ఈ రంగారావు కూడా...దౌర్జన్యం చేయవలసినవేళ అదే చేస్తున్నాడు...

రేణుక : ఏమిటి...మీరనేది...?

రంగా : ఏమీలేదు...నీఅంతు తేలుస్తా నంటున్నాను...

రేణుక : నా అంతు మీరు తేల్చేదేమిటి...?

రంగా : నేగాకపోతే ... మరెవరు తేలుస్తారు ? అరేయ్ వేణూ! (మెట్లవైపుచూచి బిగ్గరగా అరుస్తాడు)

రేణుక : ఆఁ ఆయనే...నన్ను నీటముంచినా ... పాల ముంచినా...ఆయనే!...

రంగా : రేణుకా...కట్టుకున్నవాడిముందు కారుకూతలు కూస్తున్నావ్...

రేణుక : ఇవి కారుకూతలు కావు ... మనసులోని మాటలు...

రంగా : రేణుకా! గొంతువరకు అప్పుల్లో మునిగి గొంతు తడుపుకునే స్తోమతులేక అలో లక్ష్మణా అని అల్లాడుతున్న మీ కుటుంబానికి చేయూతనిచ్చి... నిన్ను పెండ్లాడినందుకు... నీ విచ్చే ప్రతిఫలం ఇదా? అన్నానికి అగచాట్లు పడుతున్న—నిన్ను అర్ధాంగిగా స్వీకరించి అష్టయిశ్వర్యాలు అప్పగించినందుకు నువ్విచ్చే బహుమతి ఇదా...?

రేణుక : క్షమించండి ... మేము అప్పుల్లో మునిగా మేమోగాని, అన్నానికి ఎపుడూ అల్లాడ లేదు... ఒకవేళ అల్లాడినా...మీ యింటి ముందు జోలికట్టుకుని నిలబడ లేదు... మా ... మానాన మేము బ్రతుకుతున్న రోజుల్లో...మీరే మాయింటికి వచ్చి...నాపిచ్చి నాన్నకు అప్పిచ్చి ... నన్ను కుదువబెట్టు కున్నారు...మీరంటే ఎంతమాత్రం యిష్టం లేని నన్ను బలవంతంగా పెండ్లాడారు...

రంగా : అవును పెండ్లాడాను—కానీ ఎందుకు...? మాణిక్యం లాంటి పిల్ల మట్టిగొట్టుకు పోతుందని...గౌరవంగా బ్రతకాల్సిన దానివి నీచమైనచావు చస్తావని...!

రేణుక : అంత దయగలవారైతే నన్నే ఎందుకు పెండ్లాడారు? ఏవరూలేని అనాధనో—మొగుడుచచ్చిన విధవనో...డబ్బుకు శరీరం అమ్ముకుంటున్నదాన్నో పెండ్లాడకపోయారు..?

రంగా : రేణుకా! హద్దు మీరుతున్నావ్...!

రేణుక . హద్దుమీరింది... మీరు...నా వయసుకు... మనసుకు వ్యతిరేకంగా పెళ్ళాడి హద్దు మీరింది... మీరు...

రంగా : అవును – నేనే హద్దుమీరింది... అందుకని నీవుకూడా నీ పరిధిని దాటుతావా?

రేణుక . యిష్టమైనవాడితో వెళ్ళిపోవటం పరిధినే దాటటమే అయితే! ··· హద్దు మీరటమే అయితే! నేను ఆ హద్దును మీరేందుకు సిద్ధంగానే వున్నాను...

రంగా: రేణుకా! వేణుతో పోతానంటావ్! వెదుదుగాని రేణుకా...అలాగే వెదుదుగాని...వేణుశవంతో స్మశానానికి వెళ్ళుదువుగాని...

రేణుక: ఏమండీ! మీ యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నది...నేను...మీ కోపం... నామీద తీర్చుకోండి...కాని...వేణునేమన్నా అంటే...

రంగా: ఏం చేస్తావ్...!

రేణుక: నేనేం చెయ్యగలను? ఆడదాన్ని...మీకురెండు చేతులెత్తి నమస్కరిస్తాను. మీ పాదాలంటి ప్రార్థిస్తాను...ఆయన్నేమీ అనకండి...

రంగా: కాళ్ళబేరానికి దిగావా! కరుడుగట్టిన మనసు నాది...కాళ్ళుపట్టుకుంటే కరిగేదికాదు...

రేణుక: (అమాయకంగా) మరెలా కరుగుతుంది...?

రంగా: మళ్ళీ వాడి మాటెత్తనని మాటివ్వు...

రేణుక: అది కల్లోనిమాట...

రంగా: అయితే వేణుచావు యింట్లోని మాటవుతుంది...

రేణుక: ఎలా అవుతుందో చూస్తాను...

రంగా: ఏం...తలతీసి మొలేస్తావా...?

రేణుక: హు...తలలు తీయించటం...తీసిన వాటిని మార్పించటం...మీరుచేసే నీచపుపన్నుల... దేవుడు దయతలచి నా కడుపున ఒక కాయ కాస్తే చౌరాస్తాలో నిలబడి అడిగిన వారికి అడిగినట్లు చెప్తాను...మీ బ్రతుకంతా బయటపెడ్తాను—రంగారావు కాసులకు కుదువబెట్టుకొని...కళ్ళుమూసి కళ్యాణం చేసుకుంది నన్నే...ఈ బిడ్డ నా బిడ్డే...కానీ రంగారావుగారి బిడ్డగాదు...నా దైవం వేణు బిడ్డని దండోరా వేయిస్తాను...నలుగురూ మిమ్మల్ని ఛీ! అనేలా చేస్తాను...

రంగా: ఏం కూసావ్...(చెంప ఛెళ్ళుమనిపిస్తాడు).

(వేణు మెట్లమీదనుంచి దిగుతుంటాడు... నోట్లోనుండి నురగవస్తుంటుంది. చేత్తో తుడుచుకుంటుంటాడు...తూలిపోతూ మెట్టు...మెట్టు దిగుతూంటాడు ఇంతలో రంగారావు ఆటుమాస్తాడు)

రంగా: రా...రా...రాస్కెల్! నీ కోసమే ఎదురు చూస్తున్నాను...

వేణు: నాకోసం నువ్వెందుకు ఎదురు చూడటం... నువ్వేమన్నా యమధర్మరాజావా!

రంగా: నోర్ముయ్! (గబగబావెళ్లి వేణు కాలర్ పట్టుకుంటాడు) ఒరేయ్ వేణూ! నేనొక టడుగుతాను నిజం చెప్పు...చెప్పరా తాగుబోతు వెధవా! నిజం చెప్పు...

వేణు: రేణుకా...నేను...నేనూ రేణుకా...

రంగా: ఏం చేశావో చెప్పు...రేణక నేంచేశావో చెప్పు... చెప్పరా వెధవా!

(రంగారావు వేణు ని కొడతాడు)

వేణు: కొడుతున్నావా...మామయ్య...

రంగా: నా సొమ్ముతిని.. నా రొమ్ముగుద్దిన వెధవ్వి... నిన్ను కొడ్తానా...కోస్తానా!

వేణు: సొమ్ముతిని రొమ్ముగుద్దేపని సాక్షాత్తూ ఆ శ్రీ కృష్ణుడే చేసాడు, మామయ్య.

(రంగారావు వేణుని వదిలిపెడ్తాడు)

(రంగారావు డ్రాయర్‌దగ్గరకు వస్తాడు)

రంగా: వేణూ! నువ్వు నీతి నిజాయితీ కలవాడివని ఆదరించాను — మాటమీద నిలబడేవాడివని నమ్మి......నీచేత ఒట్టుకూడా వేయించుకున్నాను...అన్నింటినీ...మరచి...

వేణు: అవును మామయ్యా! నాలో నీతి, నిజాయితీ ఒకప్పుడుండేవి...ఇపుడు లేవు......నే నిపుడు దుర్మార్గుణ్ణి...దాగాకోర్ని...మాటతప్పి బాట తప్పి...పాపాల వూబిలో పడిపోయినవాణ్ని...

రంగా: అందుకే అనుభవిద్దువుగాని (డ్రాయర్ సొరుగులోనుంచి పిస్టల్ తీస్తాడు — రేణుక... వేణుకు అడ్డం వస్తుంది...వేణుకు తగలాల్సినదెబ్బ రేణుకకు తగులుతుంది.)

రేణుక: వేణూ! (అంటూ వేణూ ఒడిలో ఒరిగిపోతుంది. వేణు — రేణుకతలను తన తొడమీద చేర్చుకుంటాడు.)

రంగా: రేణూ! రేణూ!

వేణు: తొందరపడ్డావ్ మామయ్యా... ...తొందరపడ్డావు...పదినిముషాలు ఓపికపట్టిఉంటే... నే చేసిన పాపానికి...నే మింగిన ఈ విషం నన్ను నరకానికి పంపిఉండేది...అలాంటిది... నన్ను చంపబోయావు...అన్యాయంగా రేణుక బలి అయిపోయింది ... బలి అయిపోయింది. మామయ్యా ... నా పాపానికి... ..నా మాట నిలుపుకోలేని నా చేతకానితనానికి...నా రేణుక బలైపోయింది...నువ్వు హత్యచేశావ్ ... నువ్ హత్యచేశావ్...మామయ్యా...నేనెలాగూ కొద్ది సేపట్లో ... పోతాను......నువ్ హంతకుడివి కాకూడదు...నువ్ హంతకుడివి కాకూడదు... ఇలా ఇచ్చెయ్ మామయ్యా...ఆ పిస్టల్ ఇలా ఇచ్చెయ్...

రంగా: వేణూ!

వేణు: నేను నిన్నటివరకూ...నీతి...నిజాయితీగలవాణ్నే మామయ్యా ... కానీ యివాళ...తప్పుదోవలో ఉద్యోగం సంపాదించేను...వేసిన ఒట్టును మట్టిన కలిపేను...ఇలా తప్పులు చేయటానికి అలవాటుపడ్డ నేను...ఇంకెన్నైనా చేయగలను మామయ్యా... ...ఆ ప్రమాదం రాకుండా వుండేందుకే ... యీ లోకంనుండి నిష్క్రమిస్తున్నాను...

రేణుక: ఏమండో...! వేణూ!...

(రేణుకను చూచి బాధగా నవ్వుతాడు ... రంగారావుకేసి చూచి) మామయ్యా...!

వేణు: పాపం, రేణు ... మంచిపిల్ల ... ఇన్నాళ్ళు కోర్కెలు తీరక కుమిలింది...ఇవాళ తీరి...

కుళ్ళికుళ్ళి ఏడ్చేవేళ... నీ ఆవేశానికి... నా ఉద్రేకానికి బలి అవుతున్నది... ఏమైనా... నీవు ఆ పిల్లకు అన్యాయం చేశావ్... నీలాగే తనకు నచ్చిన వ్యక్తిని కోరుకునే ఆ పిల్ల హక్కును.. కొల్లగొట్టావ్... మామయ్యా ... ... కొల్ల గొట్టావ్... వివాహమంటే... ఇద్దరు మనుషులు దగ్గరవటంకాదు మామయ్య .. వాళ్ల మనసులు చేరువవటం ... (వేణు నోటినుండి నురగ అధికంగా వస్తుంది)

రేణుక : ఏమండీ ! నా మూలంగానే... ఇదంతా జరిగింది...... నేను పాపాత్మురాలిని... నామీద మీకున్న సానుభూతిని ఆసరాగా తీసుకొని మిమ్మల్ని ఈ స్థితికి తీసుకొచ్చాను... నన్ను క్షమించండి... నన్ను క్షమించం...

(రేణుక చనిపోతుంది)

వేణు: నేను పాపాత్ముణ్ణి... రేణూ! పాపాత్ముడ్ని... నీకు అన్యాయం చేశాను. నీలో ఆశలు రేపాను... నీ ఖర్మకు నిన్నొదలి పోవాలని విషం మింగాను... మామయ్య మూర్ఖత్వానికి నిన్ను బలిచేసిన నేను... పాపాత్ముడ్ని... నీ అనురాగాన్ని నోచుకోని దురదృష్టవంతుణ్ణి... వస్తున్నా రేణూ... నీకు అక్కడ న్యాయం చేస్తాను... రేణూ! .. వస్తున్నాను... రేణూ. .. వస్తు. .

(వేణు పడిపోతాడు)

రంగా: రేణూ! వేణూ! (ఏడుస్తూ) ఉన్నతప్పు... అదీ తప్పుగానితప్పుచేసి యింత పెద్దశిక్ష విధించుకున్నావురా... వేణూ! నే చేసిన తప్పుతో పోలిస్తే... నీదసలు తప్పేకాదురా! యీ శిక్ష నువ్వనుభవించాల్సిందిగాదు నేననుభవించాల్సింది. ధనమిచ్చిన బలంతో బలవంతంగా రేణూని వివాహం చేసుకుంది నేను... దాన్ని అనుక్షణం అనుమానిస్తూ పశువుకన్నా హీనంగా చూసింది నేను... అమాయకుడివైన నీచేత అర్థంలేని ఒట్లు వేయించింది నేను .. ప్రేమించుకున్న మిమ్మల్ని విడదీసింది నేను... యీ తప్పంతా... నాదిరా... ఈ శిక్ష నాకు వాలిరా! శిక్షార్హుడ్ని నేను ... నేనురా... శిక్షార్హుడ్ని... శిక్షార్హుడ్ని నేను . నేను.. నేను ..

(తెరపడుతుంది)

---



# ద్రావిడభాషలలో లింగ వచనాలు

డా. పి. ఎస్. సుబ్రహ్మణ్యం

ద్రావిడభాషలలో తోద, బ్రాహుయీ తప్ప మిగిలిన వాటిలో ఉన్న లింగభేదాల్ని మూడు రకాలుగా విభజించవచ్చును. తోద, బ్రాహుయీ—ఈ రెండు భాషలలో అసలు లింగభేదమే లేదు.

మొదటిరకం :

మహత్ ఏకవచనం (త. అవన్);
మనుష్య బహువచనం (త. అవర్.)
మహతి ఏకవచనం (త. అవళ్.)
అమహత్ ఏకవచనం (త. అతు);
అమహత్ బహువచనం (త. అవ్/అవై)

ఈ రకం లింగభేదం తమిళం, మలయాళం, కన్నడం, తుళులో ఉంది. కోత, కొడగులలో కూడా ఇటువంటి లింగభేదమే ఉంది కాని యీ భాషలలో అమహత్తులో ఏకవచన బహువచన భేదం లేదు. అంటే కోత ద్, కొడగు అదు—వీటికి 'అది, అవి' అనే రెండు అర్థాలూ వస్తాయి. తోదలో లింగభేదం పూర్తిగా నశించి అత్ అనే మాటకి 'వాడు, ఆమె, అది' అనే మూడు అర్థాలూ వస్తాయి. తోద సర్వనామ, నామవాచకాలలో వచనభేదం ఉన్నా, క్రియలలో మాత్రం అమహద్రూపాలలో వచనభేదం లేదని మనం గుర్తించాలి.

రెండోరకం :

మహత్ ఏకవచనం (తె. వాడు)
మనుష్య బహువచనం (తె. వారు)
అమహత్ ఏకవచనం (తె. అది)
అమహత్ బహువచనం (తె. అవి)

ఈ రకం లింగభేదం తెలుగులో ఉంది. ఉత్తర ద్రావిడభాషలైన కూడుఖ్, మాల్తోలలో కూడా ఇదే రకం లింగభేదం ఉంది; కాని వాటిలో అమహత్తులో ఏకవచన బహువచన భేదం లేదు. ఈ భేదం తప్ప తెలుగులో ఉన్న లింగభేదానికి వీటిలోగల లింగభేదానికి తేడా ఏమీ లేదు.

మూడోరకం :

మహత్ ఏకవచనం (గోం. వోర్);
మహత్ బహువచనం (గోం. వూర్).
అమహత్ ఏకవచనం (గోం. అద్);
అమహత్ బహువచనం (గోం. అవ్)

ఈ రకం లింగభేదం తెలుగులో తప్ప మిగిలిన అన్ని మధ్యద్రావిడభాషల్లోనూ ఉంది. అవి గోండీ, కోలామీ, నాయకీ, పర్జీ, గడబ, కూయి, కువి, కొండ, పెంగో, మండ.

ఈ మూడురకాలైన లింగభేదాల్లో ఏది మూలద్రావిడ భాషకి చెందినది అనే విషయంలో పండితులలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఈ విషయాన్ని చర్చించేముందు తోద, బ్రాహుయీలలో లింగభేదం లేకపోవడం అర్వాచీనపరిణామమే అని మనం గుర్తించాలి. బ్రాహుయీ భాషలో దానికి ముందు కాలంలో లింగభేదం ఉండేది అని నిరూపించడానికి ఆధారాలు ఉన్నాయి. ఆ భాషలో ఓ/ఓద్ 'వాడు, అది'; ఓఫ్క్ 'వాళ్లు, అవి'—ఈ సర్వనామాలు మూ. ద్రా. *అత్, అవ్ అనే అమహత్ సర్వనామాలనించి వచ్చినవి (ఓఫ్క్‌లో చివర కకారం బహువచన ప్రత్యయం; త. అవర్, అవర్కళ్ — ఈ రూపాలలో కూడా సర్వనామంమీద నామవాచక బహువచన ప్రత్యయం చేరింది.) బ్రాహుయీలో ఈ సర్వనామాలతో ఆకాంక్ష కలిగిన ప్రథమ పురుష క్రియా

రూపాల్లో బహువచన ప్రత్యయం –ర్. ఇది మూ. ద్రా. మహద్బహువచనప్రత్యయమైన *–అర్ (త. అవర్, తె. వారులలో ఉన్నది) నించి వచ్చినది. ఓఫ్క్ అనే సర్వనామం మొదట్లో అమహత్తుకాగా దానితో ఆకాంక్షగల పురుషప్రత్యయం మొదట్లో మహత్తు అయిఉండడంవల్ల ముందుబ్రాహుయీ (Pre-Brahui Period) కాలంలో లింగభేదం ఉండేదనీ, యీ లింగభేదం నశించేటప్పుడు సర్వనామాల్లో అమహద్రూపాలు మిగలగా క్రియలలో మహద్రూపాలు నిలిచాయనీ మనం ఊహించవచ్చు. ముందు బ్రాహుయీకాలంలోఉన్న లింగభేదం దాని సన్నిహిత భాషలైన కూడుఖ్—మాల్తోలలోఉన్న లింగభేదం వంటిదే కావచ్చు.

ఇకపైన ఇచ్చిన మూడు రకాల లింగభేదాల్లో తెలుగు, కూడుఖ్, మాల్తోలలో ఉన్న లింగభేదమే మూలద్రావిడభాషలో ఉండేది అని చెప్పడానికి చాలా ఆధారాలు ఉన్నాయి. తులనాత్మక పద్ధతి ప్రకారం భౌగోళికంగా సన్నిహితంగాలేని రెండుఉపకుటుంబాలలో తుల్యంగఉన్న అంశం వాటి మూలభాషకి చెందినదని నిర్ణయించవచ్చు. తెలుగు మధ్యద్రావిడ ఉపకుటుంబానికి చెందినది (చూ. 'The Central Dravidian Languages' in Dravidian Linguistics (Seminar Papers): 107—134, Annamalai University Department of Linguistics Publication No. 17, Annamalainagar). కూడుఖ్ — మాల్తోలు ఉత్తరద్రావిడోపకుటుంబానికి చెందినవి. తెలుగు, కూడుఖ్ మాల్తోలు భౌగోళికంగా సన్నిహితంగాలేవు. కాబట్టి వీటిలో తుల్యంగాఉన్న లింగభేదం మూలద్రావిడ భాషకి చెందినది అయిఉండాలి. ఇంతేకాకుండా యీ తెలుగు, కూడుఖ్, మాల్తోలలో లింగభేదమే ప్రాచీనమైనదని అనుకుంటే మిగిలిన రెండు రకాల లింగభేదాలూ ఎలా దీనినించి పరిణమించాయో మనం సులభంగా ఊహించవచ్చు. దక్షిణద్రావిడభాషలలో మహతీ ఏకవచనంకూడా ఉంది. దీనికి ప్రత్యయం *–ఆళ్/అళ్ (త. అవళ్ వందాళ్ 'ఆమె వచ్చింది'). ఆళ్ అనేమాట 'స్త్రీ' అనే అర్థంలో ప్రత్యేక శబ్దంగా కూడాఉంది. చూ. తె. ఇల్లాలు, త. ఇల్లాళ్. స్త్రీలింగాన్ని ప్రత్యేకంగా సృష్టించుకొనేటప్పుడు మూలదక్షిణద్రావిడభాషావ్యవహర్తలు యీ ప్రత్యేక శబ్దాన్ని స్త్రీలింగ ప్రత్యయంగా ఉపయోగించడం మొదలుపెట్టిఉంటారు. కాబట్టి యీ భాషలలో స్త్రీలింగం ఒక నూతన పరిణామమని ప్రొఫెసర్ జూల్‌బ్లాక్ చెప్పారు. ఇక తెలుగు కాక మిగిలిన మధ్యద్రావిడభాషలలో ఏకవచన బహువచనాలు రెండిటిలోకూడా మహదమహత్ భేదమే ఉంది. జూల్‌బ్లాక్ ఈ భేదమే మూలద్రావిడభాషలో ఉండేదనీ మిగిలిన భాషలలో తరవాత కాలంలో మగవారూ ఆడవారూ కలసిఉన్న సముదాయాన్ని సూచించడంకోసం అమహత్తులోఉన్న స్త్రీలింగం మహత్తుతో చేర్చబడి మనుష్యవాచక బహువచనం ఏర్పడిఉంటుందనీ అన్నారు. కాని మగవారూ ఆడవారూ కలసిఉన్న సముదాయాన్ని సూచించడం ఏ భాషకైనా అవసరమే కాబట్టి మూలద్రావిడ భాషలోనే మనుష్యవాచక బహువచనం ఉండేదని ఊహించడం యుక్తియుక్తమని తోస్తుంది. ఇక తెలుగు తప్ప మిగిలిన మధ్యద్రావిడభాషల్లో యీ మనుష్యవాచక బహువచనంలోనించి స్త్రీలింగం తీసివేయబడి అమహద్బహువచనంతో కలిపివేయబడింది. ఈ భాషలలో ఏకవచనంలో మహదమహత్ భేదం ఉండడంవల్ల అదేరకం భేదం బహువచనంలో కూడా ఉండాలి అనే దృక్పథమే దీనికి కారణమై ఉండవచ్చు. ఈ కారణాలవల్ల తెలుగు, కూడుఖ్, మాల్తోలలోని లింగభేదమే మూలద్రావిడభాషలో లింగభేదమై ఉండాలిఅని ప్రొఫెసర్ ఎం. బి. ఏమెనో తమ Kolami, a Dravidian Language లో నిర్ణయించారు.

ఈ సందర్భంలో తెలుగుకీ, కూడుఖ్—మాల్తోలకీ గల చిన్నభేదం గుర్తించాలి. తెలుగులో అమహత్తులో వచనభేదం ఉండగా కూడుఖ్,

మాల్తోలో అమహత్తులో వచన భేదంలేదు. ద్రావిడ భాషలన్నిటినీ పరిశీలిస్తే దక్షిణోత్తరభాష లన్నిటిలోనూ అమహత్ బహువచన ప్రత్యయం వైకల్పికమైనదేకాని నిత్యమైనది కాదు; తెలుగు మొదలైన మధ్యద్రావిడభాషలలోనే అది నిత్య మైనది అని స్పష్టమవుతుంది. (కింద చూడండి) కాబట్టి తెలుగులోనూ మిగిలిన మధ్యద్రావిడభాషల లోనూ అమహద్బహువచనం కొత్తగా సృష్టించ బడినదని మనం ఊహించవచ్చును.

పై చర్చవల్ల పదర్థక సర్వనామాలలో మూలద్రావిడ భాషలో లింగభేదం తెలుగు కూడుఖ్ మాల్తోలలోనే మార్పులేకుండా నిలిచివుందని తెలు తుంది.

ఇక ద్రావిడభాషలలో క్రియలలో ఎటువంటి లింగభేదమున్నదో చూద్దాం. ప్రాచీన తమిళంలోనూ ప్రాచీనపు తెలుగులోనూ భవిష్యత్ కాలక్రియలలో మనుష్య బహువచనంలోతప్ప మిగిలినచోట్ల పురుష ప్రత్యయమేలేదు. ఉదా.

ప్రా. త. అవన్/అవళ్/అతు/అవై చెయ్యుమ్.
ప్రా. తె. వాడు/అది/అవి/చేయును.

పై తమిళం, తెలుగురూపాల్లో ధాతువు, దాని తరవాత కాలిక ప్రత్యయం (త-ఉమ్, తె—ఉను) మాత్రమే ఉన్నాయి. వాటి తరవాత ఉండవలసిన పురుషప్రత్యయంలేదు. ప్రాచీనపు తెలుగులో భూతకాలరూపాలైన చేసెను, చెప్పెను మొదలైన చోట్లకూడా ధాతువూ, భూతకాలిక ప్రత్యయమే (ఎను) గాని పురుషప్రత్యయంలేదు. తెలుగు మధ్య ద్రావిడభాష. తమిళం దక్షిణద్రావిడభాష. రెండు వేరువేరు ఉపకుటుంబాలకి చెందిన ఈ భాషలలో ఉన్న ఈ సారూప్యంమూలద్రావిడభాషకు చెందినదే అనడంలో విప్రతిపత్తి ఏమీలేదు కాబట్టి మూల ద్రావిడభాషాక్రియలలో మనుష్యవాచక బహువచన పురుషప్రత్యయంతప్ప ప్రథమ పురుషలో పురుష ప్రత్యయాలు ఉండేవికావుఅని మనం నిస్సంశయంగా చెప్పవచ్చు.

మధ్యద్రావిడభాష లన్నింటిలో (తెలుగుతో సహా) చుట్టాలైన ఆడవాళ్లని సూచించే పదాలు కొన్నింటిలో *—ఆళ్ ప్రత్యయంఉంది. ఉదా.

| తె. | కో. | నా. | ప. | గ. | గోం. |
|---|---|---|---|---|---|
| కోడలు | కొరల్ | కొర | కోల్ | కొఢల్ | కోర్యాఢ్ |
| | | | | | (<మూ. మ. ద్రా. * కోటాళ్; DED 1787) |
| చెల్లెలు | — | — | చెల్ | సేలల్ | సేలాఢ్ |
| | | | | | (<మూ. మ. ద్రా. * చేలాళ్; DED 2288) |
| మఱఁదలు | మర్న్దల్ | — | — | — | మరొండాఢ్ |
| | | | | | (<మూ. మ. ద్రా. * మఱంతాళ్; DED 3899) |

ఇటువంటి—ఆళ్ ప్రత్యయం చేరిన పదాలు దక్షిణోత్తరద్రావిడభాషలలో లేవు కాబట్టి ఇవి మూలమధ్యద్రావిడభాషాకాలంలో సృష్టించబడ్డాయి అని చెప్పాలి. దక్షిణద్రావిడభాషలలో సర్వనామాల లోనూ, క్రియలలోనూ—ఆళ్ ప్రత్యయం చేర్చడంవల్ల స్త్రీలింగం మిగిలినలింగాలనించి ప్రత్యేకించబడినదని ఇంతక్రితమే చూశాము. ఉదా. త. అవళ్ 'ఆమె', వంతాళ్ 'వచ్చింది', వరుకిఱాళ్ 'వస్తోంది', వరువాళ్ 'వస్తుంది', వారాళ్ 'రాదు'. కోలావిూ—పర్జీభాషలలో (నాయకీ, గడబలోసహా) పైన చెప్పిన సంబంధి స్త్రీవాచక పదాలకితోడు రెండు, మూడు, నాలుగు అనే సంఖ్యావాచకాలలో కూడా *—ఆళ్ ప్రత్యయం చేర్చడంవల్ల ప్రత్యేక స్త్రీవాచకరూపాలు సృష్టించబడ్డాయి. అవి వరసగా ఈ కింద ఇస్తున్నాము.

| కో. | నాయక్డ్. | ప. | నాయకీ. | గ. | మూ. కో.–ప. |
|---|---|---|---|---|---|
| ఈరల్ | ఇరళ్ | ఇరల్ | ఇర | ఇరల్ | * ఈరాళ్ (DED 401) |
| ముయల్ | ముయళ్ | ముయల్ | ముయ్యు | — | * ముయాళ్ DED 4147) |
| (నల్లవ్) | నల్లళ్ | నెలల్ | — | — | * నల్లాళ్ (DED 3024) |

పై చర్చవల్ల తేలిన సారాంశం: మూల ద్రావిడభాషలో స్త్రీలింగం ప్రత్యేకంగా లేకుండా అది ఏకవచనంలో అమహత్తులోనూ, బహువచనంలో మహత్తులోనూ అంతర్గతమై ఉండేది. ఈ మూలద్రావిడ లింగభేదం ఇప్పుడు తెలుగు, కూడుఖ్, మాల్తోలలో మాత్రమే నిలిచి ఉంది. కాని నాగరికత అభివృద్ధి చెందుతున్న కొద్దీ ప్రత్యేక స్త్రీ లింగరూపాలు భాషలో ఉండాలి అనే అభిలాషవల్ల దక్షిణద్రావిడభాషలలో సర్వనామ క్రియాపదాలలోనూ, మధ్యద్రావిడభాషలలో కొన్ని సంబంధి స్త్రీవాచక పదాలలోనూ, కోలామీ–పర్జిభాషలలో వీటికితోడు, రెండు, మూడు, నాలుగు–అనే సంఖ్యాపదాలలోనూ ప్రత్యేక స్త్రీలింగ రూపాలు సృష్టించ బడ్డాయి. ఈ భాష లన్నిటిలోనూ స్త్రీవాచక ప్రత్యయం *–ఆళ్ అవడం గమనించ దగ్గ విషయం.

## బహువచన ప్రత్యయాలు

తమిళం: మనుష్యవాచకాలలో బహువచన ప్రత్యయం –అర్, ఇర్,—మార్; అరసర్ 'రాజులు' మకళిర్ 'స్త్రీలు', తాయ్‌మార్ 'తల్లులు', పావైమార్ 'స్త్రీలు'. తొల్కాప్పియం సూత్రం 169 లో అమహత్తులైన నామవాచకాలకి కళ్ ప్రత్యయం వైభాషికంగా చేర్చవచ్చునని చెప్పబడింది: కణ్ కళ్ 'కళ్ళు'; ఊర్‌కళ్ 'ఊళ్ళు'. అతి ప్రాచీన తమిళ సాహిత్యంలో కళ్ ప్రత్యయం చాలా అరుదుగా కనిపిస్తుంది. వ్యావహారిక భాషలోకూడా సాధారణంగా బహువచనప్రత్యయం వాడరు: రెండు మకన్ ఇద్దరు కొడుకులు', నాలు మరం 'నాలుగుచెట్లు'.

మలయాళం: తమిళంలోమల్లే మలయాళంలో కూడా మనుష్యవాచకాలలో బహువచన ప్రత్యయం —అర్, – మార్: మాతర్ 'స్త్రీలు', అణ్ణన్‌మార్ 'అన్నలు'; అమహత్తులలోనూ కొన్ని మనుష్యవాచకాలలోనూ బహువచన ప్రత్యయం —కళ్: స్త్రీకళ్ 'స్త్రీలు'; మరఙ్ఙళ్ 'చెట్లు'. అమహత్తులలో ఈ ప్రత్యయం వైభాషికం.

తోద: అన్ని నామవాచకాలకీ బహువచన ప్రత్యయం —ఆవ్: ఇరావ్ 'బర్రెలు'; అతావ్ 'అవి'

కోత: అన్ని నామవాచకాలకీ బహువచన ప్రత్యయం— గూళ్. ఇది మనుష్య వాచకాలలో నిత్యం; అమహత్తులలో వైభాషికం: కోవ్‌గూళ్ 'కోతజాతివారు'; గంజ్ గూళ్ 'మగవాళ్లు'; మెయ్‌ణ్ గూళ్ 'కొడుకులు'.

కన్నడం: అకారంతో అంతమయ్యే సంబంధి వాచక శబ్దాలలో బహువచన ప్రత్యయం—ందిరు; అణ్ణందిరు 'అన్నలు'; అక్కందిరు 'అక్కలు'; అకారాంతాలు కాని మహద్వాచకాలలోనూ ఇ ఎ లతో అంతమయ్యే మహతీవాచకాలలోనూ బహువచన ప్రత్యయం—అరు: హుడుగరు (ఏ. హుడుగను) 'పిల్లలు'; అత్తెయరు 'అత్తలు'; సొసెయరు 'కోడళ్లు'.

అమహద్వాచకాలలో బహువచన ప్రత్యయం—గళు; ఇది వైభాషికం: మరంగళు 'చెట్లు'; మనెః(గళు) 'ఇళ్లు'.

తుళు: కొన్ని కులవాచకపదాలలో బహువచన ప్రత్యయం—రు: సెట్టు 'రాజులు'; భట్టు 'బ్రాహ్మణులలో ఒకశాఖవారు'; మడ్యేలెరు 'చాకలివాళ్లు'. కొన్నిసంబంధవాచకపదాలలో బహువచన ప్రత్యయం—నాకుళు: అణ్ణనాకుళు 'అన్నలు'; అక్కెనాకుళు 'అక్కలు'.

అమహద్వాచకాలలో బహువచన ప్రత్యయానికి —కుళు—ళు అనే రెండు సపదాలు ఉన్నాయి—కుళు ఏకాచ్కపదాలలోనూ, ఉచ్చుతో అంతమయ్యే ద్వ్యచ్కపదాలలోనూ వస్తుంది: కెయ్‌కుళు 'చేలు; కయ్‌కుళు 'చేతులు'; కెవికులు 'చెవులు'; మరకుళు 'చెట్లు'; ఎలికుళు 'ఎలుకలు'.—ళు మిగిలిన పదాలలో వస్తుంది: బోతెళు 'ఎద్దు'; నాయిళు 'కుక్కలు'; పిరెలుళు 'వేళ్లు'; కణ్ణుళు 'కళ్లు'.

తెలుగు: ప్రాచీనాంధ్రంలో కొన్ని మహన్మహతీవాచకాలలో—రు/—ఋ అనే బహువచనప్రత్యయం ఉండేది: ఎగతురు, పగఱు, అల్లురు, నెయ్యురు, విభుడాఋ, వేడుకాఋ కొడుండ్రు, అంద్రురు. వ్యావహారికభాషలో అన్నినామవాచకాల్లోనూ బహువచన ప్రత్యయం—లు: అన్నలు, అక్కలు, చెల్లెళ్లు, కోడళ్లు, ఇళ్లు, చేతులు—రు బహువచనప్రత్యయం సర్వనామాల్లోనూ, సంఖ్యావాచకాలలోనూ నేటికీ నిలిచిఉంది: వీరు, వారు, అందరు, ఇద్దరు, ముగ్గురు, నలుగురు, మొ.

గోండీ: మహద్వాచకాలలో బహువచన ప్రత్యయం—ర్,—ఉర్,—ఈర్: కాడ్జీర్ 'పిల్లలు'; కల్లీర్ 'దొంగలు'; (ఏ. కల్లే); అక్కొర్ 'తల్లి తండ్రులు' (ఏ. అక్కొ); మామాలీర్ 'మామలు'.

అమహత్తులలో బహువచన ప్రత్యయానికి—క్,—ఙ్ అనే రెండు సపదాలు ఉన్నాయి-క్ సాధారణంగా ఉచ్చుతో అంతమయ్యే స్త్రీవాచక శబ్దాలలోనూ, హలంతశబ్దాలలోనూ వస్తుంది: తక్కాక్ 'అక్కలు'; మరాక్ 'చెట్లు'; కోర్యాక్ 'కోడళ్లు' (ఏ. కోర్యాఢ్), తరాస్క్ 'పాములు', సాప్క్ 'ముళ్లు'; నహ్క్ 'ఊళ్లు'—అచ్చుతో అంతమయ్యే అమహత్తులలో వస్తుంది: కాయాఙ్ 'కాయలు', కోందాఙ్ 'ఎద్దు', కుహీఙ్ 'నూతులు', పద్దీఙ్ 'పందులు', ఆకీఙ్ 'ఆకులు'.

కొండ: కొన్ని మహత్తులలో బహువచన ప్రత్యయం—ర్: కొథొర్, 'కొడుకులు'! నెయ్నర్ 'తండ్రి తమ్ముళ్లు'.

అమహత్తులలో బహువచనప్రత్యయానికి—కు,—ఙ్ అనే రెండు సపదాలు ఉన్నాయి—కు హల్లుతో అంతమయ్యే పదాలలో వస్తుంది: మెలొల్కు 'వేళ్లు', పల్కు 'పళ్లు', కాల్కు 'కాళ్లు', విల్కు 'విల్లులు';—ఙ్ అచ్చులో అంతమయ్యే పదాలలో వస్తుంది: కుర్రెఙ్ 'దూడలు' మర్కెఙ్ 'మామిడి పండ్లు', సుకెఙ్ 'చుక్కలు', పుత్తీఙ్ 'పుట్టలు'.

కూయి: కొన్ని మహత్తులలో బహువచన ప్రత్యయం—రు: ఆబరు 'తండ్రులు'. దాదరు 'అన్నలు', ఆపొరు 'కొడుకులు'.

మహతీవాచకాలలో బహువచన ప్రత్యయం—స్క: ఆజస్క 'తల్లులు'. ఆనస్క 'ఆడవాళ్లు', అంగిస్క 'చెల్లెళ్లు', ప్రమడుస్క 'కూతుళ్లు'.

అమహత్తులలో బహువచన ప్రత్యయానికి—క,—ంగ అనే రెండుపదాలు ఉన్నాయి ఉ, ఎలతో అంతమయ్యే నామవాచకాలలో—క వస్తుంది. దీని ముందు ఉకారం లోపిస్తుంది. ను తో అంతమయ్యే నామవాచకాల తరవాత క కారం గకారంగా మారుతుంది: కోర్క 'బర్రెలు' (ఏ. కోరు), సీర్క 'వేళ్లు' (ఏ. సీరు). ప్రాస్క 'పాములు' (ఏ. ప్రాసు), కన్క/కన్క 'కళ్లు' (ఏ కను), కేలెక 'కొడవళ్లు' మిగిలిన అచ్చులలో అంతమయ్యే నామవాచకాల తరవాత—ంగ వస్తుంది: మొడొంగ 'మొగ్గలు', కాంగ 'కాయలు', పూంగ 'పువ్వులు', ఒలింగ 'ఎలుగులు'.

కోలామి: కొన్ని మహత్తులలో బహువచన ప్రత్యయం—ర్, ఉర్,—ఎర్: కోలవర్ 'కోలాములు', మాసుర్ 'మనుష్యులు',

చాలా కొద్ది అమహత్తులలో—ఎవ్ అనే బహువచన ప్రత్యయం ఉంది: అలింకెవ్ 'దున్నపోతులు', అప్పకెవ్ 'అత్తలు' (ఏ. అప్ప), వన్నెవ్ 'వదినలు' (ఏ. వన్న).

ఇకారంతో అంతమయ్యే అన్ని నామవాచకాల

లోనూ, మరి కొన్ని నామవాచకాలలోనూ—కుల్ అనే బహువచన ప్రత్యయం ఉంది: ఎల్లకుల్ 'ఇళ్లు', పల్‌కుల్ 'పళ్లు', తల్‌కుల్ 'తలలు', నాంగ్లకుల్ 'నాగళ్లు'

అచ్చుతోనూ, ట్, డ్, ండ్, న్‌లతోనూ అంతమయ్యే నామవాచకాలలో-ల్, మిగిలిన హల్లులతో అంతమయ్యే నామవాచకాలలో-ఉల్ అనే బహువచన ప్రత్యయాలు వస్తాయి: కయెల్ 'చేపలు', పాటల్ 'పాటలు', కీల్ 'చేతులు', కండ్ల 'కళ్లు', కొమ్మసిల్ 'కూతుళ్లు' (ఏ కొమ్మల్), కొరసిల్ 'కోడళ్లు', కేతుల్ 'చేటలు', కెవుల్ 'చెవులు', మాకుల్ 'చెట్లు', పాముల్ 'పాములు'. కొన్ని నామవాచకాలలో — సిల్ అనే ప్రత్యయంకూడా ఉంది: అయ్‌సిల్ 'తల్లులు', దోర్‌సిల్ 'పశువులు'.

నాయకీ (ఛాందా): కొన్నిమహత్తులలో బహువచన ప్రత్యయం—ర్: కయ్‌మర్ 'భర్తలు' (ఏ. కయ్‌మన్), తోలెర్ 'తమ్ముళ్లు' (ఏ. తోలెన్). ఎ, న్, డ్, ర్—వీటిలో అంతమయ్యే నామవాచకాలలో-ల్ వస్తుంది: కట్టెల్ 'కట్టెలు' మద్గెల్ 'మామిడిపళ్లు', కన్ల 'కళ్లు', గుడ్ల 'గుడ్లు', పేర్ల 'పేర్లు'. ఇంకొక బహువచన ప్రత్యయం—కు/—గు. —కు హలంతాలతరవాతా,—గు అజంతాం తరవాతా వస్తాయి: కేత్కు 'చేటలు', ఉవ్విగు 'నూతులు', తల్కు 'తలలు'. పల్కు 'పళ్లు', కెరిగు 'చెప్పులు', పామ్కు 'పాములు',

పర్జి: కొన్ని మహత్తులలో బహువచన ప్రత్యయం—ఎర్: కుమ్మలెర్ 'కుమ్మరివాళ్లు', చేపలెర్ 'పిల్లవాళ్లు', ముత్తకెర్ 'ముసలివాళ్లు' తెండెర్ 'తండ్రులు'.

కొన్నిసంబంధి స్త్రీవాచకపదాలలో — ఒవ్ వస్తుంది: ఇయొవ్ 'తల్లులు' (ఏ. ఇయ), తవ్వొవ్ 'తల్లులు' (ఏ. తవ్), బయ్యొవ్/బయెవ్ 'అక్కలు'.

అమహత్తులలో-ల్ ప్రత్యయం అచ్చులో అంతమయ్యేవాటితరవాతా, దాని సపదం — ఉల్ హల్లుతో అంతమయ్యే ఏకాచ్కద్వ్యచ్కపదాలతరవాతా వస్తాయి: ఇరిల్ 'ఎలుగులు', కదుల్ 'తొడలు', కొవ్వెల్ 'పందుకోతులు', కనుల్ 'కళ్లు', కెయుల్ 'చేతులు', బొముల్ 'పాములు', కేలుల్ 'చేతులు', మెర్దుల్ 'మందులు' (ఏ. మెరుద్), పడ్విల్ 'మొగపిల్లలు' (ఏ. పడివ్), పుఘ్‌తిల్ 'పురుగులు' (ఏ. పుఘుత్). (పైవాటిలో కొన్నింటిలో-- ఉల్‌కి బదులు-ఇల్ ఉంది.)

--కుల్ ప్రత్యయం హలంతలైన ఏకాచ్కపదాలతో వస్తుంది: కెల్‌కుల్ 'రాళ్లు', పెల్‌కుల్ 'పళ్లు', తెల్‌కుల్ 'తలలు', ఎల్‌కుల్ 'ఎంకలు', విల్‌కుల్ 'విల్లులు', కేత్‌కుల్ 'చేతులు', పెంద్‌కుల్ 'పందులు', చర్ఖిద్‌కుల్ 'అల్లాళ్లు'.

—చిల్ అనే ఇంకొక ప్రత్యయం ల్, ట్, డ్‌లతో అంతమయ్యే నామవాచకాల తరవాతవస్తుంది. (ఈ హల్లులు బహు ప్రత్యయంముందు లోపిస్తాయి) కెకొచిల్ 'చెవులు' (ఏ కెకొల్), ఊచచిల్ 'ఉయ్యాలలు' (ఏ. ఊచల్), కొడొచిల్ 'పెళ్లికూతుళ్లు' (ఏ కొఢొల్), చాలచిల్ 'చెల్లెళ్లు' (ఏ చాలల్) చత్తిల్ 'మెడలు'. వాత్తిల్ 'వేళ్లు' అనే మాటలలో-తిల్ అనే ప్రత్యయం కూడా ఉంది.

గదబ (ఒల్లారీ): కొన్ని మహత్తులలో బహువచన ప్రత్యయం —ర్/—ఒర్: ఇలెర్ 'పెళ్లికొడుకులు' (ఏ ఇలెండ్). ముత్తకూర్ 'ముసలివాళ్లు'. కొన్ని మహతీ వాచకాలలో—వ్/ఎవ్ వస్తుంది తమయవ్ 'తల్లులు', ఇవెవ్ 'పెళ్లికూతుళ్లు'.

అమహత్తులలో—ల్/—ఉల్‌కి ఉదాహరణలు: గూడెల్ 'గూళ్లు', కుయుగుల్ 'తొడలు', కిల్ 'చేతులు'.

—సిల్: వడ్సిల్ 'పళ్లు' కొఢసిల్ 'కోడళ్లు' (ఏ కొఢర్), అయసిల్ 'పెళ్లాలు' (ఏ. అయల్).

—కిల్/—కుల్/—గిల్: సెట్‌కిల్ 'కొడవళ్లు'

కణ్కుల్ 'కళ్ళు', పల్కుల్ 'పళ్ళు', కాల్గిల్ 'కాళ్ళు'.

—తిల్: కన్నిత్తిల్ 'కన్నీళ్ళు', సువరిత్తిల్ 'చింతకాయలు'

కూడుభ్: మనుష్య వాచకాలలో బహువచన ప్రత్యయం —అర్: ఆంర్ 'మనుష్యులు', ముక్కర్ 'ఆడవాళ్ళు'.

అమహత్తులకి బహువచన ప్రత్యయం లేదు. బహుత్వాన్ని సూచించడానికి గుతి 'అన్నీ' అనే మాట నామవాచకం తరవాత చేరుస్తారు. మన్ గుతి 'చెట్లు (అన్నీ)'

మాల్తో: మనుష్య వాచకాలలో బహువచన ప్రత్యయం -ర్: మలెర్ 'మనుష్యులు', మల్నిర్ 'ఆడవాళ్ళు'.

అమహత్తులకి బహువచన ప్రత్యయం లేదు. బహుత్వాన్ని సూచించడానికి గహోండి అనేమాట నామ వాచకం తరవాత చేరుస్తారు: బేడి గహోండి 'గొర్రెలు'.

బ్రాహుయీ: ఈ భాషలో బహువచన ప్రత్యయం —క్, —ఆక్, —ఆక్ చాలావరకు స్పర్శం తోనూ, ఈషత్స్పృష్టంతోనూ, హ్రస్వఅకారంతోనూ అంతమయ్యే నామవాచకాలతరవాతా, —క్ మిగిలిన నామవాచకాలతరవాతా వస్తాయి. హ్రస్వఅకారంతో అంతమయ్యేవాటిలో అకారానికీ—క్‌కీ మధ్య గ్ వచ్చి చేరుతుంది: బాక్ 'నోళ్ళు', ఉరాక్ 'ఇళ్ళు', పూక్ 'పురుగులు', బిర్క్ 'విల్లులు', ఖన్క్ 'కళ్ళు', ఈఢ్క్ 'చెల్లెళ్ళు', తేరక్ 'తేళ్ళు', ఖఫ్క్ 'చెవులు', లుమ్మగాక్ 'అమ్మలు' (ఏ. లుమ్మ), బావగాక్ 'తండ్రులు' (ఏ. బావ), పిడ్డాక్ 'పొట్టలు', ఇరగాక్ 'రొట్టెలు'.

—అన్క్ అనే సంబంధివాచకపదం పేర్లకీ, సంబంధివాచకపదాలకీ చేరుస్తారు: బాజ్‌ఖానాన్క్ 'బాజ్‌ఖానూ, అతని కుటుంబంవారూ', లుమ్మగాక్ 'తల్లీ ఆమెవైపువారూ'.

కాని ఈ భాషలో సందేహం కలిగేచోట్ల తప్ప బహువచన ప్రత్యయాన్ని సాధారణంగా వాడరు. కాబట్టి దహ్ బందగ్/దహ్ బందగాక్ 'పదిమంది మనుష్యులు', ఇరామార్/ఇరామాక్ 'ఇద్దరు కొడుకులు'—ఇలా బహువచనం చేర్చీ చేర్చకుండా కూడా చెప్పవచ్చు. బహువచనప్రత్యయం లేనిచోట్ల బహుత్వార్థం సందర్భంవల్లనే తెలుసుకోవాలి.

## తులనాత్మక చర్చ

పై పరిశీలనవల్ల ద్రావిడభాషలలో మనుష్య వాచకాలకి ఒక బహువచనప్రత్యయం, అమనుష్య వాచకాలకి ఒక బహువచన ప్రత్యయం ఉన్నాయని తెలుస్తుంది. మనుష్య వాచకాలలో బహువచన ప్రత్యయం మూలద్రావిడంలో *-ర్ అని సులభంగా చెప్పవచ్చు (కొన్నిపదాలలో దీనికిముందు ఒక అచ్చుకూడా ఉండేది; అది ఆద్యచ్చుకాదుకాబట్టి దాని స్వరూపం ఇదమిత్థంగా చెప్పలేము) దీనినించి పుట్టినరూపాలు కోత, తోద, బ్రాహుయీలలోతప్ప మిగిలిన అన్నిభాషలలోనూ నిలిచిఉన్నాయి. తెలుగుతప్ప మిగిలిన మధ్యద్రావిడభాషలలో దీనినించివచ్చిన ప్రత్యయాలు మహత్తులలోమాత్రమే ఉండడం (మహతీ వాచకాలలో లేకపోవడం) ఆ భాషలలో స్త్రీలింగం బహువచనంలోకూడా అమహత్తులలో చేరిపోవడం వల్లనే అని చెప్పవచ్చు (పైన చూడండి). ఈ ప్రత్యయం ప్రచురంగా ఉన్నభాషలలోకూడా కొన్ని మహద్వాచకాలలో దీనికి బదులు అమహద్బహువచన ప్రత్యయం మనకి కనిపిస్తుంది. త. కుఱంతైకళ్ 'పిల్లలు', గోండీ మర్క్ 'కొడుకులు' (ఏ. మరీ). ఈ అమహద్బహువచన ప్రత్యయం మహత్తులలోకి కూడా వ్యాపించడమనే పరిణామం చాలా భాషలలో కనపడుతోంది కాబట్టి ఇది మూల ద్రావిడభాషా కాలంలోనే మొదలయి ఉండాలి. కోత, తోద, బ్రాహుయీలలో ఈ పరిణామం సంపూర్ణదశకివచ్చి అసలు మహద్బహువచన ప్రత్యయమే వీటిలో నశించి పోయింది. ప్రాచీన తెలుగులో కొద్దినామవాచకాలలో

—రు/—ఋ ఉన్నా వ్యావహారిక భాషలో దాని స్థానాన్ని—ళు పూర్తిగా ఆక్రమించుకొంది: గ్రా. అల్లుళ్లు: వ్యా అల్లుళ్లు; గ్రా. కోడండ్రు: వ్యా కోడళ్లు.

మూల ద్రావిడ భాషలో అమహద్బహువచన ప్రత్యయమేమిటి? దాని సపదాలు (Allomorphs) ఏమిటి? అనేది కొంచెం జటిలమైన సమస్య. ఈ విషయంలో అన్ని ద్రావిడ భాషలలోనూ ఐక్యంలేక పోయినా ఉపకుటుంబానుసారంగా వాటిలో కొంత సాదృశ్యం ఉంది అని ఈ కింద పట్టిక నిరూపిస్తుంది.

త. మ. కో. క. *ళ్
తుళు * కళ్, *ళ్
తెలుగు (* కళ్, * ళ్
గోం. కొం. కూయి, కువి *క్, * ంక్
కో. నా. ప. గ. కల్, *ళ్ *వ్, *చిల్
బ్రాహుయీ * క్

పై పట్టికవల్ల * కళ్, * ళ్ * క్ అనే మూడు సపదాలు ఒకటికన్న ఎక్కువ ఉపకుటుంబాలలో ఉన్నట్లు తెలుస్తుంది * కళ్ పరిణత రూపాలు (Reflexes) దక్షిణద్రావిడోప కుటుంబానికిచెందిన తుళులోనూ, మధ్యద్రావిడోప కుటుంబంలో అంతర్భాగమైన కోలామీ—పర్జీ ఉపకుటుంబం లోనూ ఉన్నాయి. * ళ్ పరిణతరూపాలు కూడా ఈ భాషల్లోనూ, తెలుగులోనూ ఉన్నాయి. * క్ పరిణతరూపాలు మధ్యద్రావిడోప కుటుంబంలో అంతర్భాగమైన గోండీ—కూయి (కువి, కొండ, పెంగొ, మండ) ఉపకుటుంబంలోనూ ఉత్తరద్రావిడ భాష అయిన బ్రాహుయీలోనూ ఉన్నాయి. * ం క్ అనే సపదం గోండీ — కూయిభాషలోనే ఉంది. అలాగే * చిల్, * వ్ అనే సపదాలు కోలామీ—పర్జీభాషలలో మాత్రమే ఉన్నాయి.

అమహద్బహువచన ప్రత్యయం దక్షిణోత్తర ద్రావిడభాషలలో వైభాషికమనే విషయం కూడా ఇక్కడ మనం గమనించాలి. దక్షిణద్రావిడభాషలైన తమిళం, మలయాళం, కోత, కొడగు, కన్నడం, తుళు (మాండలికం)లలో ఇది వైభాషికమని మనం పైన చూశాము. ఉత్తరద్రావిడభాషలలో కూడుఖ్, మాల్తోలలో, అమహత్తులలో అసలు బహువచన ప్రత్యయమే లేదు; బ్రాహుయీలో బహువచన ప్రత్యయం వైభాషికం. కాని మధ్యద్రావిడభాషలలో మాత్రం అమహద్బహువచన ప్రత్యయం నిత్యంగా ఉపయోగించబడుతుంది. ఈ ప్రత్యయం వైభాషికత్వం దక్షిణోత్తరోప కుటుంబాలు రెంటిలోనూ ఉంది కాబట్టి ఇది మూలద్రావిడభాషకే చెందినది అయిఉండాలి. అలా కాకుండా అది మూలద్రావిడ భాషలో నిత్యమై దక్షిణోత్తరోప కుటుంబాలలో విడివిడిగా వైభాషికంగా మారిందని చెప్పడం అసమంజసమని తోస్తుంది. కాబట్టి ఇది మూల ద్రావిడభాషలో వైభాషికమైఉండి మూలమధ్యద్రావిడ భాషలో నిత్యంగా మారిఉంటుంది. ఈ మార్పు మధ్యద్రావిడభాషలన్నీ ఒక ఉపకుటుంబమని నిర్ణయించడానికి ఒక ప్రబలాధారం.

తుళు, కోలామీ—పర్జీభాషలలో అమహద్బహువచన ప్రత్యయ నిర్మాణానికి ఇంతవరకూ పండితులెవరూ తులనాత్మక చర్చలో ప్రాధాన్యం ఇవ్వలేదు. కాని యిది మూలద్రావిడభాషలో ఈ ప్రత్యయాన్ని పునర్నిర్మించడానికి అత్యంతావశ్యం. ఈ భాషలన్నిటిలో * కళ్, * ళ్ అనే రెండు సపదాలూ భిన్నస్థానాలలో ఉన్నాయి. తుళు దక్షిణద్రావిడ భాష, కోలామీ—పర్జీ భాషలు మధ్యద్రావిడ భాషలు కాబట్టి వీటిలోఉన్న ఈ రెండు సపదాలూ మూలద్రావిడభాషకు చెందినవే అయిఉండాలి. ఈరెండు సపదులూ ఈ భాషలలో ఒకదానినించి ఇంకొకటి తరవాత పరిణామంవల్ల వచ్చినవని చెప్పడానికి తగిన ఆధారాలేమీ లేకపోవడంవల్ల యివి రెండూ మూల ద్రావిడభాషలోనే ఉండేవని మనం నిర్ణయించాలి. అయితే *కళ్ అనే సపదం ఎటువంటి నామవాచకాల తరవాత వచ్చేది*? *ళ్ ఎటువంటి నామ

వాచకాల తరవాత వచ్చేది? అనేవిషయం ఇప్పుడు నిర్ణయించడం కొంచెం కష్టం. కాని యీ భాష లన్నిటిలోనూ *-కళ్ హ్రస్వాచ్చుగల ఏకాచ్క పదాల లోనూ ఉండడంవల్ల మూల ద్రావిడంలోకూడా *కళ్ ఇటువంటిపదాలలోనూ, *ళ్ మిగిలిన పదాల లోనూ వచ్చేదని మనం స్థూలంగా నిర్ణయించవచ్చు.

*క్ అనే సపదం గోండీ—కూయి భాషల లోనూ బ్రాహుయీలోనూ ఉంది. ఈ *భాష లలో *కళ్ లేదు కాబట్టి మూ. ద్రా *కళ్‌లో చివరి ళ కారంలోపించి *క్ ఏర్పడిందని చెప్పవచ్చు. ఈ వివరణవల్ల *క్‌ని కూడా మూల ద్రావిడభాషలో పునర్నిర్మించవలసిన అవసరం తొలగుతుంది మూ, ద్రా. *కళ్‌లో ళకారలోపం గోండీ—కూయి భాషల లోనూ, బ్రాహుయీలోనూ వేర్వేరు కాలాలలో జరిగిన సదృశపరిణామం (Paralled Development)

తుళు, కోలామీ పర్జీ తప్ప మిగిలినభాషలు *కళ్, *ళ్ అనే రెండు మూల ద్రావిడ సపదా లలో ఒకదాన్ని అన్ని నామవాచకాలకీ వ్యాపించేటట్టు చేశాయని పై చర్చవల్ల తెలుతుంది. తోడ, తుళు తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలన్నీ *ళ్‌ని తొల గించి *కళ్‌ని అన్ని నామవాచకాలకీ వ్యాపించేటట్టు చేశాయి. గోండీ—కూయి, బ్రాహుయీలలో *క్ మూ. ద్రా.* కళ్ నించి వచ్చినది; వీటిలో *ళ్ లేదు.

తెలుగు—లు ప్రత్యయం మూ ద్రా. *ళ్ నించి వచ్చినది ప్రాచీన శాసనాలలో 'సంవత్సరం బుళ్' మొదలైన పదాంలో మూర్ధన్య ళ కారమే కనిపిస్తుంది. తరవాతకాలంలో అది భాషా పరిణా మాన్ని అనుసరించి దంత్య ల కారంగా మారింది. తెలుగు మ్రాకులు (త. మరం—కళ్) ఏనుగులు (త. యానై—కళ్) చిలుకలు (త. కిళి—కళ్) ఎలుకలు(త. ఎలి — కళ్) మొదలైన పదాలలో బహువచన ప్రత్యయం వర నాత్మకంగా—లు ఏ అయినప్పటికీ తమిళంలో వాటి సమాన రూపాలు చూస్తే వీటిలో క, గలు ఒక కాలంలో బహువచన ప్రత్యయానికి చెందినవనీ, ఆ ప్రత్యయం—కళ్ అనీ తెలుస్తుందని రాబర్ట్ కాల్డ్వెల్ 'A Comparative Grammar of the Dravidian or South Indian Languages' పేజీ 245, చెప్పేరు. తెలుగులో—లు బహువచన ప్రత్యయం బహుళం కాబట్టి వీటిలో అనుచిత విభాగం జరిగి క, గలు నామవాచకంతో కలిపేయ బడ్డాయి.

గోండీ – కూయిభాషలలో *కళ్ నించివచ్చిన *క్‌కి తోడు *ంక్ అనే సపదంకూడా ఉంది సాధా రణంగా *క్ హలంతపదాలలోనూ, *ంక్ అజంత పదాలలోనూ వస్తాయి. కాబట్టి అజంతపదాలలో *క్‌కి ముందు అనునాసికం ఉచ్చారణ సౌలభ్యం కోసం చేరిందని మనం అనుకోవచ్చు. ఈ భాషలలో *ంక్ అనే కొత్త సపదం ఏర్పడడం యీ భాషలు సన్నిహితసంబంధం గలవిఅని నిర్ణయించడానికి ఒక ముఖ్యాధారం.

కొన్నిమధ్య ద్రావిడభాషలలో *—ఆళ్ ప్రత్యయం గల సంబంధి స్త్రీవాచకపదాలలో బహువచన ప్రత్య యంలో ఒక ప్రత్యేకత ఉంది. కొన్నిగోండీమాండలి కాలలోనూ, కూయిలోనూ వీటిలో బహువచన ప్రత్యయం—స్క. కోలామీ—పర్జీభాషలలో ఈ పదాలలో బహువచన ప్రత్యయం—చిల్. ఉదా.

గోం. సేలాస్క : వ. చాలచిల్ 'చెల్లెళ్ళు' (DED 2288.)

గోం. కోర్యాస్క : వ. కొఢొచిల్ 'కోడళ్ళు' (DED 1787.)

గోం. మర్ందాస్క : కో. మర్ందసిల్ 'మరదళ్ళు' (DED 3899.)

వీటిలో—స్క, —చిల్ అనేవి *—చ్ అనే ఒక బహువచన ప్రత్యయం *—క్, *—ళ్ అనే బహువచన ప్రత్యయాలతో కలవడంవల్ల ఏర్పడినవి కావచ్చు. ఇటువంటి పదాలలో మూలమధ్యద్రావిడంలో బహు వచన ప్రత్యయం *—చ్ అయిఉండి దానికి ఆయా భాషలలో ప్రచురమైన బహువచన ప్రత్యయాలు మళ్ళీ చేర్చబడ్డాయని మనం ఊహించవచ్చు.

కోలామీ—పర్జీభాషలలో కొన్నినామవాచక పదాలలో (వీటిలో చాలా సంబంధి స్త్రీవాచక

పదాలు) * వ్ అనే బహువచన ప్రత్యయం ఉంది. ఇది అమహద్బహువచన సర్వనామాలైన * అవ్ (తె. అవి), * ఇవ్ (ఇవి) అనేవాటిలో వకారాన్నించి వచ్చింది. అంటే ఉగాభాషలలో పై సర్వనామాలలోని వకారం కొన్ని నామవాచకాలలోకి కూడా వ్యాపించిందన్నమాట. తోదలోకూడా ఇదేరకమైన మార్పు కనపడుతుంది. మూలభాషలో యుష్మదస్మదాత్మార్థక బహువచన సర్వనామాలలో బహువచన ప్రత్యయంగా ఉన్న * —మ్ తోదలో అన్ని నామవాచకాలలోనూ బహువచన ప్రత్యయంగా వ్యాపించింది.

సారాంశం: 1. మూలద్రావిడభాష కాలంలోనే మహద్బహు వచనం స్థానాన్ని అనుహద్బహు వచనం ఆక్రమించుకోవడం మొదలు పెట్టింది. 2. మూలద్రావిడ భాషలో అమహద్బహువచన ప్రత్యయం వైభాషికం; మధ్య ద్రావిడభాషలలో అది నిత్యమైంది. 3. మూ. ద్రా. అమహద్బహు వచన ప్రత్యయానికి * కళ్, * ళ్ అనే రెండు సపదాలు ఉండేవి. ఈరెండూ ఇప్పుడు తుళు, కోలామీ–పర్జీ భాషలలోనే నిలిచి ఉన్నాయి. 4. తోద, తుళు తప్ప మిగిలిన దక్షిణద్రావిడ భాషలలో * ళ్ నశించి *కళ్ అన్ని నామవాచకాలకీ వ్యాపించింది. 5. తెలుగులో * ళ్ నించి వచ్చిన లు ఏ బహువచన ప్రత్యయమైనా ముందుతెలుగుకాలంలో * కళ్ కూడా ఉండేదని తులనాత్మక పరిశీలనవలన తెలుస్తుంది. 6. గోండీకూయి భాషలలో * కళ్ * క్‌గా మారడమే కాకుండా అజంతపదాల తరవాత దీనికి * క్ అనే సపదంకూడా ఏర్పడింది. 7. బ్రాహుయీలో *ళ్ నశించి * క్ నించి పుట్టినరూపాలే అన్ని నామవాచకాలకీ వ్యాపించాయి.



# రాహిత్యం

## శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

స్వర్ణకిరణాల నీ యభిజ్ఞానమును గ
నంగలేను! గాఢ తమస్సునన్ గనుగొన
లేను! కనుమూసి నీ పాదలీల నూహ
సేయలేను! కండ్లను విప్పి కాయలేను !!

ఒక్క అనుమానమే మదినాదిని పట్టె
నీవు కలవో! లేవో! యన్నదే విభు అది!
నీవె యున్నను -లేకున్న—నేమి! నా క
టంచను కొనగజాల నేమయ్యా నేను !!

ఆశలేలను— వృథా జిజ్ఞాసలేల—
లేనివాని కోసమటందురే సుఖసఖు,
లేడి! కానిపించడె! ఏడిపించునేమి!
మనసుకందని—మాటపట్టని విధురుడు !

జన్మజన్మల వెదకి వేసారినాము!
అననుభూత కల్పనము దైవాత్మబుద్ధి
యనిరి మిత్రులు—!

కల, డసాధ్యముగ గాని
దొరక, డణువుకణువు—మహత్తుకు మహత్తు!
అనిరి ఆప్తులు—!

ఆలసంబగు దర్శన మాస్తికునకె!
శాశ్వత దిదృక్ష కతడు వశ్యమగు త్వరగ
ననిరి కథకులు—!

అతడు కానిది లేదోయి! ఆతనికిని
గానిదేదియులేదు! నీ కండ్లనేరు
లోడ్చి క్షాళించి గాలించు నోర్పుగలద
యేని, గాంతు వంతునని విజ్ఞానులనిరి!

ఏలనోయి మిథ్యాపథ్య శీలనములు!
అవును దేహమె దేవాలయంబు! జీవు
డే యగును దేవు, డాతండు లేడటన్న
నీవులే, నీవెయాత, డనిరి విబుధులు!!

ఉల్లిపొరలంటి ఆవరణోర్మికలకు
లోననుండు నార్ద్రస్పందరుచిర వివికి
లుడనిరి హితులు—!!

అద్దములు జూచికొంటి నాయందములను
నేనె! ప్రజలల నా చంద మేనె గంటి!
గాని, నీవారశూక మంతైన పోల్కి
లేదు! లోనికి గన్గొనలేను నాథ!

నాదు గుండియ వెండి కొండౌన స్వామి!
శ్రీ చరణ తరుణ సుందర శ్రీ ఘనములు
మంజు మంజీర రవళికా గుంజ దమృత
ములుక నా అంతరంగాన కేళి తొలుకు!! —



# సంస్కృత సాహిత్యంలోని ఇతర రామాయణాలు

డా. వి. రాఘవన్

సంస్కృత సాహిత్యంలో వాల్మీకిరామాయణం తర్వాత అంతగా ప్రసిద్ధంకాని రామాయణాలలో పేర్కొనదగినవి అద్భుతరామాయణం, ఆనంద రామాయణం, అధ్యాత్మరామాయణమూను, లేక భుసుండిరామాయణమనే మరొక రామాయణమూ ఉన్నది. దీనిని భుసుండిరామాయణమనికూడా వ్యవహరిస్తారు. లంకాధిపతిఅయిన రావణునికన్నా, లేక మైరావణునికన్నా లేక శతశీర్షుడో, సహస్రశీర్షుడో అయిన పాతాళలంకాధిపతిఅయిన అహిమహిరావణుని కన్నా భయంకరులయిన రావణులను వర్ణించే మరొక రామాయణమూ ఉన్నది. ఇవికాక, ఆధ్యాత్మరామాయణంకన్నా దృఢంగాను, విస్తృతంగాను తత్త్వ విషయాలు తెలిపే రామాయణం మరొకటి ఉన్నది. దీనిని మహారామాయణమని, లేక యోగవాశిష్ఠమని అంటారు. వాల్మీకిరామాయణం పారాయణం చేసేవారు

'శతకోటి ప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం
మహాపాతక నాశనం'

అనే శ్లోకం పఠిస్తారు. శతకోటిప్రవిస్తరమైన రామకథను బ్రహ్మ మొట్టమొదట స్వర్గలోకంలో రచించాడని మన పూర్వుల విశ్వాసం. ఈ రామకథా మానస సరోవరంనుంచే దేశంలోని వివిధప్రాంతాలలో విభిన్నరీతులుగా ప్రజలలో వ్యాపించిన రామగాథలు వెలువడి స్థానికగాథలతో, కథలతో, కవితలతో పెనవేసుకొని, సహస్రాబ్దాలుగా దేశమంతటా ప్రవహించి, రాముడనే దైవంచుట్టూ జనాదరం, ప్రేమౌత్సుక్యంఅనే ఆవరణలూ కల్పించాయి. ఈ ప్రేమౌత్సుక్యం మనదేశం ఎల్లలకే—అయోధ్యనుంచి రామేశ్వరానికి, లంకకు మాత్రమే – పరిమితంకాక ఆగ్నేయాసియా అంతనూ ముంచెత్తి, లావోస్, వియత్నాం, కాంబోడియా, థాయ్‌లెండ్, మలేషియా, ఇండోనీసియాదేశాల ప్రజలను పరవశులనుచేసి, మహోజ్జ్వలనాట్య, నాటక, శిల్పాలలో అత్యపూర్వంగా అభివ్యక్తి చెందింది. దృశ్యంగాను, శ్రవ్యంగాను తర్వాత విస్ఫుటించిన రామకథను, వస్తువైవిధ్యమూ, వివిధప్రాంతాలలోని రామగాథల శాఖోపశాఖలను సమన్వయపరిస్తేతప్ప అవగాహన చేసుకొనడం కష్టం. భారతవర్షాన్ని సాకేతంనుంచిసేతువువరకు, భారత దేశాన్ని ప్రాతివేశిక దేశాలతోను ఒక్కటిగచేసిన ఈ రామభక్తి చిత్రపటంలోని వర్ణసూత్రాలను అని రామాయణాల పరిజ్ఞానంలేనిదే మెచ్చుకోలేము.

## అద్భుత రామాయణం

ఈ రామాయణాలన్నిటిలో అద్భుత రామాయణం చిన్నది; నిజానికి ఇది వాల్మీకి రామాయణానికి అనుబంధమయినట్లు—అద్భుతోత్తర కాండమని చెప్పుకొంటున్నది ఇది 27—సర్గలది. దీనిలోని ప్రధానభావాలలో ఒక్కటి పరాశక్తిగా సీతాదేవి మాహాత్మ్యాన్ని చిత్రించడం. ఈమె ఈ పరాశక్తి అవతారంలో భయంకరుడైన సహస్రకంఠరావణుణ్ణి సంహరిస్తుంది. సీతాసహస్ర నామస్తోత్రం ఒకటి ఈ అద్భుత రామాయణంలో చెప్పబడింది. నారదుని ద్వారా సంగీత కళయొక్క భక్తితత్వం దీనిలో

చెప్పబడింది. రాముడు పరశురామునికి, హనుమంతునికి తన విశ్వరూపాన్ని, తక్కిన అవతారాలను చూపుతాడు. దశగ్రీవరావణుని మించిన రావణుల వినాశంలో వానరులయొక్క, సీతాదేవియొక్క పాత్రను అద్భుతీకరించే కథలున్న ఈలాటి రామాయణమే థాయ్ లెండ్‌లోని రామాయణకుడ్యచిత్రాలకు కారణమయింది; త్యాగరాజులవారు ఈలాటి కథలను మనస్సులో పెట్టుకొనే శ్రీ జనకతనయేంని, కలంకణీ రాగంలోను, దేవి తన పదభక్తుంని శాహనరాగంలోను, మా జానకి అని కాంభోజి రాగంలోను పాడివుంటారని తోస్తుంది.

## ఆనంద రామాయణం

ఆనంద రామాయణంకూడా అద్భుత రామాయణంవలెనే రామకథలోని, రాముని చర్యలలోని మత తత్త్వ అద్భుతాంశాలనే వర్ణిస్తుంది. కాని, ఇది అద్భుత రామాయణంకన్నా చాల విస్తృతం. ఇది శివపార్వత్య గస్త్యసంవాదరూపంలో వున్న 109 అధ్యాయాల, 9 కాండల గ్రంథం. భక్తి వేదాంతాలకు ప్రాధాన్యం ఎక్కువ రాముడు పరబ్రహ్మ. రామమంత్రం, సహస్రనామస్తోత్రంతోపాటు పెక్కు స్తోత్రాలు, పూజావిధి, రామనామజపం, పెక్కు కొత్త కథలు—వీటిలో కొన్ని రాముని సోదరులకు సంబంధించినవి — దీనిలో ఉన్నాయి. రాముని దక్షిణభారతయాత్రలో దక్షిణాపథంలోని క్షేత్రాలపేర్లు, ముఖ్యంగా తమిళనాడులోని క్షేత్రాల పేర్లు దీనిలో విస్తరంగా వర్ణితంకావడం గమనించవలసిన విషయం. రాముడు 15 శ్లోకాలలో సీతకు వేదాంతతత్త్వం ఉపదేశిస్తాడు. దీనిని దేహరామాయణమనో, రామాయణమనో రాముడు నిర్వచిస్తూ దీనిని ప్రతివాడూ తనలోభాగంగా చేసుకోవాలని, మనస్సులో దీనిని దాచుకోమని అంటాడు.

## అధ్యాత్మ రామాయణం

ఆనంద, అద్భుతరామాయణాలతో పోల్చినప్పుడు అధ్యాత్మ రామాయణం చాలవ్యాప్తి చెందినట్టిదని చెప్పవచ్చు. దీనిని ఆ రెండింటికన్నా పారాయణం చేసేవారు, పూజించేవారు, వ్యాఖ్యానించేవారు ఎక్కువ. దీనికి వ్యాఖ్యలుకూడా చాలా వున్నాయి. తమిళ, హిందీ, మలయాళంవంటి ప్రాంతీయ భాషలలోని కొన్ని రామాయణాలు-హిందీలో తులసీదాసు రామచరిత మానసం, మలయాళంలో ఎళుత్తచ్చన్ అధ్యాత్మరామాయణ కిళిప్పాట్టు వంటివి—అధ్యాత్మ రామాయణానికి అతిసన్నిహితమైనట్టివి. ఈ అధ్యాత్మరామాయణం పేరుకు తగినట్టు రాముణ్ని పరబ్రహ్మగా నిరూపించి, రామగీతవంటి ఆధ్యాత్మ కోపదేశాలుకూడా చేస్తుంది. ఆధ్యాత్మ రామాయణం శివుడు పార్వతికి ఉపదేశించినట్టు రచింపబడినది.

తులసీదాసు రామచరిత మానసలో ఉత్తర కాండలో కాకభుసుండుని కథ వస్తుంది. ఈ కాకభుసుండుడు గరుడునితో రామమాహాత్మ్యం గురించి, రామభక్తిని గురించి చర్చిస్తూ, తన జీవితం, తాను ఎలా కాకి అయిపుట్టిందీ తెలియజేస్తాడు. కాకభుసుండునికథ, దానిద్వైవమూలం యోగవాశిష్ఠం చివర నిర్వాణకాండ ప్రథమభాగం 14 - 27 అధ్యాయాలలో చెప్పబడ్డాయి. తమిళ సాహిత్యంలోను యోగ, వేదాంత, వైద్యక గ్రంథాలలో కాక భుసుండుడనే సిద్ధుడున్నాడు. ఈ కాకభుసుండుడు ఎవడు? వీడికి రామాయణానికి ఏమి సంబంధం?

## ఆదిరామాయణం, లేక కాకభుసుండి రామాయణం

ఈ ప్రశ్నకు సమాధానం ఆదిరామాయణమని, కాకభుసుండిరామాయణమని లిఖిత పుస్తకాలలో కనిపించే సంస్కృత రామాయణంలో లభిస్తుంది. ఈ రామాయణం లిఖితప్రతులు ఎక్కువగా లేకపోయినా, సమగ్రమైనవో, అసమగ్రమైనవో బరోడా, ఉదయపూర్, జైపూర్, మధురా, రేవా, అయోధ్య, బనారెస్, కలకత్తా, లండన్, లిఖిత గ్రంథాగారాలలో లభిస్తున్నాయి. ప్రస్తుతం దీనిని వారణాసిలో ముద్రిస్తున్నారు. కాకభుసుండి రామాయణం నాలుగు

కాండల గ్రంథం. దీనిలోని రామచరిత్ర, రామలీలలు విష్ణుపురాణంలోను, భాగవతంలోను వర్ణితమైన కృష్ణ లీలలవలె ఉంటాయి. ప్రథమకాండలో రాముని బాల్యం సవిస్తరంగా వర్ణితమైంది. బాల్యంలోనే రావణుని దూతలయిన రాక్షసులు రాముణ్ని హత మార్చడానికి ప్రయత్నించినట్లు దశరథుడు ఆతనిని రక్షించడానికి సరయూనది అవలిగట్టున వున్న ఒక కుగ్రామంలో రహస్యంగా దాచి పోషించినట్లు వర్ణితమైంది. రాముని చిత్రపటాన్ని ఒక విహంగమం సీతకు అందజేసినట్లు చెప్పడంతో సీతాస్వయంవరా నికి శృంగారం కూడా రంగరించబడింది. రాముని లీల, రామగీత, రాముని విశ్వరూప ప్రదర్శనం వర్ణించబడ్డాయి. భుసుండి రామాయణంతో కొంచెం సంబంధమున్న చిత్రకూట మాహాత్మ్యమనే ఒక లిఖిత పుస్తకంలో చిత్రకూటంలో రాముని రాసలీల జరిగినట్లు వర్ణితమైంది. ఈ వర్ణనతో అస్సామీ రామాయణం ప్రభావితమయినట్లు తోస్తుంది. కాకభుసుండి బ్రహ్మ గరుడాది దేవతలకు, సుతీక్ష్ణ, శాండిల్యాదియాది ఋషులకు రామకథ చెబు తున్నట్లు, వారు అప్పుడప్పుడు ప్రశ్నిస్తున్నట్లు కొన్ని లిఖిత పుస్తకాలలో వున్నది. మరి కొన్నిటిలో దీనికి బ్రహ్మరామాయణమని, బృహద్రామాయణమని పేర్లున్నాయి. రాముడు గోపికలకుమాత్రమేకాక తన బాల్య మిత్రులకుకూడా ఉపదేశిస్తాడు. ఈ ఉప దేశాలలో దహరవిద్య తత్సదృశభావాలు వుండడం బట్టి ఈ రామాయణం వేదాంత విచారంతో ఎంత ప్రభావితమైనదీ స్పష్టమవుతుంది. ఈ కారణం వల్ల దీనిని భుసుండి రామాయణం అనడంకన్నా, రామభాగవతం అనడం ఉచితం.

## వాశిష్ఠ రామాయణం

వాశిష్ఠరామాయణం అనేది ఆధ్యాత్మికంగా పైన పేర్కొన్న రామాయణాలకు భిన్నం. ఇది ఏడు అధ్యాయాల గ్రంథం. దీనిని వశిష్ఠోత్తర రామా యణం అని కూడా అంటారు. దీనికే శతముఖ రావణ చరితం, సహస్రముఖ రావణ చరితం, సీతా విజయం అనే పేర్లు ఉన్నాయి. దీనిలో సీత శతకంఠ రావణుని ధ్వంసంచేస్తుంది గనుక ఈ విధంగా ఇది ఇంతకుముందు పేర్కొన్న అద్భుత రామాయణానికి సదృశం. కొన్ని లిఖితపుస్తకాలు దీనిని జైమిని భారతంలో భాగంగాను (ఎం. డి. 2098), మరొక లిఖితపుస్తకం (ఎం. టి. 2150) స్కందపురాణం లోని వశిష్ఠసంహితలో భాగంగాను పేర్కొంటున్నవి.

## మైరావణ చరిత్ర

మైరావణ చరిత్ర, లేక అహిమహిరావణ చరిత్రఅనే పేరుతో చాలా లిఖితపుస్తకా లున్నాయి. ఇటీవలివరకు ఈ మైరావణచరిత్రను హరికథగా చెప్పేవారు. కొన్నిలిఖితపుస్తకాలు దీనిని జైమిని భారతంలో భాగంగా పేర్కొన్నవి కాని అది సరికాదు.

## కుశలవోపాఖ్యానం

కుశలవోపాఖ్యానమనే రామకథకు సంబం ధించినభాగం మరొకటున్నది కొన్నిలిఖితపుస్తకాలలో ఇది జైమినిభారతంలోభాగంగానో, లేక జైమినీయ అశ్వమేధపర్వంలో భాగంగానో పేర్కొనబడింది. జైమి నీయ అశ్వమేధంలో ఈ కుశలవోపాఖ్యానం 25-36 అధ్యాయాలుగా ముద్రితమయింది. జైమినీయ అశ్వ మేధంలోని ప్రధాన ఇతివృత్తం యుధిష్ఠిరుడు పట్టాభిషేకం తర్వాత అశ్వమేధయాగం చేయడం. ప్రసక్తానుప్రసక్తంగా రామాశ్వమేధకథ చెప్పబడింది. ఈ కథలో పద్మపురాణంలోని పాతాళఖండంలోవున్న కథలోలాగ రామపశ్చాత్తాపం, సీతారామ లవకుశ సమాగమం, రాముడు సీతాసమేతుడై అశ్వమేధయాగం ఆచరించడం వర్ణితమయాయి

సేతు మాహాత్మ్యం (ఎ. డి 2099) అనే చిన్నపుస్తకం రామకథను చెబుతుంది. ఇది జైమిని భారతంలో భాగంగా కనిపిస్తుంది.

## సత్యోపాఖ్యానం

సత్యోపాఖ్యానమనే మరొక కుతూహలకర మయిన గ్రంథం ఉన్నది. దీనిని బొంబాయిలోని వేంక

ేశ్వర ప్రెస్‌వారు ప్రచురించారు. కొన్ని లిఖిత ప్రతులలో ఇది పద్మపురాణాంతర్గతంగాను, మరికొన్ని బ్రహ్మాండపురాణాంతర్గతంగాను పేర్కొనబడింది, ఇది పూర్వార్థమని, ఉత్తరార్థమని రెండు భాగాలు. పూర్వార్థంలో రామకథ, ఉత్తరార్థంలో సీతాకథ వర్ణితాలు. పూర్వార్థం 50 అధ్యాయాల గ్రంథం. రాముని బాల్యక్రీడలు విశేషంగా వర్ణితాలు; పెక్కు ఉపకథలూ ఉన్నాయి. కైకేయి వివాహగాథ, మందర అసురరాజు విరోచనుని కుమార్తె అనే పూర్వజన్మ గాథ మొదలయినవి విపులంగా వున్నవి. మంథర గూనిదని అందరూ ఏడిపించేవారని అందువల్ల కసి తీర్చుకుందామని దాని మనసులో వుండేదని లోకంలో వ్యాపించిన గాథ ఈ ఉపాఖ్యానంలో వుంది. కాని, మంథరను హెచ్చు ఏడిపించిన వాడు శత్రుఘ్నుడు, అతని మిత్రులూను; వారు ఆమె గూని వీపును చరచేవారట. అయోధ్యా మాహాత్మ్యం గురించి, పవిత్రత గురించి విపులమైన వర్ణనలున్నాయి. రాముని మీద, రాముని శైశవబాల్య లీలలమీద కొన్ని శ్లోకాలున్నాయి. ఈ సత్యోపాఖ్యానానికి భుసుండి రామాయణంతో కొంత సాదృశ్యం ఉన్నది. కాకభుసుండి 26 వ అధ్యాయంలో రాముణ్ని బాధపెట్టే వాడుగా ప్రవేశిస్తాడు. తర్వాత భక్తుడుగా మారుతాడు. రామనవమి నాడు సరయూనదిలో స్నానం చేయడంవల్ల కలిగే పుణ్యవిశేషం, సరయూనదీతీరంలో నలుగురు అన్నదమ్ముల క్రీడావినోదం, మృగయా వినోదం, గుహ రామ సమాగం, మైత్రి — పూర్వార్థంలో ఇతివృత్తం. ఉత్తరార్థంలో సీతాచరిత్ర — జననం, లక్ష్మి రామభార్య కావడానికి సీతాదేవిగా అవతరించడానికిగల కారణాలు వర్ణించబడినవి సీతారామ కల్యాణం అత్యంత విపులంగా వర్ణితమైనది. నలుగురు దంపతులూ గుహుడు దారి చూపగా, సరయూనదీతీర వనాలలో విహరిస్తారు. సీతారాములు శేషాచలంతోపాటు పెక్కు పర్వతాలు అధిరోహించి విహరిస్తారు. గ్రీష్మంలో వారిద్దరూ సరయూనదిలో నౌకా విహారం చేస్తారు.

## రామరాజ్యం

రామరాజ్యమనేపేరుగల అపూర్వలిఖితపుస్తకం పరిశీలించే అవకాశం నాకు కలిగింది. ఇది ఒకే ఒక ప్రతి ఉంది. ఇది మహారాష్ట్రంలో ఒక పండితునివద్ద ఉంది. ఇదొక ఉద్గ్రంథం; 24 భాగాలు. కాని ఇది పూర్తిగా లభించలేదు. రాజుగా రాముని జీవితంలోని పెక్కుగాథలు దీనిలో వర్ణితాలు. దీనికి మంగళ—మంగళఅనే పేరుకూడా ఉంది. ఇది శివపార్వతీ సంవాదంగాను, వాసుదేవార్జున సంవాదరూపంలోను ఉన్నది.

పైన పేర్కొన్న రామాయణాలనే పేరుతో వున్న గ్రంథాలతోనే విస్తృతమైన రామాయణ ప్రపంచం సమాప్తం కాలేదు; రామాయణేతిహాసానికి సోదరిఅయిన భారతేతిహాసంలోను, పురాణోపపురాణాలలోను రామాయణ గాథలు విపులంగా ఉన్నాయి; ఈ గాథలు ఒక్కొక్కప్పుడు వివిధ ప్రకారాంతరాలతో, అదనపు ఉపగాథలతోను ఉంటాయి. ఈ గాథలలో అత్యంత ముఖ్యమైనది మహాభారతంలో వనపర్వం చివరన, జయద్రథుడు ద్రౌపదిని అపహరించగా, ఆమెను విడిపించినతర్వాత యుధిష్ఠిరుడు తన దురదృష్టాన్ని దూషించుకొంటుండగా, మార్కండేయ మహర్షి భార్యాపహరణ పూర్వమూ జరిగినదని సహోపాఖ్యానంతోపాటు చెప్పినట్టిది. ఈ సందర్భంలో చెప్పిన రామాయణకథ, మహాభారతంలోని తక్కిన పర్వాలలోని, రామాయణంలోని ప్రస్తావాలు వాల్మీకి రామాయణాధ్యయనానికి చాల అమూల్యమయినవనడంలో సందేహం లేదు విష్ణువును, విష్ణుఅవతారగాథలను వర్ణించే పురాణాలు ఉపపురాణాలలో రామావతారగాథ సంక్షిప్తంగా లభిస్తుంది—అనగా, విష్ణుపురాణ భాగవత పురాణాలలో రమణీయమైన రామకథాప్రశంస; రామాయణ సందేశకథనం ఉన్నాయి. అగ్ని, గరుడ, కూర్మ పురాణాలలోను, రామకథ వున్నది; ముఖ్యంగా కూర్మ పురాణంలో రాముడు రామేశ్వరంలో శివలింగాన్ని పూజించినట్లు చెప్పబడింది.

## దేవీభాగవతంలోని రామకథ

దేవీభాగవతంలోని రామకథను ఇక్కడ ప్రత్యేకంగా ఉట్టంకించడం అవసరం. దేవీభాగవతంలోని తృతీయ స్కంధం 28, 29, 30 అధ్యాయాలలో రావణుడు సీతను అపహరించినవరకుగల కథ తెలుప

బడింది. తర్వాత, దేవిని ఆరాధించవలసిందని నారదుడు రాముని కోరినట్లు, దేవి దేవీనవరాత్రంలో మహాష్టమినాడు రామునికి ప్రత్యక్షమై, నవమి పూజను ముగించి, రావణసంహారంకోసం విజయదశమి నాడు దండయాత్ర వెడలుమని అన్నట్లు కథ కొనసాగుతుంది

## పద్మపురాణం

ఇలాగే పద్మపురాణంలోని రామకథకూడ ఇక్కడ ప్రత్యేకంగా పేర్కొనదగింది. పద్మ పురాణ పాతాళఖండంలో ఆరుఅధ్యాయాలు రాముడు ఆచరించిన అశ్వమేధం గురించి ఉన్నవి ఈ కథ రాముడు రావణసంహారానంతరం లంకనుంచి అయోధ్యకు తిరిగి రావడంతో ప్రారంభమవుతుంది అశ్వమేధాశ్వాన్ని శత్రుఘ్నుడు దేశమంతా త్రిప్పడం, శత్రుఘ్నుడు పర్యటించిన, పోరాడిన వివిధ దేశాల రాజుల వర్ణన, దర్శించిన పుణ్యక్షేత్రాల, నదుల వర్ణన అశ్వమేధయాగ వర్ణన విపులంగా ఉన్నవి. అశ్వమేధ యాగానికిముందు రామునికీ, వాల్మీకికీ సంభాషణ జరుగుతుంది దాని ఫలితంగా సీత, లవకుశులు వాల్మీకి ఆశ్రమంనుంచి అయోధ్యకు పిలిపించడం, సీతాసమేతుడై రాముడు అశ్వమేధయాగం నిర్వర్తించడం వర్ణించబడ్డాయి. పద్మపురాణంలోని ఈ భాగం రామాశ్వమేధమని ప్రత్యేకంగా వ్యవహరించబడుతున్నది. ఎందుకంటే పాతాళఖండం లిఖితప్రతులు కొన్ని రామాశ్వమేధమనే శీర్షికతో విడిగాను కనిపిస్తున్నాయి గనుక.
పద్మపురాణం మొదటిఖండమయిన సృష్టిఖండంలో నాలుగధ్యాయాలు (32 – 35) రాముణ్ని రాజుగా అభివర్ణించి, రామాయణగాథను క్లుప్తంగాచెప్పి ఉత్తరకాండ కథను చెబుతున్నాయి.

## స్కందపురాణంలో

స్కందపురాణంలోని తృతీయ ఖండమైన బ్రహ్మఖండం మోధాబ్రాహ్మణులనే ఒక తెగ బ్రాహ్మణులకు ఆవాసమైన ధర్మారణ్యా మాహాత్మ్యం విపులీకరించింది. ఈ ప్రాంతాన్ని శ్రీరామచంద్రుడు రాజుగా వున్నప్పుడు బ్రాహ్మణాలకు దానమిచ్చి అభివృద్ధిపరచినట్లు వర్ణించింది ఈ సందర్భంలో రామాయణకథ, ముఖ్యంగా రామరాజ్యం ప్రస్తావించబడ్డాయి. హనుమంతుడు అశోకవనంలో సీతాదేవిని చూచినదిమొదలు రామపట్టాభిషేకంవరకు జరిగిన సంఘటనలు తిథుల ప్రకారం వర్ణించబడ్డాయి— (30 వ అధ్యాయం). పట్టాభిషేక సమయంలో రాముని వయస్సు 42 సంవత్సరాలని, జానకీదేవి వయస్సు 33 సంవత్సరాలని ఈ పురాణం పేర్కొన్నది కాని, ఇది పొరపాటులాగ కనిపిస్తుంది. ఎందుకంటే, సీత, రావణుడు తనను అపహరించే దుష్కృత్యం చేసినప్పుడు రామునికి యువరాజపట్టం కట్టదలచినప్పుడు వయస్సు 25 సంవత్సరాలని, తన వయస్సు 18 సంవత్సరాలని తనే రావణునితో అంటున్నది గనుక. స్కందపురాణం ఇదే ఖండం 34 వ అధ్యాయం రామకథను సేతుమాహాత్మ్యమనే పేరుతో చెబుతున్నది.

విష్ణుధర్మోత్తరపురాణంలో చాల భాగం రామ పుష్కర సంవాదరూపమయిన రామకథకు వినియోగించడం గుర్తింపదగినది. పుష్కరుడు రామునికి రాజధర్మాలు, దినచర్య, సామాన్య ధర్మాలు మొదలయిన వాటిని ఉపదేశిస్తాడు.

పైన పేర్కొన్న రామాయణాలు కొన్నిటిలో వేదాంత ఉపదేశాలు ఉన్నా మహారామాయణంలో తత్త్వోపదేశం సముజ్జ్వలంగా, సమగ్రంగా ఉండడం మనం చూడవచ్చు. దీనిలో రామునికి ఆయన గురువు వశిష్ఠుడే తత్త్వోపదేశం చేస్తాడు ఈ మహా రామాయణం పూర్తిగా జ్ఞానమార్గాన్ని వర్ణించడం వల్లనే దీనికి మహారామాయణమని, జ్ఞానవాశిష్ఠమని యోగవాశిష్ఠమని, మోక్షోపాయమని పేర్లువచ్చాయి. ఇది ఆరు ఖండాల మహాగ్రంథం రసవత్తరమైన శైలిలో ఆఖ్యానోపాఖ్యానాలతో హృదయంగమంగా వుంటుంది. దృష్టివాదం – సృష్టివాదంవంటి గహన తత్త్వ విషయాలను ఇది చెబుతున్నది. అద్వైతవు

తర్వాత చరిత్రలో ఇది హెచ్చుగా ప్రామాణిక గ్రంథమైంది దీనిని విద్యారణ్యులు విశేషంగా ఉదాహరించారు. మొగల్ చక్రవర్తుల కాలంలో దీనిని సన్యాసులు హెచ్చుగా ఆదరించారు. అక్బర్ చక్రవర్తి, దారాశికోహ్ దీని విషయాలను శ్రద్ధగా వినేవారన్న విషయం మనకు కుతూహలం కలిగిస్తుంది. రాముడు అక్టర్‌కు దారాషికోహ్‌కు స్వప్నంలో ప్రత్యక్షమై—దీనిని—యోగవాశిష్ఠాన్ని—పారసీక భాషలోకి అనువదించ వలసిందిగా ఆనతి యిచ్చినట్టు చరిత్రకారులు పేర్కొన్నారు.

ఇవికాక, రాముని గొప్పదనాన్ని వర్ణించే పెక్కు గ్రంథాలు విభిన్ననామధేయాలతో ఎన్నో ఉన్నాయి. వాటిలో ఒక్కదానినిమాత్రం పేర్కొంటాను—ఇది తమిళనాడులో రామబ్రహ్మనందుడనే ఆయన క్రోడీకరించిన తత్త్వసంగ్రహ రామాయణం. ఇది. రామకథలకు, రామపూజావిధానం, రామతత్త్వం, రామనామ మాహాత్మ్యం—అనేవాటికి తరుగని భండారం. దీని సంస్కృతమూలం ఇంకా ముద్రితంకాలేదు. కాని, దీని తమిళ అనువాదం 1916 లో ముద్రించబడింది. నేను దీని సంగ్రహం ఆంగ్లంలో ప్రచురించాను.

రామాయణం మహావటవృక్షంలాగ పెరిగింది. దీనికి బీజం రాముడు. దీని శాఖలు ఊడలు, భారతదేశమంతటా మాత్రమేకాక, దూరప్రాచ్యంలోను, ఆగ్నేయాసియాలోను వ్యాపించాయి.

ఆశ్రయే రామబీజోత్థ
రామాయణ మహావటం,
ద్వీపద్వీపాంతరవ్యాపి
శతశాఖా ప్రవిస్తరం



# రోడ్డు రోమియోలు

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

'బులిరత్తమ్మగారి మొగుడిల్లు ఇదేనండి' అడిగాడు జకరయ్య హెడ్డు.

'బులిరత్తమ్మగారి మొగుడేమిటోయ్?' ఆయన పేరు?' నొసలు చిట్లించాడు సబిన్‌స్పెక్టర్ రాచమల్లు.

'ఆయనపేరు బులిరత్తమ్మగారి మొగుడే నండి...అదంతేనండి.'

సరిపోయింది!

బులిరత్తమ్మగా రింటో అడుగు పెట్టా రిద్దరూ.

హాలుకిమధ్య ఒక 'టేబిలూ'...అటూయిటూ గాడ్రేజ్ కుర్చీలూ ... కుర్చీలమీద తివాచీచదరలూ... రెండు కుషన్‌కుర్చీలూ......పైన 'సీలింగ్‌ఫానూ'; ఇల్లు నీటుగావుంది..... పిల్లాజెల్లా జంజాటం లేనట్టుంది.

బులిరత్తమ్మగారికి పోణంగిలో యాభైయ్యెక రాల మాగాణివుంది...అక్కడ గొడ్డూగోదా పెద్ద కామాటం...అదంతా బులిరత్తమ్మగారి మొగుడు చూచుకుంటాడు. ఆ దంపతులికి అష్టారుబతంగా ఒక్కగా నొక్కకొమార్తె జయంతి...ఆమె చదువు కోసం బస్తీలో మకాం పెట్టారు.

చెప్పకుండానే కుర్చీలమీద ఖైఠాయించారు పోలీసు లిద్దరూ.

బులిరత్తమ్మ ఇంటోనించీ హడావుడిగా వచ్చేసింది. ఆమె వొంటిని నగానట్రా లేదు. నాచు కలర్ వెంకటగిరి చీర కట్టింది. మొహాన్ని పెద్దకుంకం బొట్టు...చేతికి మిరియంగాజులు...ఏళ్లు పైబడినా యవ్వనమెంతకీ దిగజారక మొరాయిస్తోంది వొంటిని. జరుగుబాటున్న లోగిట్లో పెత్తనం చెలాయించే తాహతుకి దాఖలాగా మెడలో తాళంగుత్తి...

'బులిరత్తమ్మగారిల్లు ఇదేనాండి?' అడిగాడు జకరయ్యహెడ్డు.

'ఇదేనండి.' ఆమె మొహాన బెదురు స్పష్టంగా అగుపిస్తోంది.

బస్తీలలో ఏమోగాని...పల్లెటూరిదిక్కున...... ఈనాటికీ...కొంపలో పోలీసు అడుగుపెట్టారంటే కొంప మునిగిందన్నమాటే.

'మరేం లేదండమ్మా......నిన్నసాయంత్రంపేళ నాలుగున్నరకి అటు కాలేజీరోడ్డుమీద నిఘా వేశాం లెండి...వేస్తే ఒక చిన్నకేసు దొరికింది.'

'కేసాండి?' ఉలిక్కిపడింది బులిరత్తమ్మ.

'అహ మరేంలేదు...నిన్న కాలేజీ వొదిలిన తరవాత......మీ అమ్మాయి జయంతి వున్నది చూశారూ...ఆమె వెనకాల తారట్లాడుతో......ఒక ఆకతాయి నవ్వూనూ పేలనూ...గల్లంతు సాగిస్తూ అగుపించాడులెండి......అతగాడిమీద కేసు పెడదా మని...' సబిన్‌స్పెక్టరు నేరుగా విషయాని కొచ్చేశాడు.

బులిరత్తమ్మగారి మొహం వికసించింది.

'ఎర్రగా పుష్టిగా బొద్దుగా వుంటాడు కదండి?'

'అవునండి అవునండి'

'పసుపుపచ్చపాంటూ......చుక్కల నెక్‌టై వేసుకుని...'

'ఆ...ఆ...అతనేనండి...

అతనికి అదొక్కటే దిరిసా ఏమిటి చెప్మా... 'ఓడ్‌మార్కులేన్లే' చెప్పుకోపోతోందామె.

'అతగాడు నారాయణపతి అని ఒక పరమ కిల్లాడీలెండి'.

ఇక స్థిమితపడింది బులిరత్తమ్మ. తనమీదా కొమార్తెమీదా ఏ విధా కుమ్మరాం వచ్చిపడలేదని తెలిపోయింతరవాత ... ధైర్యం కూడదీసుకుంది. అయినా సబిన్‌స్పెక్టరుగారిసమక్షంలో కూచుందుకు జంకింది.

ఇక్కడికి సబిన్‌స్పెక్టరు...కూచోండమ్మా... ఫరవాలేదు...అని భరోసా ఇచ్చాడు. ఆమె ధోరణి చూస్తే ... 'వాడు ... ఆ నారాయణపతి ... గ్రంధ సాంగుడే నన్నమాట!' అనిపించింది ఇద్దరికీ.

తాపీగా చెప్పుకుపోతోందామె

'ఈ నారాయణపతి వున్నాడు చూశారూ... నాయనా...మాపాలిట శనల్లే దాపురించాడు. సొంతం వినండి చెబతా' అని పైటకొంగు విరిచి ముందుకు తీసుకున్నది బులిరత్తమ్మ.

'మీ కెందుకూ? కేసు బనాయించి పాతేస్తాం లెండి వాణ్ణి...ఎవడీ నారాయణపతి? ఏమి చదువు కుంటున్నాడు? ఎక్కడుంటున్నాడు? ఏమిటి ఆతని కథా కమామీషూ' అని అగ్గగ్గలాడాడు జకరయ్య హెడ్డు.

'అసలు వాడెవడో పూర్తిగా తెలీదనుకోండి' అని శూన్యంలోకిచూచి, 'తెలిసినంతవరకూ అతగాడిది ఇంగూరుపాలెమండి ... ఏదో వారాలు చేసుకుని తింటున్నాట్ట ... స్కాలర్‌షిప్పులో చట్టుబండలో సంపాయించుకుని...'బి. యస్. సి మూడో యేడు గారేను వెంగబెడుతున్నాడు లెండి...తల్లి లేదు ... తండ్రి వున్నాట్ట. ఎక్కడోయేట్లో... వాడొక కోర్నుపక్షిట...కూట సాకాల్యలివ్వనూ... పార్కిందగ్గర నాలుగురాళ్లు రాల్చుకుని తింటో... ఒకపూటవుండీ...ఒకపూటలేకా...ఊరూరు బలాదూరు తిరుగుతుంటాడటండి. ఇక వీడేమో ... ఆడపిల్లల వెనకాలబడే...అచ్చోసిన ఆంబోతులా...రికామిగా... ఇక్కడ ఇదీ వీడుచేస్తున్న నిర్వాహకం!...'రొప్పుతో ఒక్కబిగిని ఏకరువు పెట్టడంతో కాస్త విశ్రాంతి తీసుకుంది బులిరత్తమ్మ.

'ఇహ నేమండి...వాడొక దేశదిమ్మరి వీడొక 'లోఫరు'. పెట్టేదాం సార్ కేసు' అన్నాడు హెడ్డు సబిన్‌స్పెక్టరుకేసి తిరిగి. చిన్న ఆడపిల్లల కాలేజీకేసి 'రవుండ్సు' మీద వెళ్లగా ... 'రోడ్డు రోమియోనా' కేసులు రెండు దొరికినై. నంబర్‌వన్ కేసులో ముద్దాయిని 'పోలీసుస్టేషన్'కి రప్పించి కదిలెయ్యగా... ఆ ప్రబుద్ధుడు డిప్టీకలెక్టరుగారి కుమార రత్నమని తేలింది చివరకి. దాంతో ఆకేసులు వొదులుకున్నారు 'రోడ్ రోమియో' నంబర్ టూ కేసిది. ఇతగాడయినా ఏ యం. ఎల్. ఏ సుపుత్రుడో కాకుండా పోయినందుకు సంతోషం పొంగిపొర్లిపోయిందతనిలో.

వీళ్లు పూర్తిగా నామాట వినలేదా ఖర్మ! విసుక్కపోయింది బులిరత్తమ్మ...కోతికి కొబ్బరికాయ దొరికినట్టు...ఒకటే స్మరణ కేసుకేసంటోనూ!

'వినండి మరి'అంటు వాళ్లిద్దరిమధ్యా సెక్షన్‌ని గురించి నడుస్తున్నచర్చ ఆపి.

సబిన్‌స్పెక్టరుదీ పెద్దవయస్సు సాయిలా పాయిలాగా మాట్లాడుతుండెను ఏమయితే అయిందని స్టూలుమీద కూచుంది బులిరత్తమ్మ. కూచుని సావధానంగా చెప్పింది.

'రోజూ వీడు... ఈ నారాయణపతి... ఆకతాయిల్ని కూడగట్టుకుని...మా అమ్మాయి కూడా పడనూ...పేర్లు పెట్టి పిలవనూ...దుర్భాషలాడనూ... ఒకటండి..., వైనవైనాలుగా చెప్పుకుపోతోం దామె.

'అప్పుడప్పుడు — తగుమనమ్మా అని ... ఆవేనో 'నోట్సట నోట్సు' ఇచ్చిపోతుంటాడండి'. గమ్మున ఊరుకుంది బులిరత్తమ్మ.

సబిన్‌స్పెక్టరూ హెడ్డూ ఒకళ్ల వైపు ఒకళ్లు చూచుకున్నారు ఏదోవాసన కొట్టినట్టయి—

'అయితే ఇంటికిరావద్దని చెప్పాడుటండీ ' అన్నాడు జకరయ్య.

'సరిపోయింది...నేనుచెప్తే వింటాట్టండీ?'

'పోనీ మీ అమ్మాయిచాతనే చెప్పించండి...

'హయ్యొర్రాత...అదో వెర్రికుట్టి ... కానక కన్న సంతానం నాయనా...ఒక్కగా నొక్కనలుసు... చెప్పొద్దూ... అల్లారు ముద్దుగా పువ్వుల్లోబెట్టి పెంచుకొచ్చాము...అలాఅలా 'బి. యే'లో కొచ్చిందండి ఈ యేడే అంచాత గారమనుకోండి...ఎటొచ్చీ కాస్త చెప్పినమాట వినదు...దానికితోచదు'.

'ఇంతకీ మీరు చెప్పిందేమిటి? అమ్మాయిగారు విన్నదేమిటి?'.

'రావద్దని చెప్పవే అన్నానండి'.

'చెప్పిందా?'.

'చెబుతుందీ? అది అసాగరకంట! పెద్ద మనిషిని అనుమానిస్తున్నట్టు లెక్చరట!... అంట్ల వెధవ...వాడు పెద్దమనిషేమిటండీ నా తలకాయి? అమ్మాయి వొట్టి పసితకండీ......వైనంముద్ద... అభమూ శుభమూ తెలియదు...నల్లటివన్నీ నీళ్ళూ తెల్లటివన్నీ పాలూ అనేసుకుంటుంది......చూస్తారుగా...పచ్చేటప్పుమయింది 'ట్యూషని'కి వెళ్ళిందండి'

'అలాగా...'పోలీసాఫీసర్లిద్దరూ కథానాయకి ఎంతకీ ఊడిపడదేమాఅని ఎదురుచూస్తున్నారు ఇందాకటినించీ.

'అయితే నోట్సు కావాలని మీ అమ్మాయే అడిగిందాండి?' జకరయ్యకి సంధేహ మెంతకీ తీర లేదు.

సబిన్స్పెక్టరు వాళ్ళిద్దరి సంభాషణా జాగర్తగా వింటూ కూచున్నాడు.

'అడిగే వుంటుందనుకుంటానండి' అని నాన్చింది బులిరత్తమ్మ.

'అనుకోవడ మేమిటండి మళ్ళీను. మీరు కనుక్కోలేదా?'.

'అడక్కుండా వుంటుందా? అడిగిందండి.'

అమ్మయ్య......ఉలప్రాణం లేక కొచ్చింది జకరయ్యకి.

'ఇహనేమండి? అతని తప్పేముంది?' నీళ్ళు గారాడు హెడ్డు.

'క్షేమంగా వుంది...అవంక పెట్టుకుని రాక పోకలు సాగిస్తున్నాడండీ ఖర్మ'. నెత్తి బాదుకుంది బులిరత్తమ్మ.

సబిన్స్పెక్టరుకి చిర్రుబుర్రలాడుతోంది.

'ఇదిగో జకరయ్యా......ఈ డొంక తిరుగుడేమిటోయ్? ఈ నోట్సు పుస్తకాలగోల మన కెందుకూ?' అని, అటు తిరిగి—

'అమ్మా బులిరత్తమ్మగారూ......అదంతా వొదిలేయండి. నిన్నటిమాట......సాయింత్రం పేళ...... నాలుగున్నరకి...మీ అమ్మాయి జయంతి కాలేజీ నించి వస్తుండగా జరిగింది...అతాడు వెనకాంపడి అల్లరి పట్టిస్తున్నాడు...మేం చూశాము...మాకూ ఇదివరలో అతని కొక్కిరాయిచేష్టలు అంటుకుకొంత అనుభవానికొచ్చినవే ఆయెను......కేసు పెడదామని వచ్చాము...ఏమంటారు?...'

'పెట్టండి బాబూ పెట్టండి కేసుపెట్టి... కోర్టుకీడ్చి...కలుకటాల వెనకాతల ఓ మూడునెలలు దేవతాపులుసు తినిపిస్తారా...ఆముట్ను రోగం కుదురుతుంది'అంటూ కసిగా ఊడిపొయ్యే చెంపపిన్నీసులు సర్దుకుంది బులిరత్తమ్మ.

పోలీసాఫీసర్లిద్దరికీ తృప్తిగావుంది.

'అయితే బులిరత్తమ్మగారూ...మాట వరస కంటున్నానుమ్మండీ; ఏమీ అనుకోకండి. ఇద్దరికీ ఇష్టంగావును.. పోనీ... పెళ్ళి చేసెయ్యరాదండీ... రోడ్లమీద ఇకిలింపులూ సకిలింపులయినా తగ్గుతయ్యి పిల్లవాడన్నారూ...ఎర్రగా పుష్టిగా బొద్దుగా ఉన్నాడని మీరే వర్ణిస్తిరి. చదువుకుంటున్నాడు... ఆస్తిపాస్తులు లేవంటారా? మీకున్నాయికదా... మూడుతరాలకి సరిపోంగా ఎక్కేదొక్కేను' అన్నాడు, సబిన్స్పెక్టరు కంఠస్వరం తగ్గించి.

'హయ్యొర్రాత...మేనరికముందండీ.. నిక్షేపంలా అమెరికాలో ఏరోనాటికల్ ఇంజనీరింగు చదువుతున్నాడు చదువు పూర్తికాంగానే...పెళ్ళి చేసేస్తాం. మీరా అల్పిష్టి! వాడికి టికాణా లేదు ఒక అదుపా ఆజ్ఞా? తెగిన గాలిపటమల్లే...ఆడపిల్లల వెనక తచ్చాడుతో...ఖర్మ...సాంప్రదాయాలుగల కుటుంబ మండీ మాది' అని సాగదీసింది బులిరత్తమ్మ.

'ఆ సంబంధం మీ అమ్మాయికిష్టమేనాండీ?'

'ఆ...ఇష్టంకాకపోవడమేమిటీ?'

'కాని...ఇదన్నారూ చేతికందుబాటులోవున్న చెరుకుముక్క! అదేమో అమెరికాలో ఆరేళ్లకిగాని వేగని అరిసెముక్క!!' కిసుక్కున నవ్వాడు జకరయ్య హెడ్డు.

కాని బులిరత్నమ్మగారు 'సీరియస్సు'యి పోవటంలో నవ్వు ఆపి.. మాట మాటాసందున కసింత కసింత ప్రుక్కిలింతగా వాదడం ప్రారంభించాడు.

గచ్చుమీద 'హైహీలు బూట్ల' చప్పుడయి వెనక్కి తిరిగి చూశారిద్దరూ.

జయంతి 'ట్యూషన్' ముగించుకొని వచ్చేసింది.

చామనచాయ. కోల మొహం. గుండ్రటికళ్లు. జాలుజడచివరన ఒకేఒక్క రిబ్బన్ మెరుస్తోంది; జరీ బోర్డరువేసిన తెల్లని మజ్లిన్ పావడామీద, తెల్లని ఫుల్‌వాయిల్ బ్రవుజు ఫిల్టులువేసింది తొడిగింది. నొసట దీపశిఖపేటరన్‌లో ఎర్రని తిలకం. చెవులకి ఇరానీరింగు లోలక్కులు.

అంత కూడాపడి కళ్ళుంచాలనిపించేంత సౌందర్యరాశికాదు కాని, అన్నివంకరలూ మూసిపెట్టే నిండు వయస్సు ఆమె వొంటిమీద దండయాత్రకి సిద్ధంగా వుంది.

వస్తూనే, 'రాకింగ్ ఛెయిర్'లో కూలబడి, పుస్తకాలు 'రివాల్వింగ్ బుక్‌షెల్ఫ్'లో పారేసింది జయంతి.

బులిరత్నమ్మ ఎసట్లో బియ్యంపోసి వస్తానని లోపలికి చక్కాబోయింది.

జయంతి, 'పోలీసు లెందుకొచ్చారా' అన్న మీమాంసలోపడి, లోపలికివెళ్లి కనుక్కుందామన్న సన్నాహంలో వుండగా —

'అమ్మాయిగా — నీతో మాట్లాడాలని వచ్చారమ్మా సబిన్‌స్పెక్టరుగారు' అని కదలేశాడు జకరయ్య.

'నాతోనాండి?...వచ్చి, వాలుకుర్చీలో 'టేబిలు' పక్కని 'స్టయిలు'గా కూచుంది జయంతి ఒక కాలు నేలమీద వుంచింది. రెండోకకాలు బులిరత్నమ్మ లేచి వెళ్లిన స్టూలుమీద ఆనించింది.

'మరేం లేదమ్మా...ఒక చిన్నపనిమీద ఇటు కేసి వచ్చాము...మాకు పైనించీ తాఖీదులు వచ్చినయితే...ఆడపిల్లల కాలేజీ వున్నచోట 'రోడ్డు రోమియోల'మీద ఏవైనా కేసులు పెట్టమనీ. ఆ సందర్భంగా......'

'పెట్టండి సార్ పెట్టండి' ఎందుకూ? రోజూ కాలేజీ వదిలే టయిముకల్లా రాండి...రెండూ మూడూ దొరుకుతై.. ...పట్టపగ్గాలున్నాయిటండీ? కోతులూ, కొండముచ్చులూ నయం స్మండీ...దిక్కూ దివాణమా?' ఎకాఎరీగా చెప్పుకుపోతోందామె.

అమ్మాయి తీరు ప్రసన్నంగా వుండటం కని పెట్టి, 'అదేనమ్మా......ఆ సందర్భంగానే...నిన్న 'రవుండ్సు'మీద అటుకేసి వచ్చాలెండి...ఏవో రెండు కేసులు దొరికినై......మీ దొకటీ' అన్నాడు సబిన్‌స్పెక్టరు.

'నావా?' నిర్ఘాంతపోయింది జయంతి.

'అవును ... చూడమ్మా... మొన్న... ... మీ వెనకాల...కాలేజీ వొదిలినవేళ...ఒక 'స్టూడెంటు'... పసుపుపచ్చపాంటూ, క్రీమ్‌కలర్ బుష్‌షర్టూ, వంకీలజుత్తూ... మొహాన్ని మొటిమలూ...అతగాడు వెనకాలనించీ నిన్ను పేర్లుబెట్టి పిలవనూ...నువ్వు వెనక్కితిరిగి చీదరించుకోనూ...ఎందుకో మరి అతను పళ్లికిలించి నవ్వనూ........అల్లరి పట్టించాడు చూశావూ...'

సబిన్‌స్పెక్టరు వర్ణన ముగించనేలేదు...వహాలు మన్నది జయంతి.

సద్దుకుని, 'ఓహో' అతనాండి...నారాయణపతి అని బి. యస్. సి. ఫైనలియర్ స్టూడెంటు లెండి...నే నెరిగున్నవాడే ... మంచివాడండి పాపం... ఏదో సరదామనిషి' చప్పరిస్తోంది జయంతి.

పోలీసాఫీసర్ల మొహాలు రెండూ పాలిపోయినై.

'కాని...అమ్మాయీ...నీ వెనకాల జేరి...... తక్కుతో తారుతో...పబ్లిక్ రోడ్డుమీద...కిచ

కిచలుపోనూ...వేలాపనలు సాగించమా...అసహ్యంగా లేదుటమ్మా...అసభ్యంగా లేదూ?'

జయంతి ఆలోచనలో పడింది. నేల చూపులు చూస్తూ—నానుస్తూ—నంగినంగిగా—

..అతను...అతను...అతనొక తరహా మనిషండీ...నవ్వుతోనేగాని మాట్లాడలేడు...ఏవో చమత్కారాలు పోతుంటాడు' అన్నది తబ్బిబ్బుగా.

సబిన్‌స్పెక్టరికి చిర్రెత్తుకొచ్చింది.

'చమత్కారాలా? పబ్లిక్‌రోడ్డుమీదా? వయస్సు వచ్చిన ఆడపిల్లవు పైగా!' రెచ్చిపోయాడు.

ఆ మాట్న ఆమె పీక నులిమేదామా అన్నంత కోపం వచ్చింది సబిన్‌స్పెక్టరికి. కాని అది సెక్షన్ 307 కింద వస్తుందని మెదలకుండా ఊరుకున్నాడు.

జయంతి తగ్గింది.

పొడిగా నవ్వేస్తూ 'అదికాదు సబిన్‌స్పెక్టరుగారూ...కోపగించుకోకండి మరీ...అతని 'తత్త్వమిదీ' అని విడమరిచి చెబుతున్నా...'

'ఏదీ?...ఆడపిల్లల వెనకాలజేరి...నవ్వించనూ కవ్వించనూ...నీ పరిభాషలో చమత్కారాలుపోనూ...ఇదిటమ్మా చదువుకుంటున్న ఫలితం? ఇష్టమయితే సరదా? లేకపోతే బురదా?'

పెదిమ అదిరిన్నై సబిన్‌స్పెక్టరికి...జయంతి 'సీరియస్సయి' పోయింది ఆ మాట్న బొమలు ముడివేసి బిర్ర బిగిసిపోయింది కుర్చీలో.

'సార్...సార్...అయితే...నా మాట వింటారా వినరా?'

సబిన్‌స్పెక్టరు శాంతించాడు.

గుళ్ళుచేరి బెళ్ళు మునుగుతున్నాయి!?.ఖర్మ! ధిమాకీ చేస్తోంది పైగా.

'నేను చెబుతున్నదేమిటంటే...అతను అయినవాడనీ...' మళ్ళీ అందుకున్నది జయంతి.

'అయినవాడంటే బంధువా నీకు?' యస్సయి క్రాస్' చేశాడు.

'బంధుత్వం లేదనుకోండి'

'మరి పరిచయమా?'.

'అదీ లేదు'.

'మరి స్నేహమా'.

'ఆడపిల్లలకి మొగాళ్ళతో స్నేహ మేమిటండీ' ఖస్సుమంది జయంతి.

'మరింకేమిటమ్మా ఆ బాంధవ్యం...నడిరోడ్డు మీద ప్రేమాయణాలు సాగిస్తేను!... ...ఛంపేస్తున్నావు మమ్మల్ని' బారలు చాపుకొంటో రాద్ధాంతం చెయ్యబొయ్యాడు సబిన్‌స్పెక్టరు.

రివ్వున లేచింది జయంతి జుత్తు ఎగసన దోసుకుంటూ 'ఇదిగో సబిన్‌స్పెక్టరుగారూ...ఎవరి హద్దుల్లో వారుండడం మంచిది.. అతనిమీద కేసు పెట్టుకుంటామంటారా, మహరాజులా పెట్టుకోండి. కందకి లేని దురద చేమకా? నా కెందుకూ మధ్య? నాకేమీ అభ్యంతరం లేదుసమ్మండీ...అతని తబిశీళ్ళేమయినా కావాల్నా? వ్రాసుకోండి చెబతాను; జాలీ లాడ్జిలో వుంటాడు......'రూం నంబర్ త్రీ'...... మాట్లాడరేమండీ?'

వెళ్ళిపోతోంది లోపలికి.

మొహా మొహాలు చూసుకున్నారు పోలీసాఫీసర్లిద్దరూను.

మరి మీ సాక్ష్యాలేక్కుండా......వెనకాలనించీ అరుస్తూనే వున్నాడు సబిన్‌స్పెక్టరు.

ఉరి మురిమి చూస్తోంది ఏమిచేస్తుందో మరి! బులిరత్తమ్మగారు వర్ణించి చెప్పిన వెర్రికుట్టి! మైనంముద్ద!!

చటుక్కున నిలిచిపోయింది జయంతి.

'నా 'స్టేట్‌మెంటు' కావాల్నంటారా—నా ఇష్టం మొచ్చినట్టిస్తాను మీ ఇష్టమొచ్చినట్టు కాదు...ఇమ్మంటారా' క్షణమాగి...సమాధానం లేకపోగా...గిరుక్కున వెనక్కితిరిగి...సివంగి నడకలు నడుస్తూ...చరచర లోపలికి వెళ్ళిపోయింది జయంతి.

ఈ నంగనాచి తుంగబుర్ర 'పీనల్ కోడ్డు' కందకుండా పోతుందేమోనని తల గోక్కున్నాడు సబిన్‌స్పెక్టరు, దవడ గీరుకున్నాడు పెద్దహెడ్డు.

ఈ గంభాకి ఆదరాబాదరా లోపల్నించి వొచ్చేసింది బులిరత్తమ్మ.

'కేసు పెట్టరాండి?' గుమ్మంలో నిలబడిందామె.

'చాలువాళ్లేవమ్మా...అబ్బురాన బిడ్డపుట్టింది గడ్డపారతో ముక్కలు కుట్టించు...కొమార్తె... ఆ వరసని నడిరోడ్డుమీద కుర్రకుంకలతో సరాగాలు పోనూ...మన్నేమో కేసుపెట్టమనా...ఆమేమో వద్దనా!' మొహాలు చెందుకున్నా రిద్దరూను.

చింతాకంతయిపోయింది ఆవిడ మొహం.

'వద్దంటున్నదాండి.. అదట్లానే అంటుంది బాబూ...మీరు కేసుపెట్టండి...నెగ్గితీరుతుంది.'

పోలీసాఫీసర్లిద్దరూ మూతిబిడాయించుకుని కుర్చీలమీదనించీ లేచి నించున్నారు.

నెగ్గితీరుతుందట! భరోసా ఇస్తోంది పైగా! ఇందాకటినించీ అరచేతిలో వెన్నపోసి మోచేయి నాకా నాకించింది మహాయిల్లాలు!! అమ్మాయిచేత సాక్ష్యమిప్పిస్తుందా? ఇప్పించగలదా?'

'అమ్మాయి సాక్ష్యంలేకుండా కుదరదాండీ?' నిలువుగుడ్లు పడిపోయినై బులిరత్తమ్మగారికి.

కుర్చీలు ఖాళీచేసి వెళ్లిపోతున్నారు పోలీసాఫీసర్లిద్దరూ.

చీడీలు దిగిపోయినవాడల్లా...వెనక్కి తిరిగి లోపలకొచ్చేడు హెడ్డు.

'పోనీ బులిరత్తమ్మగారూ—అతగాడు వ్రాసిన లవ్‌లెటర్లేమయినా వున్నయ్యా మీ దగ్గర?'

'ఓ—ఉన్నాయండి...కావాల్నంటే తెస్తా'

జకరయ్య మొహమింతయింది.

ఇదేమీ పట్టించుకోకుండా తలవంచుకుని చిరుగుముఖం పడుతున్నాడు సబిన్‌స్పెక్టరు. పోతో పోతో, 'జకరయ్యా' అని ఒక్క అరుపు అరిచి వెనక్కి పిలిచాడు హెడ్డుని.

పెనుగులాటమాని హెడ్డు సబిన్‌స్పెక్టరిని కలుసుకున్నాడు.

ఇద్దరూ వెళ్లిపోతున్నారు.

ఆ 'లెటర్సే'మి చేసుకుంటావోయి వోబయ్యా? అని అడిగాడు 'యస్సయి'.

'వాటు కంత్రీ బిజినెస్సంతీ అని రుజా చెయ్యొచ్చు గదండీ...అనట్ను సి ఆర్. పి సి. 107 బనాయించి...'

మధ్యలో మాటతుంచాడు సబిన్‌స్పెక్టరు.

'తనకి ఈ వగలాడి వ్రాసిన ఉత్తరాలు అతగాడు దాఖలుచేస్తే?'

నాలిక కొరుక్కున్నాడు జకరయ్య.

సబిన్‌స్పెక్టరు విడమరిచి చెబుతున్నాడు—

'ఈ చిన్నదొరసానేమో ఆ పతిగాణ్ణి వదలదు—ఆ పతి ఈ బంగరుపిచికని వదలడు — ఎందుకు వదలాలి అంటాను. ఈవిడ మాతృశ్రీకి...ఏంగో ఆ 'అమెరికన్ ఇంజనీర్ని' అల్లుణ్ణి చేసుకుందామని రంధి. అతని స్థానే ఈ పతిగాడెక్కడ ఖాయమై పోరుకుంటాడోనని గంగవెర్రులెత్తిపోతోంది. చలీటం లేదూ? మనమేమో ఆ నారాయణపతిమీద కేసు పెట్టి...అతగాణ్ణి జైలుపట్టించి ఆమె దారి కడ్డం తొలిగించాలి! ఇదీ ఆవిడ ఎత్తు. నీ కర్దంకాలే?'

'పిల్లకి ఇష్టమేకదండీ అమెరికా ఇంజనీ రంటేను?'

'అని ఈవిడ అంటాంది—అయినా అవి పెళ్లి పథకంకింద దీర్ఘకాలిక ప్రణాళికః ఈలోగా తుపాను వస్తే ఓడ దగ్గరున్న రేవుపట్నమేదో వొకటి చూచుకోవాలిగదా...'

'చచ్చాంపో' అనుకున్నాడు జకరయ్య.

దరిద్రుడికి తలకడగబోతే వడగళ్లవానట. పోయింది ఈ కేసుగూడా. ఇంతకీ రేపు నెలవారీ

'క్రయింమీటింగు'లో సూపర్నెంటు నిగ్గదీస్తాడు గదా, పెట్టిన రెండు కేసులూ ఏమయి నయ్యని. ఏమని చెప్పాలి?

బురిరత్తమ్మగారింటికి పోలీసు లెందుకొచ్చారో అంతుబట్టక ఇరుగూపొరుగూ గుమ్మాలదగ్గర నిలబడి చోద్యం చూస్తున్నారు.

'పిల్ల ప్రేమకలాపాలకీ...'డ్యూయెట్లు' పాడుకుందుకూ...చమత్కారాలకీ, ఛలోక్తులకీ...తోటలూ దొడ్లూ లేవుగావును...'పబ్లిక్‌రోడ్లే' కావాలి? అని అరుచుకుంటూ పోతున్నారు.

ఉన్నట్టుండి—

'రెండూ రెండే ఆడవారకం కేసులు పట్టుకొచ్చావు' అని విరుచుకు పడ్డాడు సబిన్‌స్పెక్టరు.

'నేనేం చెయ్యను సార్...సందర్భ మలాంటిది...తమరు చిత్తగిస్తూనే వున్నారుగా?' లాఠీ చంకన బెట్టుకొని చేతులు నలుపుకున్నాడు జకరయ్య.

'అసలు నిన్ను 'డిస్మిస్'చేస్తే సగం దరిద్రం వదుల్తుంది స్టేషన్‌కి' జయ్యిమన్నాడు సబిన్‌స్పెక్టరు.

'సగం దరిద్ర మాఁడి?...'

'సగంకాదు...పొరపాటు...నిండాను'.

---



# విజయవిలాసము - కొన్ని పాఠభేదములు

శ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహదీక్షిత శర్మ

శ్రీ చేమకూర వేంకటకవిరాజు ప్రతిపద్యమునందుఁ జమత్కృతి గలుగం జెప్పనేర్చి విజయవిలాస కావ్యమును రచించి, సహృదయ హృదయములను ద్రాక్షారసపాకమున ముంచితేల్చిన కవితా కళానిధి. ఈ ప్రబంధమునకుఁ గొన్నివ్యాఖ్యలు వెలువడినవి. అన్నిటికిఁ దాపీవారి వ్యాఖ్య అభిఖ్యయందేగాక ప్రఖ్యాతియందును తలమానికమని విజ్ఞుల నుడి—

ఈ కావ్యమునకుఁ జెక్కుపాఠభేదము లటనటఁ గనబడుచున్నవి. దాదాపు 25 సంవత్సరములనాడు నేను మిత్రసందర్శనార్థమై కరింనగరుజిల్లాలోని 'వేములవాడ' క్షేత్రమున కేగితిని. అక్కడ నొక పదిరోజులు సంగడికాండ్రతో గలసిమెలసి సాహితీ సభలలో పాల్గొనుచు కాలము గడపితిని. ఒకనాటి సాయంకాలమున వీధియందు గుట్టపడియున్న కొన్ని శిథిలతాళపత్ర సంపుటములను, పాతవ్రాతప్రతులను జూచి దరికేగ నేనొక వ్రాతప్రతిని తీసికొని పార జూచితిని. అది 'విజయవిలాసము'. పీచుకాగితాలపై కరకకాయసిరాతో వ్రాయబడియున్నది. అక్షరాలు ముత్యాలవలె నున్నవి. ఆ ప్రతి చివరభాగమున— శ్రీ కృష్ణార్పణమస్తు—'స్వభాను సంవత్సర వైశాఖ శు 12 బుధవారం మూడు ఝాములవరకు విజయ విలాసం పూర్వప్రతి నున్నట్లు ఆరాధ్యుల లింగయ్య గారికి వ్రాస్తిని' అని యున్నది. దీనిని విమర్శింపగా స్వభాను సంవత్సరము 26 సంవత్సరాలనాటిదియా? లేక 86 సంవత్సరాలనాటిదియా? అను సందేహము కలిగినను, వ్రాతనుబట్టి, కాగితములనుబట్టి 86 సంవత్సరాలనాటిదనియే నాకు తోచుచున్నది. సంవత్సరము, మాసము, తిథి, వారములనుబట్టి దాని నిర్ణయము విజ్ఞు లూహించుకొనుట సముచితమని ఆ భారము మీకే వదలుచున్నాను.

నేను ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన ప్రతిని ఆధారముగా చేసికొని ఆ ప్రాతవ్రాతప్రతిని పరిశీలించితిని. అకాడమీవారు ప్రతిపుటయందును అధోభాగమున కొన్నిపాఠాంతరములను సూచించినారు. అవిగాక మఱి కొన్ని పాఠభేదములు వ్రాతప్రతిలో గలవు: ఈ వ్యాసమునందు ఆ విశేషములను నిరూపించుటకు ముందంజవేసితిని. సహృదయులు పరిశీలించి సాధుతా సాధుత్వములను నిర్ణయింతురుగాక!

తొలుత ముద్రితప్రతిపాఠమును, దానికి వ్రాత ప్రతిపాఠమును వివరించుచున్నాను.

## ప్రథమాశ్వాసము

ముద్రిత : శృంగార ప్రబంధంబునకు (1 ఆశ్వాసము ప్రస్తావనము.)

వ్రాత : శుభోదర్క ప్రబంధంబునకు—

ముద్రిత : కడమాటు పగవానిగని చేమఱచె నంచు (1 ఆ- 4 ప.)

వ్రాత : కడమాట వచ్చినప్పుడు చే మఱిచె నంచు—

ముద్రిత : వీటిపాల్పైన నాగేటిపోటుననేమి
యని హలాయుధు మెచ్చరం ప్రిభవులు

పాడిఁదప్పక, ధర్మంబు పట్టువిడక
లక్షలకు నమ్మఁజాలి, నల్గడల భూమి
వరులు మేలన దగి యిట్లు పురి బౌలితురు
చదువుసాముల ధనధాన్య సంపదలను–(1ఆ–4 ప)

వ్రాత : అందు నాలవజాతి హేమముఖైశ్వర్యంబు
చే వృషధ్వజాని వంచింపఁ దలతు.
ఔరమేలన దగినట్టు లాపురమున
చదువుసాముల ధనధాన్య సంపదలను
సమత నొందుచు వర్ణాశ్రమములవార
లెలమి నుందురు కల్యాణ కలితులగుచు—

ము. ప్ర : నాసరిశేషపన్నగఫణానివహంబునటంచు
నప్పురిన్ – (1 ఆ 5 ప)

వ్రా ప్ర: నాసరిశేషపన్నగఫణచ్ఛటనం చొడబాటుమైఁ
బురిన్ –

ము. ప్ర: సాదన నేటుమ సాహసంబులన్ (1ఆ 10ప)

వ్రా. ప్ర : సాధన మేలన సాహసంబునన్ —

ము. ప్ర : క్రొన్ననవింటి నెఱజోదు(1 ఆ 11 ప)

వ్రా. ప్ర : క్రొన్ననవింటి నెఱవాది —

ము. ప్ర : కుపితనాథులఁ గూర్మిగొసరు జంకెననాట
(ఆ 15 ప)

వ్రా. ప్ర : కుటిల నాయకుల హృత్పుటలు
జంకెనవాట

ము ప్ర : 'వారకాంతామణుల మేలువార్తలెల్ల
వెన్నెల బయళ్ల గేలి గావించినగుచు.
(1 ఆ –16 ప)

వ్రా. ప్ర : వారకాంతామణుల మేలువైభవము
తెలుపుచును వెన్నెలబయళ్ల నెలపి నగుచు—

ము. ప్ర : 'ప్రతిజోదు సమిజ్జయంబునన్'
(1 ఆ 28 ప)

వ్రా. ప్ర: ప్రతివాది సమిజ్జయంబునన్ –

ము ప్ర: వర్ణనీయ హావభావ ధీవయః
(1 ఆ 32 ప)

వ్రా. ప్ర : ...........హావభావ భావయః —

ము. ప్ర : ధరాధిపోన్నతియు— (1 ఆ 34 ప)

వ్రా : ధరాధికోన్నతియు —

ము : 'విషమాస్త్రు గెల్చుబో—(1 ఆ 69 ప)

వ్రా: కుసుమాస్త్రు గెల్చుబో—

ము : దట్టంపుఁ దెలినీటి తరఁగచాల్కడకొత్తి
నెల తాల జగతిఁ దా నిలుచుటేమి?
కపురంపుఁ దావిఁ దాఁ గవియుటేమి?
చివురుజొంపపు మావి జీబు
నిద్దంపు టెసుముతిన్నియ సొన్పు దిగ్గదోచి
..............మఱుగువెట్టి
మిసిమి కెంపుల కాంతిఁ దా మెఱయుటేమి?
(1 ఆ 75 ప)

వా. ప్ర : తెలినీటి తటి చాల కడకొత్తి
నెలతాల జగిలిఁ దా నిలుచుటేమి?
కలపంపు దావిఁ దా బులియుటేమి?
చిగురుజొంపపుమావి జిగిని
నిద్దంపుటేనుక తిన్నియసొంపు దిగ్గదోచి

..............మఱుగుచేసి
మినుకుకెంపులమేడఁ దా మెఱయుటేమి?

ము ప్ర : మంపెసఁగన్ గటాక్ష లవ
మాత్రము చేతనె ముజ్జగంబు మో
............................
...........చన్నులమీద సుఖించు చుండు
(1 ఆ 81 ప)

వ్రా : ఇంపెసగన్ గటాక్ష లవ
మిచ్చుటచేతనె ముజ్జగంబు మో
............................
...........చన్నులమీద సుఖించుకొంచు—

ము : మేలుపసిండిగాజుల సమేళపుఁబచ్చల కీల్కడెంపు
డాకేలు— (1 ఆ 79 ప

వ్రా : మేలిపసిండిగాజులు పమేళపు కీలు కడేలు గల్గుడా
కేలు —

ము : నిను గీతి సాహితీ మో
హన వాణులు చెవులువట్టి యాడింపంగా
(1 ఆ 90 ప)

వ్రా : నినుగోరిన సాహస మో
హన గుణములు చెవులుపట్టి యాడించంగా—

ము : అల్లనఁ ద్రెళ్లగనేసి యేలుకో (1 ఆ 94 ప)

వ్రా : అట్లనె లీలగనేసి యేలుకో—

ము : ఆతని తెలిముద్దు కెమ్మొగము (1 ఆ 96 ప)

వ్రా : ఆతని తెలిముద్దు నెమ్మొగము—

ము : ప్ర: గెలిచిన మేలువార్తలుగగి (1 ఆ 98 ప)

వ్రా : గెలిచిన వార్తలప్పు డురగీ —

ము : ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడినుండి
తెచ్చె? (1 ఆ 102 ప)

వ్రా : ఈ కలహంసయాన నను ఎక్కడి కక్కడినుండి
తెచ్చె—

ము : కరభోరు బోరునన్— (1 ఆ 103 ప)

వ్రా : కరభోరు భోరునన్—

ము : ఆ వ్యాళకన్యక కెంగేల వొసంగి కైకొనియె
(1 ఆ 106 ప)

వ్రా : ఆ వ్యాళకన్యక కెంగేల వొసంగఁ గైకొనియె—

ము : చొకాటపుఁ దాళములే మొ? రూపమా
నంగననైన చెక్కిళులు నాగొపుటద్దములే మొ?
(1 ఆ 118 ప)

వ్రా : చొకాటపుఁ దాళములే మొ చూడనా
నంగనమించు చెక్కిళు లొయారపు టద్దము
లే మొ

ము : కలదీ కన్యయని చెప్పఁగావింటి నృపా!
(1 ఆ 136 ప)

వ్రా : కలిగిన కన్నెయని చెప్పఁగావింటి నృపా!—

ము : తమ్మికొలని కెలఁకులకుఁ జేరి—
(1 ఆ 138 ప)

వ్రా : తమ్మికొలఁకు కెలఁకులకు—

ము : సల్ప ససంభ్రమచిత్తుఁడై తగన్
(1 ఆ 153 ప)

వ్రా : సల్పిన నెంతయు సంభ్రమంబునన్—

ము : హాళాహాళిం గడకు నొత్తుచు పోఁజులదిక్కు
చూచుచున్ (1 ఆ 155 ప)

వ్రా : హాళాహాళిం గడకు నుండెడు పొరులదిక్కు
చూచుచున్—

ము : లాస్యరసాస్వాదనకోవిదా!
విభవభృత్తంజాపురీవల్లభా! (1 ఆ 160 ప)

వ్రా : లాస్యరసోత్పాదన కోవిదా!
శుభవిభా తంజాపురీ వల్లభా!

ముద్రిత ప్రతియందు 161, 162, 163 ఆశ్వాసాంత పద్యములు గలవు. వ్రాతప్రతిలో 161 యాచనకవినుత! అను పద్యముమాత్రము లేదు.

చివరి గద్యమునందు మార్పు గలదు—

## ద్వి తీ యా శ్వా స ము

ముద్రిత ప్రి : ఆవినన్ విహా మదిలోఁ దలంచినది. మేలొ
సిద్ధసంకల్ప లీ (2 ఆ 4 ప)

వ్రా: ప్ర: నీవు మదిలోఁ దలంచినటులే యా సిద్ధ
సంకల్పులే —

ము: దేవేరిగ నాకన్నెం
బావనగుణ నీయఁ గనుట భాగ్యము గాదే!
(2 ఆ 4 ప)

వ్రా: దేవిగ నా కన్యక నా
పావనగుణశీల నీయ భాగ్యము —

ము: తపం బొనరింప నంతటన్ గలుగు
కుమారు డొక్కొ కడుగా నని
యిచ్చె వరంబు వేడుకన్ (2 ఆ 7 ప)

వ్రా: తపం బొనరింప సంతతిన్
గలుగు కుమారు డొక్కరుండు
నా నియమించె వరంబు వేడుకన్ —

ము: నిండువేడుక మిన్నంది కొండఁదాకె
(2 ఆ 20 ప)

వ్రా: ............కొండఁ బ్రాకె —

ము. ప్ర: పూలు రేకెత్తినట్లునె' (2 ఆ 23 ప)

వ్రా: పూల చేరెత్తినట్లునె —

ము: ప్రాచుర్య మనోజకేళి భవనము (2 ఆ 25 ప)

వ్రా: ప్రాచుర్య మనోజ్ఞకేళి భవనము —

ము: ఇంచుక సేపులోన మెఱయించు (2 ఆ 27 ప)

వ్రా: ఇంచుక నేర్పులోలి మెఱయించు —

ము: పోకముడి యూడ్చినఁ గుంగిలి రెండు
కొంగులున్ (2 ఆ 30 ప)

వ్రా: ............ముంగలి రెండు కొంగులున్ —

ము: ఇందమని వేగ నీవి నీవియ్యకున్న (2 ఆ 31 ప)

వ్రా: ఇందమని నీవి నీవిఁక నీయకున్న —

ఈ పద్యము వ్రాతప్రతిలో పూర్వపరభాగములు క్రిందుమీదులుగా నున్నవి.

ము: అననైనదిగాదు గదయ్య క్రీడికిన్ (2 ఆ 34 ప)

వ్రా: అన నబ్బురమయ్యెఁ గదయ్య క్రీడికిన్ —

ము: సీమంతవతీమణికి సీ
మంతము చేసిరపుడు నెల లెనిమిదిగా
శ్రీమంతు కెక్క గర్భ
శ్రీమంతుం డితఁ డనుట సిద్ధముకాగన్
(2 ఆ 37 ప)

వ్రా: ...............
సీమంతము చేసిరపుడు చెలియలు వేడ్కన్
శ్రీమంతముగా నెంతయు
సామంతులు మెచ్చిచూడ శాశ్వతలీలన్ —

ము. ప్ర: ప్రొద్దుల నెలలన్ వేవుర
నుద్దులుగాఁ జేయఁగగు సహాయశములఁగా
ముద్దులబాలుఁ గనియెను
ప్రొద్దులనెల యెడల నిండుమఖి శుభవేళన్
(2 ఆ 38 ప)

వ్రా. ప్ర: ముద్దియలు తనదు సేవల
నొద్దికతోఁ జేయఁగా మహోదయలీలన్
ముద్దుల బాలుం గనియెన్
ప్రొద్దులనెలవెడల నిండుమఖి శుభవేళన్ —

ము: అలోలనయన ... 47 పద్యము; నడుమెంత సైకము...49 పద్యము లున్నవి. ఈ రెండును వ్రాతప్రతియందు లేవు —

ము: అని యూఁకీడి మనంబునన్ -- (2 ఆ 50 ప)

వ్రా: అని వేమాఱు మనంబునన్ —

ము: వారు లలిత, పద్మ, సౌరభేయి, సమీచి
(2 ఆ 52 ప)

వ్రా: వారు లలిత, నంద, సౌరభేయి, సమీచి —

ము: వీళ్ళు చూడ మనమేటికిఁ బోవలె?
తుళ్ళఁగనేల? (2 ఆ 59 ప)

వ్రా: వీళ్ళు చూడ నిపుడేటికిఁ బోతిమి?
తుళ్ళఁబనేమి —

ము: అధిక కుతుకాన్వితలై (2 ఆ 71 ప)

వ్రా: అతుల కుతుకాన్వితలై —

ము : ఇమ్మహాభుజా నిప్పుడో కొమ్మలార!
(2 ఆ 72 ప)

ప్రా : ఇమ్మహామహు నిప్పుడో —

ము : విధేయము లగుదురు యాదవులు? (2 ఆ 80 ప)

ప్రా : ..............యదువులనుచు —

ము : గోపాలనందనుండా గోపాలక చక్రవర్తి
(2 ఆ 83 ప)

ప్రా : గోపాలక నందునుం డా గోపాలక చక్రవర్తి

ము. ప్ర : సొన్నపు సన్నచేలం గటిం జుట్టి
(2 ఆ 84 ప)

ప్రా : సొన్నపు సన్నశాలు —

ము : తా నొనరించి యాత్మ యోషిన్నికరంబు
(2 ఆ 97 ప)

ప్రా : తామొనరించి మించి యోషిన్నికరంబు —

ము : యశోవత మాళికాభరణము (2 ఆ 99 ప)

ప్రా : యశోవత వమౌళికాభరణము —

ము : సీరియు నన్యోన్య సూక్తి సితమానసులై
(2 ఆ 117 ప)

ప్రా : సీరియు నన్యోన్య సూక్త్యుచితమానసులై —

ము : స్ఫురణంబులెల్ల నడంగంగాఁజేసి ధన్యాత్ములౌ
స్వాముల్ — (2 ఆ 122 ప)

ప్రా : ..............నడంగంగాఁజేయు ధన్యాత్ములౌ

ము : అంతఃపుర వన వంజుల కుంజ సంజవనమున —
(2 ఆ 123 ప)

ప్రా : అంతఃపుర వన మంజుల కుంజ పుంజ వనమున

ము: అందుండి మనసులోన ముకుందుం డీగతి నొనర్చు
(2 ఆ 129 ప)

ప్రా : అందుండి మనసు నెఱిఁగి ముకుందుం డీగతి నమర్చు —

ము : మేను పులకింనెం గిరీటికిం బూలొసంగి
(2 ఆ 134 ప)

ప్రా : మేను పులకింపఁ గిరీటికి బిరాలొసంగి

ము : భామమోమున.........చూచి
ముదిత...............తలంచి
.................ఎంచి (2 ఆ 136 ప)

ప్రా : ...................తలంచి
...................తలంచి
...................తలంచి—
అనియే కలదు.

ము : పట్టిన నొప్పక యిట్టటన్నచో
(2. ఆ 145 ప)

ప్రా: .................ఎట్లు పల్కునో? —

ము॥ద్రిత॥ప్రతి : 'ఒడలుప్పొంగు, అను పద్యము
(2 ఆ 149 ప)

ప్రా : ప్రతి : లేదు —

ము : ప్రతి : స్నానం బేమిటికి వే జప మేమిటికిన్?
(2 ఆ 150 ప)

ప్రా : స్నానం బేమిటికి సంధ్య జప మేమిటికిన్? —

ము : దొంతరలు డించి విషయము
మదికిం పొసగఁగ — (2 ఆ 152 ప)

ప్రా : ..............వినయము మదికిం పొసంగఁగ —

ము : భుజమూలరుచుల్ జెలుఁగుం బయంటలో
గులుకుమిటారి గబ్బిచనుగుబ్బలు
(2 ఆ 153 ప)

ప్రా : భుజమూలరుచుల్ చెలఁగంగఁ బైటలోఁ
గులుకునొయారి గబ్బి...........

ము : తృప్తి యేరీతినుండెనో తెలియరాదు
(2 ఆ 154 ప)

ప్రా : తృప్తి నేరీతిఁ బొందెనో తెలియరాదు —

ము : చంద్రకాంతపు జగలి పఱన్కై (2 ఆ 156 ప)

ప్రా : చంద్రకాంతపు జగిలె పయిన్ —

ము : తన చేసిన సేవకుంగా
మన మలరి వచించిరనుచు — (2 ఆ 160 ప)

ప్రా : మనమున దీవించిరనుచు —

ము : ననుఁ జూచి యెఱుఁగ వీవును విప్రుడీ—
(2 ఆ 181 ప)

వ్రా : నమఁ జూచి యెఱుఁగ వీవటులయ్యున్ —

ము : నీవేల బంపు నడపెదు? (2 ఆ 189 ప)

వ్రా : నీవేం నిజము నడిపెదు? —

ము : తుమ్మెదల దిమ్మిచటన్ (2 ఆ 197 ప)

వ్రా : తుమ్మెదల దలమిచటన్ —

ము : ప్రతి : అకటా! మేడపయికేఁగు నపుడైన జెలీ! (2 ఆ 199 ప)

వ్రా : అకటా! పై మేడకేఁగ నపుడైనః జెలీ! —

## తృతీయాశ్వాసము

ము : ప్ర : చక్కెరకెంపుమోవి (3 ఆ 7 ప)

వ్రా : లేదు —

12, 13 పద్యములును లేవు —

ము : ఘనోదయవేళఁ దెలిసియుఁ దానేల వలచినాడు (3 ఆ 17 ప)

వ్రా : ............తెలియకేమిటికిఁ దావలచి —

ము : నృపాలతిలకుఁ జేర్పంగ నెన్నఁడు— (3 ఆ 23 ప)

వ్రా : ......తిలకునెన్నఁడు చూడంగఁగలుగునొక్కొ? —

ము : బిస కిసల కుసుమ విసరము (3 ఆ 37 ప)

వ్రా : బిస కిసలయ సుమరసములు —

ము : హారావళుల్ చన్నుంగ్రేవల—(3 ఆ 38 ప)

వ్రా: తారావళుల్ చన్నుంగ్రేవల—

ము : సకి కెందలిరుదిండులకు వందన మొనర్చి (3 ఆ 39 ప)

వ్రా : సకికెందలిరువిందులకు వందన......... —

ము : పూజపేసిన యగ్గజరాజమనగ — (3 ఆ 40 ప)

వ్రా : పూజచేసిన యట్టి యాతేజి యనఁగ —

ము : చన్మెఱుఁగుటందపు మేలి పసిండి కుండలన్ (3 ఆ 41 ప)

వ్రా : చన్మెఱుఁగు టద్దపుకాక పసిండి కుడంలన్ —

ము : ప్ర : యదువృష్ణిభోజకులజులు(3 ఆ 73 ప)

వ్రా : యదువృష్ణి భోజ కుకురులు —

ము : పెట్టిరి మేనుల న్నలుఁగు మేలిమృగీమద కుంకుమంబులన్ (3 ఆ 76 ప)

వ్రా : పెట్టిరి ఫాలదేశములఁ ప్రేమ మెలర్పఁగఁ గుంకుమంబులన్ —

ము : సువర్ణకోటనుకోటీరముఖ్య- (3 ఆ 100 ప)

వ్రా : సువర్ణస్మేరకోటీరముఖ్య —

ము : భోజావనిజానిజానిజగృహాంగణ— (3 ఆ 104 ప)

వ్రా : భోజావనిజానిజామణిగృహాంగణ—

ము : అని కవుల్ దంపతుల వెల్వ— (3 ఆ 108 ప)

వ్రా : అని జనుల్..............

ము : రమణీమణి ముఖముఁ దెఱచిరాజనవలయున్ (3 ఆ 114 ప)

వ్రా : రమణీమణి ముఖముఁ జూచె రాజకులుండున్—

ము : అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి ప్రియ వధూటియును దాను బంగారుపీటమీఁద (3 ఆ 117 ప)

వ్రా : అగ్ని సాక్షిగ నుద్వాహమైనయట్టి ప్రియుఃధూటియుఁ దాఁ బెండ్లిపీటమీఁద—

ము : నీలమణి పొంత నుదిరి పాన్రేకువోలె (3 ఆ 118 ప)

వ్రా : ............బంగారునీరువోలె—

ము : 127, 128 పద్యములు 'అని సరసలీల'—చెల్లెల లెస్సలా' అని కలవు.

వ్రా : 127, 128 పద్యములు లేవు—

ము : శతాంగ పత్తి బలపర్వంబుల్, సర్వజనానందకరంబుగాగనటు— (3 ఆ 174 ప)

వ్రా : శతాంగవీరభటవర్గంబుల్,
సర్వజనానందకరప్రయాణముల—

ము. ప్ర : మెఱయ న్నగరిం గయిసేయఁబంచి
యత్యంత వినీతి (3 ఆ 175 ప)

వ్రా : మెఱయంగఁ బురిం గయిసేయఁబంచి
యత్యంత విభూతి—

ము : చెలువం దెచ్చుచునుండి యాసున శునా
సీరాత్మజుం డమ్మహా
బలముం జేరఁగ బోరుమేదురదురాప
క్రోధముంబాసి ( 3 ఆ 176 ప)

వ్రా : చెలువం దెచ్చిన యాసు దల్పక శునా
సీరాత్మజుం డమ్మహా
బలు జేరఁగను దేరుద్రోలిన
దురాపక్రోధముం బాసి—

ము : కేవల భక్తితో నదటఁ గేలివనంబున—
(3 ఆ 204 ప)

వ్రా : కేవల భక్తిలో మునుపు కేళి.........

ము : నృపాలునకు మోహముఁ గోర్కులు నెమ్మ
నమ్మనన్ (3 ఆ 210 ప)

వ్రా : .........మోహపుఁ గోర్కులు నెమ్మనమ్మనన్—

ము : నెఱికొప్పుఁ గొనగోర నిమిరిన యంతనే—
(3 ఆ 222 ప)

వ్రా : నెఱికప్పు నునుగొప్పు నిమిరిన యంతనే—

ము : తరులు సమమయ్యెఁ జిట్టుముల్ దఱుమసీఱె
(3 ఆ 228 ప)

వ్రా : వళులు సమమయ్యెఁ జిట్టుముల్ వరుసవిాఱె

ము : కులదీపంబగునట్టి పట్టిఁగనె
దిక్కుల్ దెల్పిఁ బెంపెక్కఁగన్
(3 ఆ 229 ప)

వ్రా : కులదీపంబగునట్టి పట్టిఁ గనియెన్
గోర్కుల్ మదిం జెకురన్—

ఈ విధంగా విజయ విలాస గ్రంథమునంతయు సమీక్ష చేసినపుడు నాకు లభించిన పాత్రవ్రాతప్రతిలోని పాఠభేదములు వివరించి పండితలోకమునకు తెలుపుట సముచితమని ప్రకటించుచున్నాము. దీనిలోని మేలు పాఠములు ఎంతవరకు అనుసరణీయములో విమర్శించి ఇంకను మిగిలిన పాఠాంతరములున్న తెలియజేయగలరని విజ్ఞులకు మనవి చేయుచున్నాను.

---



# సుభాషిత రత్నకోశం

డా. చట్టా లక్ష్మీకాంతం

సుభాషిత రత్నకోశ మనే సంకలన గ్రంథాన్ని 1957 సం. లో డీ. డీ. కోశాంబి, వి. వీ గోఖలే గార్లు, 'హార్వర్డ్ విశ్వవిద్యాలయ ప్రాచ్యగ్రంథావళి శీర్షిక' కింద ప్రకటించారు[1] ఈ గ్రంథాన్ని సంకలనం చేసినవాడు విద్యాకరుడనే బౌద్ధుడు. ఇందులో పూర్వ సంస్కృత కవులవి, మరెక్కడా కనబడనివి, ఎన్నో శ్లోకాలు వున్నాయి. ఇదే సంస్కృత సంకలన గ్రంథాల్లో మొదటిది కాబట్టి దీనికెంతో విలువ కట్టారు పరిశోధకులు.

ఈ గ్రంథంలోని పద్యాలను ఇంగ్లీషులో పద్యరూపేణ తర్జుమాచేసి 'Sanskrit Court Poetry' అనే పేరుతో హార్వర్డ్ ప్రాచ్యగ్రంథావళి సంపాదకుడూ, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృత విభాగాధ్యక్షుడూ అయిన ప్రొ॥ డానియల్ ఇంగల్స్ మహోదయులు 1963 సం॥ లో ప్రకటించారు.[2]

ఈ వ్యాసంలో ఈ గ్రంథం గురించీ, తత్సంకలనకర్తను గురించీ, కోశాంబి గోఖలేల సంస్కరణం గురించీ ప్రస్తావింపబడుతుంది. ఈ వ్యాసానికి పైన చెప్పిన కోశాంబి సంస్కరణంలోని ఉపోద్ఘాతమూ, ఇంగల్సుగారి ఉపోద్ఘాతమూ ఆధారాలు.

## కోశాంబి—గోఖలేల సంస్కరణ

రాహుల సాంకృత్యాయన పండితుడు 1937 లో టిబెట్టు (త్రివిష్టప)దేశంలో అప్రచురిత సంస్కృత తాళపత్ర గ్రంథాల కోసం వెతుకుతూ 'ఎన్గర్' మఠంలో కొన్నిప్రతులను చూసి, వాటిని ఫోటోతీసి, వాటిని పాట్నామ్యూజియంకు పంపారు; తరువాత వాటినిగురించి బీహారుప్రాచ్యసంశోధన పరిషత్పత్రికలో ప్రచురించారు.

ఈ ప్రతుల సంపుటిలో 'సుభాషిత రత్నకోశః-భీమార్జున సోమస్య' అనే సూచనతో ఒక ప్రతి కనబడింది. ఈ భీ. సో. ప్రతియొక్క ఫోటో నెగెటివులను పరిశోధింపగా, అందులోని మొదటి శ్లోకము అదివరకే 'కవీంద్ర వచన సముచ్చయ' మనుపేరిట థామస్ పండితునిచే[3] ప్రకటించబడిన గ్రంథంలోని ఆద్యశ్లోకంతో సరిపోయింది. దీనిని బట్టీ లిపిపరిశోధనద్వారానూ భీ. సో. ప్రతియే కవీంద్రవచనసముచ్చయం యొక్క మాతృక అనే నిశ్చయానికి వచ్చారు కోసంబీ, గోఖలేలు. ఇదీకాక భీ. సో. ప్రతిలో క. వ స. లో కన్నా మూడింతలు శ్లోకాలున్నాయి కాబట్టి క. వ. స.ను కేవలం ఒక్క ఖండికగా గణించారు. ఇక భీ. సో. ప్రతిని పరిష్కరించి ప్రకటించడానికి పూనుకున్నారు కూడాను.

రాహుల్ సాంకృత్యాయనుల ఫోటో ప్రతులనుండి చదవటం కష్టతరంగా వున్నందున విఫలులై దాదాపు ప్రచురణను మానుకొన్నంత పనిచేశారు. ఇంతలో ఇదే భీ. సో ప్రతి నకలు ఒక్కటి నేపాల రాజగురు లైబ్రరీలో వున్నట్టు తెలియరాగా, అక్కడికి వ్రాశారు. నేపాలు నుండి సు. ర. కోశ మనే గ్రన్థం విద్యాకరుడనే వాని పేరిట (సంకలనత్వంకింద) వున్నట్టు తెలిసింది.

---

1. Subhashita Ratna kosha. Ed. by D. D. Kosambi & V. V Gokhale. Harvard Oriental Series-No. 42. Harvard University Press. Cambridge, Mass. U. S. A. 1957.

2 Sanskrit Court Poetry by Daniel H. H. Ingalls, Harvard Oriental Series. No. 44, Harvard University Press, Cambridge, Mass-1963.

3. 'కవీంద్ర వచన సముచ్చయః'. Bibliotheca Indica, New Series No. 1309 Calcutta, 1912. Ed. by F. W. Thomas.

నేపాల రాజ్యాంగంతో ఎంతో సంప్రతింపులు జరిపాక, ఆ విద్యాకరుని ప్రతియొక్క ఫోటో కాపీలను తెప్పించుకోగలిగారు. ఆ ఫోటోలతో రాహుల సాంకృత్యాయనుల ఫోటోను సరిపోల్చాక విద్యాకరుడే గ్రన్థ (సంకలన) కర్త అనీ, భీమార్జున సోమస్య-అనే వాక్యం కేవలం గ్రన్థాధిపత్యాన్నే సూచిస్తోందనీ తేల్చారు.

రాహుల్ సాంకృత్యాయనుల ఫోటోప్రతితోనూ, రాజగురు ఫోటోప్రతితోనూ, ముద్రిత కవీంద్ర వచన సముచ్చయంతోనూ, సుభాషితరత్నకోశాన్ని ఎంతో నైపుణ్యంతోనూ, ఓర్పుతోనూ పరిష్కరించి ప్రకటించారు కోశాంబీ గోఖలేలు. గ్రంథంలోని ఉపోద్ఘాతం చదువుతూంటేనే కోశాంబిగారి పరిశోధనాకౌశల్యం, సంస్కృతభాషాజ్ఞానం, భారతీయ సంస్కృతి పరిశోధనలలో గల ప్రావీణ్యం అవగతం అవుతాయి.

ఆబాల్యం అమెరికాలో విద్యాభ్యాసం కావించి, హార్వర్డు విశ్వవిద్యాలయంలో మహాప్రశస్తంగా (Summa Cum laude తో) పట్టభద్రుడై, గణితశాస్త్రంలో అంతర్జాతీయ కీర్తి నార్జించి, టాటా ఇన్స్టిట్యూట్‌లో ప్రొఫెసర్‌గా వుంటూ, సంస్కృత భాషాభిమానియై, సంస్కృత కావ్యాలను చక్కగా పరిష్కరించి ప్రకటిస్తూన్న దామోదర ధర్మానంద కోశాంబి మహాశయుడు గడచిన (1968) జూన్‌లో మరణించారంటే, విధిని దూషించడం కంటే మనం చేసేదేముంది?

## విద్యాకరుని దేశకాలాలు

ఈ విద్యాకరుఁడు క్రీ. శ 1050 ప్రాంతంలో ప్రస్తుతం పాకిస్తానుకుచెందిన తూర్పు బెంగాలులో మాల్దాకు ఉత్తరంగా 'జగద్దల'అనే గ్రామంలోని మహావిహారంలో ఆచార్యుడని పేరు నిశ్చయింప కలిగారు.

ఇతని దేశకాలాల నిర్ణయానికి సు. ర. కో. లోని అంతరంగప్రమాణాలే ఆధారాలు. కాలగణనలో పరిధుల్ని నిరూపించడానికి, ముఖ్యంగా రెండు ఆధారాలు కనుపిస్తాయి ఒకటి, ఔచిత్య విచార చర్చ, అవదానకల్పలత మొదలైన కావ్యాలెన్నో రచించిన క్షేమేంద్రుని రచనలలోనుండి మచ్చుకైనా ఒక శ్లోకం గ్రంథంలో కనపడకపోవడం; రెండు, ధారానగరేశ్వరుడైన ప్రతీహార భోజుని శ్లోకాలు గ్రంథంలో కనపడడం. వీటినిబట్టి సు. ర. కో. యొక్క ఆవిర్భావం వారిద్దరికాలాలమధ్య జరిగి వుంటుందని ఊహించవచ్చునన్నారు కోశాంబిగారు. ఇక విద్యాకరుని దేశాన్ని గురించి తర్కిస్తూ, సు. ర. కో. ఒక బౌద్ధగ్రన్థంగా కనుపించినా, బుద్ధుని ప్రశంసతోబాటు హరిహరాదుల ప్రశంస కూడా హెచ్చుగా వున్నందున ఇది ఒక 'విశేష'బౌద్ధ గ్రన్థమనీ, మరి ఆ కాలంలో బౌద్ధులవుతూ వైదిక మతవిద్వేషులు కానట్టి రాజ్యాంగం కేవలం ఈశాన్య భారతంలో బీహారు, బెంగాలులకు ఉత్తరంగా, (నేపాలు టిబెట్టులకు దగ్గరగా) రాజ్యము వహించిన మహా (మహీ) పాలవంశమువారిదే కాబట్టి, దానికి చెందిన వాఁడే విద్యాకరుడని నిర్ధరించారు

విద్యాకరుడు స్వతఃకవియా అనే విషయం నిర్ధరించడం కష్టం సంకలనగ్రన్థంలో ఆద్యంత శ్లోకాలే అతని పేరిట వున్నాయి. కాని సంస్కృత భాషాభిమాని, సాహిత్యపిపాసువునే విషయం నిర్వివాదాంశం.

## సుభాషిత రత్నకోశ పరిచయం

సు ర కో. లో 1500 కి పైగా శ్లోకాలు వున్నాయి భాస కాళిదాస రాజశేఖరులవంటి ప్రఖ్యాత కవుల శ్లోకాలతో బాటుగా, ప్రాచ్య సీమకు చెందిన బౌద్ధకవులవి ఎన్నో శ్లోకాలు వున్నాయి వీటినన్నీ యాభైకిపైగా 'వ్రజ్య' అనే భాగాలలో విభజించి సమకూర్చాడు విద్యాకరుడు. మొదటి మూడు వ్రజ్యాలలో బుద్ధుడు, లోకేశ్వరుడు, మంజుఘోషుడు (ఈ ఇద్దరూ బోధిసత్త్వులు) క్రమంగా ప్రశంసింపబడ్డారు. తరువాత శివ విష్ణువులు వారి వర్గములు, సూర్యచంద్రులు వరుసగా ప్రశంసింపబడ్డారు. అటుతరువాత ఆరు వ్రజ్యాలలో షడృతువులు వర్ణింపబడ్డాయి ఈ ఋతువర్ణన వ్రజ్యలాదిగాగల భాగంలోనే గ్రంథంలోని బహురసవత్తరములైన శ్లోకాలు వున్నాయి. భావుకత, చమత్కారం, వాస్తవికత అన్నీ ఉట్టిపడతాయి వీటిలో.

సాధారణంగా ప్రాచీన సంస్కృత కవుల రచనలలో సామాన్య జనుల (గ్రామీణ జనుల) జీవితం ప్రతిబింబం అరుదే దీనికెన్నో బలమైన కారణాలున్నా, తీరా మిగిలే నిజమేమో వాస్తవిక గ్రామీణ జగత్తు వాళ్ళ జీవితలో మృగ్యమనేదే. ఇది ఇలా వుండగా, ఈ సు. ర. కో. లో ఎన్నోచోట్ల సామాన్య గ్రామీణ జనుల జీవితాలు, అక్కడి వేడుకలు, ముచ్చట్లు, కష్టాలు, హృదయాన్ని తాకేటట్లుగా వర్ణించబడ్డాయి.

వీటికి ఉదాహరణంగా కొన్ని శ్లోకాలను దిగువ ఉదాహరిస్తాను.

ఈ శ్లోకం శిశిరవ్రజ్యలో యోగేశ్వరునిది :

ఇదానీ మర్ఘంతి ప్రథమ
కలమచ్ఛేదముదితా
నవాగ్రా న్నస్థాలీ పరిమల
ముచో హాలికగృహాః
ఉదంచద్దోర్వల్లీ రణిత
వలయాభి ర్యువతిభిః
గ్రహీత ప్రోత్క్షిప్త భ్రమిత
మసృణోద్గీర్ణ ముసలాః

కొత్తగా పండిన ధాన్యంతో (కొత్త బియ్యంతో) వండిన అన్నపు కమ్మని వాసనలు రైతుల ఇండ్లనుండి పైకి వస్తున్నాయి. రోకటి పోట్లతో (వడ్లు దంపు డప్పుడు) సమానంగా స్త్రీల గాజుల చప్పుడు వినిపిస్తోంది ఈ వర్ణన ఎంత సహజంగా, గ్రామాల్లో మాఘమాసమప్పుడు నేటికీ కనుపించేవిధంగా వుందో మరి చెప్పనక్కరలేదు

వర్షాకాలంలో పొలాలదగ్గర పిల్లవాగుల్లో ఆడుతూ అడుసును తొక్కుతూ చేపల్ని పట్టడానికి ప్రయత్నించే ఈ కుర్రవాళ్ళ వర్ణన ప్రావృడ్ వ్రజ్య లోనిది : శ్లో. 226.

కేదారే నవవారిపూర్ణ జఠరే
కించిత్ క్వణద్దర్దురే
శంబూకాండక పిండ పాండుర తలా
ప్రాంత స్థలీ శీరణే
డింభా దండక పాణయః ప్రతిదిశం
పంకచ్ఛటా చర్చితాః
చంక్రమ్యంతి రితి భ్రమన్తి రభసా
దుద్యాయి మత్స్యార్థినః.

ఆహ్లాదకరమైన దృశ్యాలతో సమానంగా, పేదరికం, దైన్యం, జమీందారుల దారుణ్యం, ఇలాటి వాటిని వర్ణించే శ్లోకాలూ వున్నాయి. చదువుతూ వుంటే నేటికీ మనస్సును కలచివేస్తాయి. ఉదాహరణంగా జాతివ్రజ్యలో శ్లో. 1175.

ఒక జమీందారుని దౌర్జన్యానికి తట్టుకోలేక ఒక గ్రామంలో చాలాభాగం తమ ఇండ్లను, వాకిళ్లను వదలి పై దేశాలకు వెళ్లిపోయారు. (జప్తీలు చేయించాడేమో?). మిగిలిన కొందరు పూర్వీకమైన ఇళ్లను, పొలాలను వదులుకోలేక శిథిలావస్థలో వుంటున్నారు. పాడుపడిన ఇళ్లలో స్వేచ్ఛగా ముంగిసలు (పురుగూపుట్రా) తిరుగుతున్నాయి. చెదిరిపోయిన ఉద్యానాల్లో అక్కడక్కడా పావురాళ్ల గునగునలు వినిపిస్తే గ్రామంలో మిగిలినవాళ్లకు సంతోషంకంటే ఆవేదనే ఎక్కువగా కలుగుతోంది.

కైశ్చిద్ధీతదయేన భోగపతినా
నిష్కారణోపప్లుత
ప్రక్షీణైర్నిజవంశభూరితి మితై
రత్యజ్యమానాః కులైః
గ్రామా నిస్తృణ జీర్ణ కుడ్య బహులాః
స్వైరం భ్రమద్బభ్రవః
ప్రాయః పాండు కపోత కంఠ ముఖరా
రామే నయాన్త్యక్లాంతతాం,

ఇక దీనవ్రజ్యలో శ్లో. (1320)

ప్రాయో దరిద్ర శిశవః పర మందిరాణాం
ద్వారేషు దత్తకరపల్లవ లీనదేహా

లజ్జానిగూఢ వచసో బత! భోక్తుకామా
భోక్తార మర్థనయనేన విలోకయంతి

ఆకలి బాధతో పేదపిల్లలు సిగ్గుతో కుంగుతూ మాట్లాడకుండా పొరుగింటి (కలవారింటి) దగ్గర నిలబడి లోపల భోంచేస్తూన్న వాళ్ళని ఆశతోచూస్తూన్న ఈ దృశ్యం ఈ నాటికీ మన భారతదేశంతో వాస్తవికమేకదా?

ఇలా ఎన్నోప్రశస్తములైన శ్లోకాలు వున్నాయి ఈ గ్రంథంలో.

ఇక ఈ వ్యాసాన్ని ముగించేముందు కోశాంబి గోఖలేగార్ల పరిష్కరణ ప్రాశస్త్యాన్ని గురించి రెండు మాటలు చెప్పాలి.

విద్యాకరునిప్రతి లోని శ్లోకాలకూ మరో చోట ముద్రితమైన శ్లోకాలకూ కొంత తేడా వుంది. కాని కోశాంబి గోఖలేలు ప్రసిద్ధమైన శ్లోకాలనుకూడా కళాదృష్టితోచూస్తూ ఎక్కడ విద్యాకరుని ప్రతిలో రసనిష్యందము ఎక్కువగా కనుపిస్తే, ఆ పాఠాన్నే ప్రతిపాదిస్తూ, తదితరాలను పాఠాంతరం కింద గణించారు. దీనికి ఉదాహరణంగా మానినీవ్రజ్యలోని శ్లో. (697) చూడతగింది.

గతే ప్రేమాబంధే హృదయ
బహుమానే విగళితే
నివృత్తే సద్భావే జన ఇవ
జనే గచ్ఛతి పురః
తదుత్ప్రేక్ష్యోత్ప్రేక్ష్య ప్రియసఖి!
గతాస్తే చ దివసా
సజానే కో హేతుః స్ఫుటతి
శతధాయన్నహృదయః.

ఈ శ్లోకం అమరుశతకంలో కనిపిస్తుంది. సహృదయులకు సుపరిచితమైనది కాని అమరుశతకంలో '...ప్రియసఖి! గతాంస్తాంశ్చ దివసాన్' అని పాఠం. థామస్ పండితుడు కవీంద్ర వచన సముచ్చయంలో విద్యాకరుని పాఠాన్ని, అమరుశతకం లోని పాఠానికి మార్చాడు. కాని కోశాంబి గోఖలేలు విద్యాకరుని పాఠాన్నే యథాతథంగా వుంచారు. శ్లోకంలో, ప్రేయసల్లాపాలు జరిపి ఇప్పుడా బంధం తొలగిపోయిందంటూ అపరిచితుడులాగా తనముందు మెలగుతూన్న ధూర్తనాయకుని గురించిన మనోవేదనను వెళ్ళబోసుకుంటూన్న నాయిక 'వీటిని గురించి తలస్తూ (బరువుగా) రోజులు గడచిపోతున్నాయి, పాడు హృదయం ఎందుకు పగలదో తెలియటంలేదు' అనే విద్యాకరుని పాఠంలో ఎంత విషాదం, Pathos, ఉందో.

'గడచిన ఆ రోజులను తలస్తూ...' అనే అమరు శతకపు పాఠంలో అంత వేదనటం సహృదయులు ఒప్పుకొనే తీరాలి.

ఇలా ఎన్నోచోట్ల కోశాంబి గోఖలేల శ్లోక సంస్కరణం సహృదయుల నానందింపచేస్తుంది. దీన్ని గురించి ఇంగల్సుగారు తమ ఉపోద్ఘాతంలో సుదీర్ఘంగా చర్చిస్తూ ఇంకో తియ్యటి ఉదాహరణాన్ని చూపించారు: విరహిణీవ్రజ్యలో శ్లో. (728)

ఆదృష్టే ప్రసరాత్ప్రియస్య పదవీ
ముద్వీక్ష్య నిర్విణ్ణయా
విశ్రాన్తేషు పథిష్వహః పరిణతే
ధ్వాన్తే సముత్సర్పతి
దత్త్వైకం స సుధాగృహంప్రతి పదం
పాన్థస్త్రియాస్మిన్ క్షణే
నాభూదాగత ఇత్యమన్దవలితో
గ్రీవం పునర్వీక్షితం.

ఈ శ్లోకం అమరుశతకంలో, సదుక్తి కర్ణామృతాదులైన సంకలన గ్రంథాలలో కనుపిస్తుంది. కాని ఆ పాఠాలన్నిట్లోనూ '. సశుచాగృహంప్రతి...' అని వుంది. ఈ పాఠంలోనే సున్నంవేయించిన ఇంటి వైపుఅనే అర్థమిచ్చే '...ససుధాగృహంప్రతి ..' అని వుంది. దీన్నిగురించి తర్కిస్తూ, తన భర్త (చాలా కాలం ఎడబాటుతరవాత) ఇంటికి వస్తున్నాడనే ఆశతో ఇంటికి సున్నంవేయించి, భార్య అతనికోసరం ఎదురుచూస్తూవున్నదనే భావం భారతస్త్రీలపట్ల ఎంతో సహజసిద్ధమని ఇంగల్సుగారంటూ, దీనికి ఉదాహరణంగా ప్రేంచంద్ నవల 'మాం'లో ఖైదు నుండి కథానాయకుడు (స్వాతంత్ర్యోద్యమమప్పుడు) విడుదలై వస్తున్నాడంటూ అతని భార్య ఇంటికి సున్నంవేయించి రెడీగావుంచి అతనికోసం ఎదురు చూస్తూన్న కథాంశాన్ని జ్ఞాపకం చేశారు.

ఇలా ఎంతో నైపుణ్యంతో సంస్కరింపబడిన ఈ సు. ర కో పండితులకే కాకుండా సహృదయులందరికీ ఆనందదాయకమవుతూ అందరి ఆదరమూ పొందుతుందని ఆశిస్తాను

## కలగూరగంప:

# మంత్రి భాస్కరుడు భాస్కరరామాయణమును రచించెనా?

ఆంధ్రమహాభారతములోని 15 పర్వములు నిర్వచనోత్తరరామాయణము మొదలైన గ్రంథములు రచించిన తిక్కన సోమయాజికి మంత్రి భాస్కరుడు పితామహుడు. అతని పేర భాస్కర రామాయణమను నొక పద్యకావ్యము ప్రచారములో నున్నది. కాని దాని అవతారిక దొరకలేదు అందువలన దాని కర్తృత్వము, కాలము ఎక్కువగ నూహాగానములవిూద నాధారపడి, తలాతోకలేని వివాదమునకు దారి తీసినది.

మూలఘటిక కేతన తన దశకుమార చరిత్రలో నిచ్చిన తిక్కన సోమయాజి వంశక్రమము క్లుప్తముగా నిట్లుండెను.




పై వంశవృక్షమునుబట్టి తిక్కన తాత భాస్కరుడు. కేతన తన దశకుమారచరిత్ర అవతారికలో భాస్కరమంత్రినిగూర్చి

శా॥ శాపానుగ్రహ శక్తియుక్తు
డమలాచారుండు
సాహిత్యవిద్యాపారీణుడు
ధర్మమార్గ పథికుం
డర్థార్థి లోకావన
వ్యాపారవ్రతుడంచు జెప్ప
సుజన వ్రాతంబు
గౌరీపతి శ్రీ పాద ప్రవణాంతరంగు
విబుధశ్రేయస్కరున్ భాస్కరున్.
(దశకుమార చరిత్ర-1-32.).

అని వర్ణించినాడు తిక్కన తన నిర్వచనోత్తర రామాయణములో తన తాతనుగూర్చి

'సార కవితాభిరాము గుంటూరు విభుని
మంత్రి భాస్కరు మత్పితామహుని దలచి
యైన మన్ననమెయి లోక మాదరించు
వేర నా కృతిగుణములు వేయునేల'
(నిర్వ:రామా 1-12)

అనిచెప్పి వినయవిధేయతలతో తన గౌరవమును జూపినాడు. వీనిలో కేతన, తిక్కనలు భాస్కర మంత్రినిగూర్చి ఏమి చెప్పారో చూడండి. కేతన చెప్పినది

1 ఆర్య శిరోమణి (1-30 వ పద్యము)
2. శాపానుగ్రహశక్తియుక్తుడు
3. అమలాచారుడు
4. సాహిత్యవిద్యాపారీణుడు
5. ధర్మమార్గ పథికుండు
6. అర్థార్థిలోకావనవ్యాపార వ్రతుండు

7. గౌరీపతి శ్రీపాద ప్రవణాంతరంగుడు
8. విబుధశ్రేయస్కరుడు.

పై వాటిలో ఏ ఒక్కలక్షణముగూడా భాస్కర మంత్రి కవి యనిగాని కావ్యకర్త యనిగాని తెల్పుట లేదు. అదియునుగాక 2 నుండి 6వ లక్షణమువరకు అవి సుజనుల అభిప్రాయమనిగూడ చెప్పెను. అంటే ఆ కాలపు ప్రజలలోగూడ భాస్కరమంత్రి ఒక గొప్పకవియనిగాని గ్రంథకర్తయనిగాని ప్రచారములో లేదని స్పష్టము

ఇక తిక్కన తన తాతను మంత్రి భాస్కరుడని మాత్రమే సంబోధించి అతని గొప్పను దలచి యైనను తన నాదరించమని దివ్యలోకమున కొక నమస్కార బాణమును వదలినాడు

ఈ మంత్రి భాస్కరుని కాలము క్రీ. శ. 1190 – 1220 ప్రాంతము

తిక్కన పైన చూపిన పద్యములో తన తాత గుంటూరు విభుడని చెప్పెను. అందువల్ల మంత్రి భాస్కరుడు గుంటూరుప్రాంతమువాడు కాని నెల్లూరు నివాసి ఎంతమాత్రము కాడనుట స్పష్టము. అంటే తిక్కనతండ్రి కేతన కాలములో వీరు నెల్లూరు వలసపోయివుందురు. మంత్రి భాస్కరుని కాలములో గుంటూరుప్రాంతము వెలనాటి చోడుల పరిపాలనక్రింద నున్నది ఆ కాలములో మంత్రి భాస్కరుని కుటుంబమువారు ప్రసిద్ధికెక్కి మంత్రులుగ, దండనాయకులుగ కీర్తి గాంచియుందురు, అయితే నెల్లూరుప్రాంతపు రాజ్యపాలకుడును, తిక్కన సోమయాజిచే నిర్వచనోత్తరరామాయణము సంకితము బొందిన మనుమసిద్ధి తండ్రియగు చోడ తిక్కరాజు కమ్మనాటి దండయాత్రా ఫలితముగ వెలనాటిచోడుల రాజ్యము మాసిపోయినది అందువలన తిక్కన సోమయాజితండ్రి కేతనకాలములో నీ కుటుంబము నెల్లూరునకు వలసపోయినట్లు కన్పట్టును. అట్లు నెల్లూరుపోయి నెల్లూరు చోడుల ప్రాపకము సంపాదించినతర్వాత తిక్కన కాలములో లభినవదండి బిరుదాంకితుడైన కేతన, వేంగీ కమ్మరాష్ట్ర ప్రాంతములలో కవుల నాదరించు ప్రభువులులేక, తిక్కన కుటుంబము నాశ్రయించుటకు నెల్లూరు జేరెను. గుంటూరుప్రాంతమువాడై కవులలో మొదటి శ్రేణికి జెందిన కేతన గుంటూరు నివాసియైన మంత్రి భాస్కరుడు రచించిన రామాయణమువంటి మహాగ్రంథముయొక్క యునికి తెలుసుకొనలేకుండడము మన ఊహ కందని విషయము నిజముగా మంత్రి భాస్కరుడు రామాయణము రచించియుండిన దాని ప్రతులు లేఖకులు వ్రాసుకొని ప్రచారములోనున్నయెడల కేతన తాను నెల్లూరు చేరకముందే దానిని చదివి ఉండవలయును. తనదాత తాత గొప్పకవియని తెలిసిగూడ తిక్కన కుటుంబ విషయములోను, అయిన దాయాదుల కుటుంబముల విషయములోను ఎన్నో వివరములు గ్రంథస్థము జేసిన కేతన ఆ విషయము జెప్పక పోవుట, మంత్రి భాస్కరుడు రామాయణమును వ్రాసినట్లు ఆ కాలపు ప్రసిద్ధకవులగు తిక్కన, మారన, మంచనలలో ఏ ఒక్కరుగూడ పూర్వకవిస్తుతులలో భాస్కరుని రామాయణ కర్తగా స్మరించకపోవుట మొదలైన కారణములు జూడ మంత్రి భాస్కరుడు తిక్కనతాత మాత్రమేగాని రామాయణకర్త కాడనవచ్చును. ఈ కారణములేగాక ఇంకొక బలవత్కారణమువలన గూడ మంత్రి భాస్కరుడు రామాయణకర్త కాడని చెప్పవచ్చును

తిక్కనకాలము ననుసరించి వెనుకకు లెక్క కట్టిన మంత్రి భాస్కరుని కాలము క్రీ. శ. 1180 – 1220 ప్రాంతమగును. అయితే క్రీ. శ. 1320 వరకు ఒక శతాబ్దము (అనగా హుళక్కి భాస్కరుని కాలమువరకు) మధ్యకాలములోని కవులతో ఎవ్వరుగాని మంత్రి భాస్కరుని పూర్వకవిగాగాని, రామాయణకర్తగాగాని కీర్తించలేదు. భాస్కరుని పూర్వకవిగా స్తుతించినది క్రీ శ. 1320 తర్వాత జీవించిన కవులు మాత్రమే అందువల్ల ఆ భాస్కరుడు హుళక్కిభాస్కరుడగునుగాని మంత్రి భాస్కరుడనుట పొసగదు.

కేతన 'ఆంధ్రభాషా భూషణ'మను నొక తెలుగు వ్యాకరణమును రచించి లక్ష్యములను నన్నయ రచించిన భారత భాగమునుండి గ్రంథస్థము జేసెను. నన్నయ వాడిన 'వాడిమయూఖముల్', కరకంఠుడు మొదలైన ప్రయోగములను లక్ష్యములుగా జూపెను. అట్టి కేతన తన దశకుమారచరిత్ర కృతిభర్త యైన తిక్కనతాతగారి రామాయణములోని పద్యములను లక్ష్యముగా జూపలేదనిన అట్టి రామాయణమే లేదనుట. అంటే మంత్రి భాస్కరుడు భాస్కర రామాయణకర్త కాడనుటయే సత్యము.

సాధారణముగ ప్రతి కుటుంబములో తల్లి దండ్రులు, తమ తాతముత్తాల ఘనతను తమ పిల్లలకు దెల్పుట సామాన్య విషయము. భోజనముల సమయమందుకాని, చలికాలములో చలిమంటల సమయములో గాని గృహపెద్దలు తమ పిల్లలకు తమ పూర్వుల ఘనత చెప్పుట ఆంధ్రులలో పరిపాటే. అట్టి స్థితిలో రామాయణమంత ఉద్గ్రంథమును వ్రాసిన తనతండ్రి ఘనత కొమ్మన తన కుమారునకు దెల్పక, ఆ గ్రంథమును జూపలేదంటే మంత్రి భాస్కరుడు రామాయణమును వ్రాయలేదనుటే సమంజసము.

ఇక భాస్కర రామాయణమనుపేర చాలామణి అగుచున్న రామాయణమునకు ఆ నామ మెట్లేర్పడి నదో చూడవలసియున్నది. సామాన్యముగా కవులు తాము వ్రాయు గ్రంథమునకు మొదటిసారిగ నామకరణము జేయుటలో వారిపేరును జోడించి గ్రంథనామమిడుట సకృత్తు—అదే కథాకథనము ఒకరికంటే ఎక్కువ మంది కవులుచేసిన దానికిని మొదటి గ్రంథమునకు తేడా తెలుసుకొనుటకు ప్రతి విలేఖకులుగాని పాఠకులు గాని ఆ గ్రంథములపేర్లు గ్రంథకర్త నామములతో జోడించుట సామాన్యధర్మము. ఉదాహరణకు ఎఱ్ఱాప్రగ్గడ రామాయణము, రంగనాథ రామాయణము, మొల్ల రామాయణము మొదలైనవి కావుననే మన భాషలో హుళక్కిభాస్కరాదులు వ్రాసిన రామాయణముతో పాటు ఎఱ్ఱాప్రగ్గడ క్రీ. శ. 1325 ప్రాంతములో వ్రాసిన రామాయణము ప్రజాదరణ బొందుట ప్రారంభమైన తర్వాత ఒకదానిని రెండవ దానినుండి వేరుపరచుటకు వాటిని కవులపేర్లతో జోడించి పిలుచుట ప్రారంభమైన దనవచ్చును అయితే రానురాను ప్రతివిలేఖకుల చేతులలో రెండు రామాయణములలో పద్యములు కలగూరగంపగా కలిసిపోయి చివరకు ఎఱ్ఱాప్రగ్గడ రామాయణము మొదటి వ్యక్తిత్వములు గోలుపోయి కాలక్రమేణా రూపు మాసిపోయి భాస్కర రామాయణ మనుపేర ఐదుగురి కవుల రచనగా మిగిలిపోయి యిప్పుడు మనకు లభ్యమవుచున్నది.

తిక్కన సోమయాజి ఆయన సమకాలపు కవులు మంత్రి భాస్కరుడు రామాయణమును వ్రాసినట్లు చెప్పకపోవుటయే కాక వాటన్నిటి కంటె శ్రీనాథుడు చెప్పిన సాక్ష్యము చూడండి. క్రీడాభిరామములో శ్రీనాథుడు పూర్వకవులుగా స్తుతించిన కవులలో హుళక్కి భాస్కరుడని చెప్పినాడుగాని భాస్కరుడనలేదు.

నన్నయభట్టు తిక్కకవి
నాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూడి యమ
రాధిపుడన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు
నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాడ తగు
నా యిటు దోసపుమాటలాడగన్

(క్రీడాభిరామం - 36)

సారాంశమేమన భాస్కరరామాయణ కర్త తిక్కన సోమయాజి పితామహుడగు మంత్రి భాస్కరుడు కాదు. అతడు సాహిత్యోద్యోపారీణుడు మాత్రమే.

మంత్రి భాస్కరుడు రామాయణము రచించెనని గాఢముగా నమ్మి ఆ నిర్ధారణను స్థాపించుటకు ప్రయత్నించిన కవిచరిత్రకారులలో వాగంటి శేషయ్య

గారు, 1విద్యారత్న నిడుదవోలు వెంకటరావుగారు2 డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు3 కాని, వారు ఈ విషయములో వెలిబుచ్చిన అభిప్రాయములు ఏ మాత్రము తృప్తి కలుగునవి కాక పోవుటయేగాక విపరీతమైన ఊహాగానాలమీద ఆధారపడియున్నవి. అందువల్ల ఆంధ్ర దేశములో ఇప్పుడున్న తాళపత్ర ప్రతులన్నీ శోధించిగాని మంత్రి భాస్కరునికి రామాయణ విషయంలో పెద్ద పీట వేయగూడదని నా అభిప్రాయం.

—శ్రీ సి. బి. వి. అప్పారావు.

## "కవిత్వము-ఇతివృత్తము"

ఏప్రియల్ సంచికలో 'కవిత్వము - ఇతివృత్తము' గురించి శ్రీ కాళ్ళకూరి హనుమంతరావు గారి వ్యాసంలో రాజుల గాథలు ఇతివృత్తాలుగాగల రామాయణ భారతాలు, షేక్స్పియరు నాటకాలు అత్యుత్తమ సాహిత్యమని, రాజుల జీవితాలలో సంఘర్షణ వుంటుందని, సాధారణ మానవుల జీవితాలలో ఉండదని అన్నారు. వారి అభిప్రాయంతో చాలమంది నాలాంటి వారు ఏకీభవించరు

ఏ రచయిత అయినా సమకాలిక జీవితాన్ని తన రచనలో చూపగలిగిన నాడే ప్రసిద్ధుడవుతాడు. వ్యాసుడు, వాల్మీకి తమ తమ రచనలలో ఆ నాటి జీవితాన్ని చూపించారు. కాబట్టే ప్రసిద్ధులయ్యారు. ఆ కాలంలో వారే అభ్యుదయరచయితలు. అట్లే నన్నయాదులు వారికాలంలో అభ్యుదయ రచయితలు. అట్లే నేటి రచయితలు. అంతేకాని కాలాన్నికాదని కేవలం రాజులచరిత్రంతో ఉత్తమసాహిత్యం సృష్టించలేము శ్రీ రావుగారి వాదన సరిఅయితే కొన్నివేలమంది పూర్వకాలపు తెలుగు కవులలో కొద్దిమంది కవులే ప్రజల మనసులలో నిలవారేం? అలాగే నేటి కవులలో గురజాడ, శ్రీ శ్రీ, అరుద్ర, పట్టాభి, వేదుల, తిలక్ మొదలయినవారు పాఠకులని ఆకర్షించారు.

'దేశాన్ని పాలిస్తూ, ప్రజలకోసం ఆత్మత్యాగం చేస్తూ, యుద్ధంలో ప్రాణాన్ని కోల్పోయే రాజులలో 'ఎక్కువ ఇతివృత్తం' ఉంది అంటారు, శ్రీ రావు గారు. కాని రాజు ఒక్కడే యుద్ధం చేయడుకదా! రాజుతో కొన్నివేలమంది సైనికులు యుద్ధానికి వెడతారు, పోరాడుతారు, మరణిస్తారు. వారికోసం వారి తల్లిదండ్రులు భార్య బిడ్డలు దుఃఖిస్తారు. సంఘర్షణ అనేది మానవ జీవితంలోఉంది కాని సంఘంలో మానవుడు అంతస్తుబట్టికాదు అంటేకాకుండా రచయిత ఇతివృత్తాన్ని మలచే Technic లో ఉంది.

'సీత జీవితంలో పరీక్ష ఏర్పడింది కనుక కావ్య నాయికయింది ఊర్మిళ దేవి జీవితంలో అంతగొప్ప పరీక్ష ఏర్పడలేదు కనుక కావ్యంలో అల్పపాత్ర అయింది.' ఊర్మిళ నాయికగా హిందీలో శ్రీ మైథిలీ శరణ గుప్త 'సాకేత్' అనే కావ్యం వ్రాసారు. శ్రీ గుప్తాజీ 'సాకేత్'కి హిందీలో అత్యుత్తమ స్థానం యిచ్చారు. 'సాకేత్' చదివితే—మిగతా రామాయణాల్లో ఊర్మిళకు అన్యాయం జరిగిందని స్ఫురింపచేస్తారు, శ్రీ గుప్తాజీ.

పాశ్చాత్య నాటక సాహిత్యంలో శ్రీ రావుగారు ఎంతకీ షేక్స్పియరునే ఉదాహరణగా తీసుకున్నారు, వారి వ్యాసానికి వీలుగా. కాని వారు షేక్స్పియరుకు ఏమాత్రం తీసిపోని షా, ఇబ్సన్‌లను వదిలివేసారు. బహుశా వీరు నేటికాలానికి చెందినవారని ఏమో!

'నేటి యాంత్రిక జీవితంలో మనిషి కథా నాయకుడుకాగల గాంభీర్యం ఉండడంలేదు' అని వ్రాసారు కాని నేటి కథానాయకుడి లక్షణాలు వేరు. ఇతడు పూర్తిగా 20 వ శతాబ్దికి చెందిన వాడు. రెండు ప్రపంచయుద్ధాలు రుచిచూశాడు. మొదటి ప్రపంచయుద్ధం యూరప్‌లో సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులను తారుమారు చేసింది.

(1) చూడుడు ఆంధ్రకవి తరంగిణి — II సంపుటము, పుట. 76, 118.

(2) తెనుగు కవుల చరిత్ర—పుట 314.

(3) ఆంధ్రపత్రిక ఉగాది సంచిక 1940–41.

రెండవ ప్రపంచయుద్ధం ఆసియాలో పరిస్థితులను మార్చేసింది. అరవై ఏళ్ల క్రితం సాంఘిక విలువలు వేడు లేవు మొదటి ప్రపంచ యుద్ధాంతంలో (1918) మాక్స్‌బీర్‌బమ్ అనే బ్రిటిష్ చిత్రకారుని రెండు కార్టూనులు పత్రికలలో పడ్డాయి. ఒక చిత్రంలో ఆరోగ్యంగాను సంతృప్తితోను ఉన్న మనిషిని, భవిష్యత్తులో ఇంకా సుఖంగా ఉంటాడని ఊహకలిగేలా అదే చిత్రాన్ని పెద్దపరిమాణంలో చిత్రించాడు. రెండవ చిత్రంలో పీలగాఉన్న యువకుణ్ణి మెరిసే కళ్లతో చేతికి నల్లని బ్యాండ్‌తో చిత్రించాడు. అతని భవిష్యత్తులో ప్రశ్నార్థకం ఉంటుంది.

ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత పాల్‌వాలెరీ 1922 లో జ్యూరిచ్ రచయితల మహాసభలో మాట్లాడుతూ

"The storm has died away, and still we are uneasy as if the storm were about to break. Almost all the affairs of men remain in a terrible uncertainity. We do not know what will be born and we fear the future not without reason. Doubt and disorder are in us and with us. There is no thinking man who can hope to dominate this anxiety, to escape from the impression of darkness, to measure the probable duration of this period when the vital relations of humanity are profoundly disturbed.'-

రచయిత తన కాలంనాటి సంఘ వ్యవస్థ నుంచి దూరంగా ఉండలేడు. తను సంఘ వ్యవస్థలో కలిసిపోయినా, విముఖత చూపి దూరంగా జరిగినా అతని రచనల్లో సంఘవ్యవస్థ ప్రత్యక్ష మవుతుంది. కాబట్టి యిప్పటి 'కథానాయకుడిలో గాంభీర్యం లేదని' అనటం సరికాదనుకుంటాము.

—శ్రీ ఎస్. వి. రత్నం.

---



# గ్రంథ విమర్శలు

## చీకటిదారి - చిన్నవదినె

(రచన: కె. రామలక్ష్మి, ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికిందరాబాదు. వెల: రు. 2-00.)

ఈ పుస్తకంలో రెండు నవలిక లున్నాయి

మొదటి రచనలో 'భారతి'కీ రెండో రచనలో చిన్నవదినె 'లక్ష్మి'కీ మంచిపోలిక లున్నాయి. ఇద్దరూ మంచివాళ్ళు. ఇద్దరూ నెమ్మదిగా ప్రశాంతంగా ఆలోచించగలవాళ్ళు. తమ ఉత్తమ సంస్కారమూ, మంచితనమూ ఉపయోగించి తమ జీవితాలనేగాక తోటివారి జీవితాలనుకూడా ఆనందంతో నింపగలవారు. భారతి ఓర్పూ, మంచితనమూ, సంస్కారమూ, ఆమెను బూరెలగంపలాటి సంపన్నుల యింటిలో పడేట్టు చేశాయేగాని ఆమెలోని ఈ ఉత్తమలక్షణాలు సంపూర్ణఫలితాన్ని యివ్వలేదు ఆమె తన మంచితనంతో, సంస్కారంతో శశిరేఖను మాత్రం కాపాడలేకపోయింది. రెండవ నవలికలో 'చిన్నవదినె' లక్ష్మి అలా కాకుండా తన సంస్కారం మంచితనంవల్ల పొందదగిన సంపూర్ణవిజయాన్ని పొందగలిగింది. పరమ పేచీకోరు, గయ్యాళిఅయిన పెద్దవదినలో మార్పు తేగలగడం గొప్పవిజయం క్రిందవే లెక్క.

'చీకటిదారి'లో శశిరేఖ అనే అమాయకురాలు ఉంది. వారిది పరువుప్రతిష్ఠలూ, డబ్బూ పుష్కలంగా కలిగిన వంశం. అయితే ఆ పిల్ల అమాయకంగా ఒక యువకుడికి మనసు అర్పించింది. కాని ఆమె ప్రేమించిన చిన్నవాడికి ఆమెపట్ల ప్రేమ కంటె ఆ కుటుంబంపట్ల కసి ఉంది. నచ్చినవాణ్ణి పెళ్ళిచేసుకునేందుకు తన అన్నగారు అనుమతించ లేదని పట్టుదలతో యింటినీ, అష్టైశ్వర్యాలను వదలి వెళ్ళిపోయిన ఆ యింటి ఆడపడుచు కొడుకు కదా మరి! అతడు తన తల్లికి జరిగిన అన్యాయానికి పగ తీర్చుకునేందుకు గొప్పప్లానే వేశాడు. అమాయకురాలైన శశిరేఖ ఆ పగకు బలి అయి పోయింది. చివరకు ఆ ద్వేషాగ్నిలో అతడు కూడా మసి అయిపోయాడు. భారతి తనకు ఎన్నివిషయాలు ఎంతముందుగా తెలిపినా, శశిరేఖను కాపాడలేక పోయింది

'చిన్నవదినె' మంచిది అందర్నీ ప్రేమతో, అభిమానంతో, మెత్తగా మెల్లగా మాట్లాడుతూ జయిస్తుంది. మరదలుపిల్ల శ్యామలకు చిన్న వదినె అంటే గొప్ప యిష్టం. శ్యామల ఎన్నుకొన్న వరుడితో పెళ్ళి జరిపించేందుకూ, యిష్టం లేనివారిని ఒప్పించేందుకూ బాధ్యత తీసుకుని అష్ట కష్టాలూ, అడ్డమైన మాటలూ సహించి చివరకు జయిస్తుంది చిన్నవదినె చాదస్తమూ, గయ్యాళితనమూ మూర్తీభవించిన 'పెద్దవదినె'నుకూడా దారికి తీసుకురావడంతో శ్యామలకేకాక చదువరులకు కూడా చిన్నవదినెమీద గౌరవం కలుగుతుంది. శ్యామల పల్లెటూరిలో షికారుగా వెళ్ళినప్పుడు అబోతు పొడవ రావటమూ, ఆ ఊరి ఏకైక డాక్టరూ, కరణంగారి ఏకైక పుత్రుడూ అయిన మురహరి ఆమెను రక్షించడంవరకూ సినిమాటిక్‌గా ఉన్నా బాగానే వుంది. అయితే అప్పటికప్పుడే శ్యామల చెట్టంత పరాయి మగడితో జరిపిన సంభాషణ 'ఈ పిల్ల మరీ ఫస్టు నైట్‌లోనే యిలా మాట్లాడుతోందేమిటబ్బా!' అని కొందరు పాఠకులలో అనుమానాన్ని రేకెత్తించ వచ్చు. అది చిలిపితనం క్రింద లెక్కకట్టుకుంటే సరిపోతుందిగాని రచయిత్రి అక్కడే తొందరపడి ఉండనక్కరలేదనిపిస్తుంది. తర్వాత ఎలాగూ రచయిత్రి వారిద్దరిమధ్యా బోలెడంత శృంగారకాండ ('సాయంత్రం అయేసరికి కాళ్ళు తోటలోనికి నడవడం', 'గోముగా భుజంలో తలదాచుకోడం', 'ఇలా నా బ్రతుకు పండుతుందని ఎప్పుడూ ఊహించలేదు' అనడం, 'గుండెలకు హత్తుకోడం,' వగైరాలు)

రోజుల తరబడి నడిపించారు కాబట్టి మొదటి సమావేశాన్ని మామూలు చూపులతో, పరిచయాలతో, తలయూచుటలతో ముగిస్తే బాగుండి పోయేది.

అక్షరాల చెయ్యి తిరిగిన రచయిత్రి చేసిన రచనలు కావడంవల్ల రెండు నవలికలూ ఒక్కబిగిని చదివేయవచ్చు.

## అచలం - చంచలం

(నవల రచన : రేవనూరి సువర్ణ. ప్రతులకు: శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, సికిందరాబాదు వెల 2-00)

ఎమెస్కోవారి చవక పుస్తకాల ప్రణాళిక ధర్మమా అని తెలుగు పాఠకులకు కొన్ని అదనపు సదుపాయాలు లభిస్తున్నాయి పాఠకులకు కొత్త కొత్త పేర్లు వినబడుతున్నాయి. వీరు నెలకు నాలుగింటికి తక్కువకాకుండా పుస్తకాలు అచ్చువేసి విడుదల చేయదలుచుకున్నారు కనుక అన్నీ ప్రసిద్ధ రచయితల కళాఖండాలే అచ్చువేస్తే లాభంలేదు అందువల్ల కొందరు అతిప్రసిద్ధులూ, కొందరు ప్రసిద్ధులూ, మామూలు పేరున్న కొందరూ, అతి కొత్తవారు కొందరూ, ఎమెస్కోవారి ఈ ప్రణాళిక కోసం రచనలు చేస్తున్నారు. అందువల్ల కొన్ని కొత్తపేర్లు, కొంత ముడిసరుకూ ఈ ప్రవాహంలో వెలువడితే ఆశ్చర్య పోనక్కర లేదు.

'రేవనూరి సువర్ణ' అనే రచయిత్రి వ్రాసిన ఈ నవలను ప్రచురణకర్తలు 'నవనాగరిక భావాల ప్రభావం చిత్రించే నవల'గా అభివర్ణించారు.

ఇది ఇద్దరు అక్కచెల్లెళ్ల కథ. పెద్దపిల్ల పద్మ ఒంటరితనాన్ని ప్రశాంతతనూ కోరుకుంటుంది. ఆమె చెల్లెలు రాధ చుట్టూ సందడి ఉంటేగాని బ్రతకలేదు పద్మకు చెరువులూ, ప్రకృతీ, తోటలూ యిష్టం రాధకు ఎల్లప్పుడూ ఫ్రెండ్సూ, ఫంక్షన్సూ విస్కీ పార్టీలూ ఉండాలి. పద్మకు సంబంధం కుదిరింది...మాధవరావు ఈ దేశంలో ఉన్నత విద్య అభ్యసించి విదేశాలలో కూడా పెద్దపరీక్షలో ఉత్తీర్ణుడై వచ్చాడు.' 'అబ్బే! ఏం ఉద్యోగాలండీ!' అని చప్పరించే గొప్ప సంపన్నుడికి వాటంగా ఒక్కగానొక్క కొడుకు, మాధవరావుకూ, పద్మకూ పెళ్లి అయింది. ఆ పెళ్లిలోనే హుషారుగా అటూ యిటూ తిరుగుతూ రాధ మాధవరావును ఆకర్షించింది. మాధవరావు తత్వానికి పద్మతత్వానికీ చాలా భేదం ఉంది. రవీంద్రభారతిలో ఒకనాడు జరిగిన కవి సమ్మేళనం సందర్భంగా మాధవరావు పాతమిత్రుడు అన్నారావు అనే కవి రంగంలో ప్రవేశించాడు. అతడు కవిగా పద్మను ఆకర్షించాడు కథ యిలా ఉండగా రాధ ఒక పర్యాయం అక్కగారి యింటికి వచ్చింది. మాధవరావును ఎన్నికలలో పోటీచేయమని అందరూ పట్టుబట్టారు. రాధ కూడా 'థ్రిల్స్' యిష్టపడే స్వభావంకలది కావడంతో బావగారిని వత్తిడిచేసింది. అతని తండ్రిని ఒప్పించి ఖర్చులకోసం 'చెక్కు'లు కూడా సంపాదించింది. కృష్ణప్రసాద్ అనే యువకుడు లోకసభకూ, మాధవరావు అసెంబ్లీకి నిలబడ్డారు. రాధ విరామంలేకుండా పనిచేయడం ప్రారంభించింది. రోజూ పగలల్లా ఎన్నికల ప్రచారం. రాత్రి వేళకు పెద్దపెద్ద విస్కీపార్టీలూ తన ఒక్కచేతి మీదుగా నిర్వహించింది కృష్ణప్రసాద్ రాధ చురుకుతనాన్నీ, కలుపుగోరుతనాన్నీ చూసి ముచ్చటపడి ఆమెను పెళ్లిచేసుకుందామనుకున్నాడు కాని ఈ లోపల తాగనేర్చిన పెళ్లిందుకువచ్చిన రాధ తప్పటడుగు వేసింది. పద్మ యింట్లోలేదు. మందు పుచ్చుకున్న రాధా మాధవులు ఒక్కటయ్యారు. 'నీవు కావాలి' అని బావగారు అనడమూ, 'తీసుకోండి. ఎందుకు సంకోచిస్తున్నారు?' అని మరదలు సమాధానం చెప్పడమూ, ఇక బాహువల్లరులలో బంధించడాలూ; ఉక్కిరిబిక్కిరి అయిపోవడలూ; గాఢంగా

ముద్దులు పెట్టుకోడాలూ; దేహాన్నంతా పెదవుల ద్వారా అర్పించడాలూ; 'దీపం ఆర్పేయమంటావా?' 'నీ యిష్టం.. నాకేమీ తెలియడంలేదు'. వంటి ప్రశ్నలూ, సమాధానాలూ; ఇదీ వరుస మరుసటి రోజు రాధ, కృష్ణప్రసాద్ భవంతికివెళ్లి అతని తల్లిని చూసివచ్చింది ఆ రాత్రి మాధవరావు రాధను మరింత ఎక్కువగా 'కోరాడుట'. అక్కడ పద్మ, అన్నారావు కవిత్వాంబుధిలో మునకలువేస్తూ కాలం గడుపుతున్నది కాని అన్నారావు దుష్టస్వభావం ఆమె యింకా గ్రహించలేదు ఇక్కడ మాధవరావు ఎన్నికలలో గెలిచాడు. ఆ సందర్భంలో పార్టీ...అప్పుడే పద్మకూ, మాధవరావుకూ అన్నారావు నిజస్వరూపం తెలిసింది తర్వాత లోకసభ ఫలితాలు తెలిసి కృష్ణప్రసాదు కూడా గెలిచాడు. అంతా సంతోషంగా ఉన్నారు. కాని రాధకుమాత్రం ఆందోళన ప్రారంభమైంది. 'మరొకరి శిశువును కడుపులో పెట్టుకొని ఆ జమీందార్ల కోడలుగా ఎలా వెళ్లగలను?' అవి వాపోయింది. చివరకు కృష్ణప్రసాదుకు ఒక ఉత్తరం వ్రాసిపడేసి హుసేన్‌సాగర్‌లోపడి ఆత్మహత్య చేసుకున్నది. ఆమె చిత్రపటాన్ని హాల్లో పెట్టారు కృష్ణప్రసాద్ పెళ్లి మానేసి 'రవిడే నా భార్య ఇంకెవరికీ ఆ స్థానం లభించదు' అని ఆ ఫొటోకు పూలమాల వేశాడు. పంచదార ఫ్యాక్టరీ పనివారి కోసం యిళ్లు కట్టించి ఆ ప్రదేశానికి 'రాధానగర్' అని నామకరణం చేశారు.

ఇదీ ఈ నవలలో కథ. పాఠకులను ఆకర్షించగల, ఆలోచింపజేయగల కొత్తఅంశాలేవీలేని చాలా నేలబారుకథ. రచయిత్రి రచనాధోరణి చాలా 'వీరాడియోాకర్'స్థాయికి చెందినది. కొన్నిపట్టాలలో కథనధోరణి రచయిత్రి మానసిక అపరిపక్వతను పసితనాన్ని ప్రతిబింబిస్తున్నది. ఇటీవల కొందరు రచయిత్రులు 'ధైర్యంగా, సాహసంతో సెక్స్ విషయాలనుగురించి వ్రాస్తున్నారు' అనే మెప్పు పొందడంకోసం అవసరానికి మించిన మోతాదులో సెక్స్ పోషించి తమ పాత్రలను అసహ్యమయంగా ప్రవర్తింపజేస్తున్నారు. ఆ ప్రయత్నంలో వారి పసితనమూ, అపరిపక్వతా గోప్యంగా ఉండిపోతాయని కూడా వారు ఆశిస్తున్నారు కాని యిట్టి రచనల విషయంలో పాఠకులు పొరబడరు.

ఈ నవలను ప్రకాశకులు ఏ ప్రమాణాలతో పరిశీలించి తమ ప్రణాళికలో వెలువరించారో తెలియడం లేదు ఈ 'నెలకు నాలుగు పుస్తకాల' పరంపరలో అన్నీ అద్భుత కళాఖండాలే వెలువడుతాయని పాఠకులకు భ్రమలేమీ లేవు. మంచితోపాటుగా మామూలు సగటు రచనలుకూడా కొన్ని వచ్చిపడక తప్పదు. కానీ మరీ నీరసపు, నిష్ఫల రచనలు వెలువరించ నక్కరలేదు. ఎమెస్కో పాకెట్ బుక్స్‌వారు మరింత శ్రద్ధగా 'స్క్రూటినీ' తర్వాత రచనలు ఎన్నికచేస్తే, సంఖ్యలోనే కాక గుణంలోనూ ఫలితం కనిపిస్తుంది.

—పి.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.